శ్రీమతే రామానుజాయ నమః

శ్రీవత్సాంక (కూరత్తాళ్వాన్) ప్రణీతము

# అతిమానుషస్తవము

## భావనావ్యాఖ్యానము



డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీవత్సాంక (కూరత్తాళ్వాన్) ప్రణీతము – అతిమానుషస్తవము
భావనావ్యాఖ్యానము – డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు, తిరుపతి.

ప్రథమముద్రణ :పార్థివ – చైత్రము – ఆర్ద్ర – మే 2005
ఆవిష్కరణము – భగవద్రామానుజావతారోత్సవ సందర్భముగా

ప్రతులు : 500

మూల్యము : రూ. 25/-



ప్రతులకు : 1. ఉ.వే.శ్రీమాన్ కె.వేంకటాచార్యస్వామి
16-14-1, కావలివారివీధి, నరసాపురం, (ప.గో.జిల్లా)
పిన్ : 534 275, ఫోన్ : 08814-275811

2. శ్రీమతి ఈ. జయలక్ష్మి
18-3-58/7, శాంతినగర్,
కె.టి. రోడ్, తిరుపతి – 517 507
ఫోన్ : 0877 – 22232091

అక్షరయోజనము & ముద్రణ :
**అన్నపూర్ణ గ్రాఫిక్స్ స్క్రీన్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
53/4, ఆర్.ఎస్. గార్డెన్స్, తిరుపతి – 517 507,
ఫోన్ : 2235006 (0877)



న్యాయవేదాంత విద్వాన్,
**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**
నరసాపురం

# ఆమోదము

భగవద్రామానుజులకుగల అసంఖ్యాకులైన శిష్యులందటిలో ప్రధానులు శ్రీవత్సాంకులు. వీరు అనితర సాధారణమైన వైదుష్యమునేకాక, అనన్యాదృశమైన ఆత్మగుణసంపత్తిని కూడ కలవారు. **"పవిత్రీకృతకూరేశః"** అనునట్లు వీరిని శ్రీరామానుజులు పవిత్రస్థానీయులుగా తలచిరి. **"యత్పాదకోటీరయోః సంబంధేన"** అను రీతిలో ఆళ్వార్లు, పూర్వాచార్యులు శ్రీరామానుజుల శిరస్సంబంధముచేతను, తదనంతరాచార్యులు పాదసంబంధముచేతను తరింపగా, ఆ రామానుజులు కూరేశుల సంబంధమువలన తమకు పరమపదప్రాప్తి కల్గుట నిశ్చయమని తలచిరట. వీరి వైభవము ఎంత గొప్పదో తెలుపుటకు ఈ ఉదంతమొక్కటి చాలును. శ్రీభాష్యరచనను సైతము రామానుజులు కూరేశుల సహాయసహకారములతోనే పూర్తి కావించిరనుట ప్రసిద్ధము. ఈ మహనీయులు అనుగ్రహించిన పలు కృతులలో **"పంచస్తవి"**గా పేరుపొందిన అయిదు స్తోత్రములు శ్రీవైష్ణవసోత్రసాహిత్యమునందేకాక, ప్రపంచభక్తిసాహిత్యములోనే అగ్రస్థానమును అలంకరించుచున్నవి.

కూరేశుల స్తోత్రములన్నియు దివ్యసూరుల ప్రబంధములవలెనే భగవన్నిర్హేతుక కృపా మూలకములు, భగవదనుభవపరీవాహరూపములును అగుటచే మధురాతిమధురములు. కుసుమపేశలమైన కూరేశుల హృదయము వీరి స్తోత్రము లన్నిటియందు ప్రతిబింబించుచున్నను, అతిమానుషస్తవమున అది విశేషముగా వ్యక్తమగుచున్నది. ఈ విషయము **"య త్తాదృశాగసమ్"**, **"హా హంత హంత"**, **"వేణుక్వణప్రణయిని"** ఇత్యాది పలు శ్లోకములలో నిరూపింపబడినది.

ఈ స్తుతిలోని శ్లోకములన్నియు సంస్కృత వేదముల, ఆళ్వార్ల దివ్యప్రబంధముల మధురభావనలను అనుసంధించుచున్నవనుటకు **"మధున ఉత్స ఇతి ప్రతీతః"**, **"అంభోదనీల మరవిందదళాయతాక్షమ్"** అను మొదలగు శ్లోకములు తార్కాణములు. ప్రస్తుత స్తోత్రము **"అతిమానుషశీలవృత్తవేషైః"** ఇత్యాదిగా ప్రారంభింపబడుట సాభిప్రాయకము. ఈ స్తుతిలోని శ్లోకములు భగవానుని విభవావతారములోని అతిమానుషశీలమును, వృత్తమును, వేషమును, విక్రమప్రతాపములను వర్ణించునవియే కదా! ఇట్టి పలు వైశిష్ట్యములను కల్గినది కావుననే ఈ స్తోత్రము ప్రపన్నులకు నిత్యానుసంధేయమై అలరారుచున్నది.

ఈ స్తుతికి సంస్కృతము మొదలగు పలుభాషలలో వ్యాఖ్యానములు అనేకములున్నను, మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారి తత్త్వార్థ చింతామణి వ్యాఖ్య మిక్కిలి ప్రశస్తిని పొందినది. ఇంతవరకు ముద్రింపబడని గార్గ్యరామానుజాచార్య కృతసంస్కృతవ్యాఖ్య ఒకటి వున్నది. వీరిని అనుసరించుచు శ్రీ చి. శింగరాచార్యులు ప్రస్తుత వ్యాఖ్యానమును విన్నపించెను. ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో భగవద్విషయ కాలక్షేపమును చేసిన చరమపర్వనిష్ఠులొకరు అందించిన ఆర్థిక సహాయము, ప్రోత్సాహములే ఈ ప్రయత్నమునకు మూలము. ఇందులకు వారిని హృదయపూర్వకముగా అభినందించుచు వారి భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠ మూడు పువ్వులు ఆరు కాయలుగావృద్ధిచెందవలెనని ఆశాసించుచున్నాను, వ్యాఖ్యాత చి. శింగరాచార్యులకు సమస్తసన్మంగళములు కలుగవలెనని ఆశీర్వదించుచు, ఇతోఽధికమైన శక్తిసామర్థ్యములను, ఆయురారోగ్యమును ప్రసాదింపవలసినదిగా వాత్సల్యమూర్తి శ్రీరామచంద్ర ప్రభువును, విజ్ఞులగు పెద్దలను ప్రార్థింతును.

నరసాపురం
23-3-05

భాగవత విధేయుడు
**ఈ. రంగాచార్యులు**

# నమ్రనివేదనము

మకరే హస్తనక్షత్రే సర్వనేత్రాంశసంభవమ్ ।
శ్రీమత్కూరకులాధీశం శ్రీవత్సాంక ముపాస్మహే ॥

## కూరేశవైభవము

శ్రీవైష్ణవాచార్యపరంపరలో శ్రీవత్సాంక, శ్రీవత్సచిహ్న, కూరనాథ, కూరేశాది నామములతో ప్రసిద్ధులైన కూరత్తాళ్వాన్‌కు విశిష్టస్థానము కలదు. భగవద్రామానుజుల అంతరంగశిష్యులలో ప్రథమగణ్యులగు వీరు **"రామస్య దక్షిణో బాహుః"** అనురీతిలో ఆ ఆచార్యవర్యులకు కుడిభుజమనదగినట్లు సహాయభూతులై, **"పవిత్రీకృతకూరేశః"** అనునట్లు పవిత్రస్థానీయులైయుండిరి. వీరి పుత్రులే పరాశరభట్టర్, వ్యాసభట్టరును. విశిష్టాద్వైతదర్శనము కొఱకు తమ దర్శనద్వయమును త్యాగము చేసిన మహానుభావులు వీరు. **"నాన్‌పెఱ్ఱపేఱు నాలూరాన్ పెఱవేణుమ్"** అనిన నిర్హేతుకకృప వీరిది. వీరి స్వభావము కుసుమపేశలమనుటకు ప్రకృతస్తుతియగు అతిమానుషస్తవమే చాలును. వీరి ప్రభావమును, కటాక్షవిశేషమును నిరూపించు అద్భుతమైన ఈ క్రింది ఐతిహ్యమొకటి పెరియతిరుమొழி **"శిలైయిలఙ్గు"** (8-1) వ్యాఖ్యానములో పరమకారుణికులగు పెరియవాచ్చాన్‌పిళ్లైచే ఉట్టంకింపబడినది. **"రాజేంద్రశోழனిలే ఒరు బ్రాహ్మణన్ మకన్ బుద్ధరోడే సంప్రదాయ ముణ్డాయ్, పూణూలైయుమ్, కుడుమియైయుమ్ అఱుత్తు పొకట్టాన్. కూరత్తాழ்వాన్ అఙ్గే నడన్దవళవిలే శిఖాయజ్ఞోపవీతఙ్గళై ధరిత్తుక్కొణ్డు వన్దు పుకున్దాన్. పితావానవన్ "కూరత్తాழ்వానై సన్దిత్తాయో? ఎన్ఱు కేట్టాన్, పుఱమ్బుళ్లార్ – "నీ ఇదు అతిన్దపడి ఎఙనే?" ఎన్ఱుకేట్క, "ఆழ்వాన్ సన్నిధియిల్ తమోభిభూతరుమ్ సత్వస్థరావర్‌కళ్ కాణ్ ఎన్ఱాన్"**. ఇట్టి వీరి పలు వైభవములనుబట్టియే **''మెழி యైయెక్కడక్కుమ్ పెరుమ్ పుకழான్''** అని, **''వాచామగోచరమహాగుణదేశికాగ్ర్యకూరాధినాథ''** అని, **''శ్రీవత్సాంకం శ్రుతిమతగురుచ్ఛాత్రశీలైకధామ"** అనియు మన పూర్వాచార్యులచే వీరు కీర్తింపబడిరి. ఆళ్వార్లవలె వీరును భగవద్గుణానుభవసాగరమగ్నులగుటచే భగవద్రామానుజులు వీరిని **"ఆழ்వాన్"** అని సంబోధించిరని, అదియే వీరికి నిరూపకనామమయ్యెనని పెద్దలందురు. దివ్యప్రబంధముల వ్యాఖ్యానములలో పలుచోట్ల వీరికి సంబంధించిన ఐతిహ్యములు అనేకములు ప్రస్తావింపబడినవి.

## అతిమానుషస్తవరచనము :

అప్రమేయవైభవమునుకల ఈ ఆచార్యవర్యులచరిత్ర సుప్రసిద్ధమగుటచే, విస్తరభయముచే ఎక్కువ వివరములను ప్రస్తావించుట లేదు. ప్రస్తుతము వ్యాఖ్యానము చేయబడు అతిమానుషస్తవమునుగూర్చి కించిత్తు విన్నపింతును. చోళరాజుసభకు శ్రీరామానుజుల వేషమును దాల్చి వెడలిన కూరేశులు అచట పరతత్త్వనిర్ణయమొనర్చిన సందర్భమున దర్శన ద్వయమును కోల్పోయి, రామానుజుల విశ్లేషముతో బాధపడునపుడు, తిరుమాలిరుమ్‌శోలై అనుదివ్యదేశమున కొంతకాలము నివసింపవలెనని తలచి, దారిలో భగవద్గుణానుభవమును చేయుచు, తమ మనస్సున ఊఱటను పొందగోరి, ముందుగా వైకుంఠస్తవమును, ఆ పిమ్మట అతిమానుషస్తవమును అనుగ్రహించిరని, అనంతరము క్రమముగా సుందరబాహుస్తవ, వరదరాజస్తవ, శ్రీస్తవములను కృపజేసిరని పూర్వాచార్యచరిత్రగ్రంథములు పేర్కొనుచున్నవి. ఈ అయిదు స్తుతులు పంచస్తవి



అను పేరుతో ప్రసిద్ధములు. ఈ స్తోత్రముల క్రమమున అభిప్రాయవైవిధ్యమున్నను, పలువురు పెద్దలు పై క్రమమునే అంగీకరించిరి.

## నామనిరుక్తి

ఈ స్తోత్రమునకు అతిమానుషస్తవమను పేరు ఎట్లు వచ్చెనను ప్రశ్నను శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో ఇట్లు సమాధానించిరి – ఈ స్తుతి **"అతిమానుషశీలవృత్తవేషైః"** అనుచు ప్రారంభమగుటచే **"ముదఱ్కుఱిప్పు"** అను లక్షణమునుబట్టి దీనికి అతిమానుషస్తవమని పేరు కల్గినది అని, ఇట్టి విధానమును **"జితంతేస్తోత్రము, అమలనాదిపిరాన్, కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** మొదలగు పలు కృతుల పేర్లలో గమనింపవచ్చును అని సామాన్యముగా చెప్పుటకు వీలున్నను, శ్రీరాముని, శ్రీకృష్ణుని పలు అతిమానుషలీలలను వర్ణించుటకై ఉద్దేశింపబడినదగుటచే దీనికి అతిమానుషస్తవమను పేరు సుసార్థకము అని విజ్ఞులగు పెద్దలందురు. అతిమానుషులైన రామకృష్ణుల స్తవమగుటచే దీనికట్టి పేరు వచ్చెననియు చెప్పుదురు. **(మానుషాన్ అతిక్రాంతమ్ అతిమానుషమ్)**. మనుష్యులను మించినది అతిమానుషము అగును. మానవజాతిలో జన్మించి, **"ఆత్మానం మానుషం మన్యే"** అని, **"అహం వో బాంధవో జాతః"** అనియు పల్కినను, జటాయువునకు పరగతిని అనుగ్రహించుట, సముద్రముపై వారధిని కట్టుట, గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తుట, సాందీపిని పుత్రానయనము, వైదిక పుత్రానయనము మొదలగునవి భగవానుని అతిమానుషలీలలు. ఇట్టి దివ్యచేష్టితములను **''నెఞ్జాల్ నినైప్పరిదాయ్''** అనునట్లు మనుష్యులభావనకుకూడ అందనివి అగుటచే అతిమానుషములే కదా!.

## స్తోత్రప్రమేయము :

మొదటి స్తోత్రమగు వైకుంఠస్తవములో పరత్వే పరత్వ విషయముగా తెలుపదగిన పలు అంశములను ప్రస్తావించిన కూరేశులు, వ్యూహరూపమును మనస్సున భావించి, అనుభవించిరి. పిమ్మట అవతారరూమగు విభవమునందు ఆసక్తులై ఈ స్తుతిని రచింపగోరి, ఇందు పలు అవతారవైలక్షణ్యములను కీర్తింపనెంచినను, విశేషముగా, రామావతారకృష్ణావతార లీలలయందు తమకుగల అభినివేశాతిశయమును వ్యక్తీకరించిరనుట స్పష్టము. ఇందు అత్యధిక శ్లోకములు ఈ రెండు అవతారములను గూర్చియే కదా! ఈ స్తుతి శబ్దసందర్భమాధుర్యమునను, అర్థగాంభీర్యమునను మిగిలిన నాల్గింటిని అతిశయించుచున్నదని, అత్యంతమృదుమనస్కులుగా పేరొందిన కూరేశుల స్వభావమును ఈ స్తవము ప్రస్ఫుటము చేయుచున్నదని శ్రీఅణ్ణాస్వామివారివంటి అభిజ్ఞుల భావన.

## ద్వయార్థవివరణము :

పూర్వాచార్యుల స్తోత్రములన్నియు ద్వయార్థప్రతిపాదకములు. ఈ స్తుతియు అందులకు భిన్నము కాదనుటను ఇందలి పలు శ్లోకములు నిరూపించుచున్నవి. ఈ అంశము వ్యాఖ్యలో ఆయా సందర్భములలో యథావకాశముగా వివరింపబడినను, సందర్భానుగుణమను ఉద్దేశ్యముతో కొంచెము ప్రస్తావింపబడుచున్నది. ద్వయములోని పూర్వఖండార్థమున ప్రతిపాదింపబడిన శరణాగతి ఇందు స్తుతిప్రారంభములోనే **"వరయే వైష్ణవవైభవావతారమ్"** అనుచు ప్రస్తావింపబడగా, రెండవ శ్లోకములో **"శ్రీరంగరాజచరణాంబుజ మున్నయామః"** అనుచు ఉత్తరఖండార్థమైన కైంకర్యము

తెలుపబడినది. ఇట్లు మొదటి రెండు శ్లోకములందు ద్వయార్థము ప్రతిపాదింపబడిన పిమ్మట, ఆశ్రయణసౌకర్యాపాదకములు, ఆశ్రితకార్యాపాదకములును అగు స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య, వాత్సల్యము, జ్ఞాన, శక్తి, ప్రాప్తి, పూర్తి మొదలగు గుణవిశేషములను ప్రకటించు పలు అవతారములలోని సందర్భములను స్తుతించిరి. **"శీలక క ఏష హంత"** ఇత్యాదిగా సౌశీల్యము, సౌలభ్యము, వటపత్రశాయి క్షీరాబ్ధిమథన, గోవర్ధనోద్ధరణాది వృత్తాంతములద్వారా అఘటితఘటనారూపశక్తి, జ్ఞానము **"పరావరేశమ్"** ఇత్యాదిగా స్వామిత్వము, **"నిరాదరేణ"** ఇత్యాదిగా పూర్తి – ఈవిధముగా ప్రస్తుత శరణాగతిసందర్భానుగుణములగు పలు కల్యాణగుణములను కీర్తించి, మరల చివరలో **"త్వదీయచరణౌ శరణం ప్రపద్యే"** అని ప్రపత్తిచేయుటయేగాక, తాము చేయు ప్రపత్తికూడ ఉపాయ కోటిలోనికి చేరదనుటను **"మయోక్తాం వాచం దయయైవ సత్యాం కురుష్వ"** అనుచు కేవలము భగవానుని నిర్హేతుకకృపయే ఉపాయమని నిర్ధారించిరి. ఈవిధముగా ప్రకృతస్తోత్రము ద్వయార్థవివరణాత్మకమనుట మిక్కిలి స్పష్టము. **"యం ప్రజాపతి ర్వేద స పుణ్యో భవతి"** **"యమేవైష వృణుతే తేన లభ్యః"** ఇత్యాది సంస్కృతవేదాంత సూక్తులయందు, **"వెఱిదే అరుళ్ శెయ్‌వర్"**అని, **"నిన్నరుళే పురిన్దిరున్దేన్"** అని, **"అదువుమ్ అవనదు ఇన్నరుళే"** అనియు ఇత్యాదిగాగల ద్రావిడవేదాంత సూక్తులయందు ఘోషింపబడు భగవానుని నిర్హేతుకకృపావైభవమును కూరేశులు ఈ స్తుతిలో **"దయైకసింధో" (10), "భవతో దయాయాః" (59) "దయయైవ దయైకసింధో" (60)** అనుచు పలుచోట అనుసంధించిరి. ఈ సిద్ధాంతమునే తదనంతర ఆచార్యులగు శ్రీపిళ్లైలోకాచార్యులవారు మొదలగు మహనీయులు శ్రీవచనభూషణము మొదలగు గ్రంథములలో మరింత విశదీకరించిరి.

కూరేశులు ఈ స్తోత్రములోని ప్రతిశ్లోకము దివ్యసూరుల ప్రబంధములలోని సూక్తుల అర్థమును అనుసంధించుచున్నవనుట ఆ యా శ్లోకవివరణమున నిరూపింపబడినది. అందుచే మరల ప్రస్తావించుట లేదు. **"వేణుక్వణ"** (45) అను శ్లోకమున వేణుగానవశముచే పలు వస్తువులు తమ తమ ధర్మములను కోల్పోయినట్లు వర్ణించుటచే అతిశయోక్తి, **"ఏతత్ కథం కథయ"** (26) అను శ్లోకమున విభావన, విరుద్ధకార్యోత్పత్తి రూపవిషమాలంకారము, **"మాత్రా యది"** (41) అను శ్లోకమున అర్థాంతరన్యాసము, **''జ్ఞానం బలమ్''** (6) అను శ్లోకము పాంచరాత్రాగమమూలకమగుటచే ఆగమప్రమాణాలంకారము, **"అతిమానుషశీల"** (1) అను శ్లోకమున అసమాలంకారము, **"మానుష్యకం చరితమ్"** (2) అను శ్లోకమున విశేషము – ఇట్లు పలు అలంకారముల ప్రయోగమును ఇందు గమనింపవచ్చును. అనుప్రాసాలంకారము కూరేశులకు అత్యంతప్రియమనుట **"నిరర్గళవినిర్గళత్", "కాంతాలకాంత మమలం కమలాయతాక్షమ్"** ఇత్యాది పలుప్రయోగములు సాక్ష్యములు. **"తేరిథ, జిగేథ, జజ్ఞిథ, అచూచురః, సలిలాంబభూవుః"** **"విపలాయిథః"** ఇత్యాది విలక్షణక్రియాప్రయోగములు వీరి వ్యాకరణశాస్త్రవైదుష్యమును తెలుపుచున్నవి. ఇందు భగవద్విషయికరతిరూపభక్తిరసము ప్రధానమైనను, **"యన్నామ నాథ నవనీత మచూచురః"** మొదలగు చోట్ల హాస్యము, **"సంజీవయ న్నపి సుతమ్"** అను మొదలగు సందర్భములలో అద్భుతము – ఇట్లు పలు భిన్న రసముల పోషణముకూడ చేయబడినది. ఈ విధముగా ప్రస్తుతస్తోత్రము అనేక రీతులలో విలక్షణమైనది.

**అతిమానుషస్తవప్రభావము**



కూరేశుల సూక్తిప్రభావముద్ర తదనంతర ఆచార్యులకై స్పష్టముగా గోచరించు చున్నదనుటకు పలు నిదర్శనములు కలవు. కూరేశుల **"బ్రహ్మేశమధ్యగణనా"** అను సూక్తిని అనుసరించుచు **"మధ్యే విరించగిరిశం ప్రథమావతారః"** అని, **"ముగ్ధశ్శిశుః"** అను సూక్తిని అనుసరించుచు **"వటదళ మధిశయ్య"** అని, **"గీతేన యేన హి శిలా స్సలిలాంబభూవుః"** అనుటను అనుసరించుచు **"శైలోఽగ్ని శ్చ జలాం బభూవుః"** అని ఇట్లు భట్టరు పలు రీతులలో కూరేశులను అనుసరించిరి. ఇంతకంటే మిక్కిలి స్పష్టమైన, ఆశ్చర్యకరమైన విషయము వేరొకటి కలదు. శ్రీవచనభూషణ అరుంబదాది పలు ఉద్గ్రంథములను రచించిన విద్వత్తల్లజ్ఞులైన శ్రీవాధూలవీరరాఘవాచార్యస్వామివారు (అణ్ణావప్పఙ్గార్). ఈ అతిమానుషస్తవమును సర్వథా అనుకరించుచు శ్రీరామానుజాతిమానుషస్తవమను ఒక అద్భుతస్తుతిని 60 శ్లోకములతో రచించిరి. ఇది ఇంకను అముద్రితము. **''అతిమానుషశీలవృత్తనేషైః''** అను రీతిలోనే **"అతిశాయితరామకృష్ణవృత్తైః"** అనుచు ఆ స్తుతిప్రారంభమగుట, అందలి శ్లోకములును వసంతతిలక వృత్తబద్ధములగుట, **"కథమ్, కథమ్"** అనుచు పలు శ్లోకములలో ప్రశ్నచేయుట, **"జిగేథ, జగంథ"** వంటి ప్రయోగములను చేయుట, చివరలో **"రామానుజార్య భగవన్ శరణం త్వ మేవ"** అనుచు శరణవరణమును చేయుట, ఇత్యాదిగా అతిమానుషస్తవముతోగల పలు సామ్యములు గోచరించుచున్నవి. ఈవిధముగానే వేదాంతదేశికాదిపూర్వాచార్యులపై ఈ స్తవప్రభావము వారి గ్రంథములలో, వ్యాఖ్యలలో ఇందలి పలు శ్లోకములనువారు ప్రమాణములుగాగైకొనుటద్వారా వెల్లడియగుచున్నది. విస్తరభీతిచే ఆ వివరములను పేర్కొనుట లేదు.

**వ్యాఖ్యలు :**

కూరేశుల పంచస్తవికి సంస్కృతమున శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము సుప్రసిద్ధము. ఇది 1875లోనే ముద్రింపబడినది. ఈ వ్యాఖ్యయేకాక, సంస్కృతభాషలో గార్గ్యరామానుజాచార్య కృతమైన వ్యాఖ్య, వేంకటనివాసవిరచితమైన వేరొక వ్యాఖ్యయు కలవు. ఇవి ఇప్పటివరకు వెలుగు చూడకపోవుట శోచనీయము. ఇటీవలికాలమున శ్రీమాన్ డా॥ పి. పద్మనాభన్‌గారి పర్యవేక్షణలో శ్రీమతి గీతగారు గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్యను సంకలనమొనర్చి పి.హెచ్.డి. ఉపాధిని మద్రాసు విశ్వవిద్యాలయముద్వారా పొందిరి. ఈ వ్యాఖ్యలో చూపబడిన పలు పాఠభేదములు, శ్లోకక్రమభేదములు, అన్వయభేదములు, అర్థవిశేషములును ప్రస్తుతవ్యాఖ్యలో యథావకాశముగా చూపబడినవి. ఇవికాక మణిప్రవాళభాషలో మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారి సుమధురమైన తత్త్వార్థచింతామణి అనువ్యాఖ్య కలదు. ఇందు పలు విశేషార్థములేకాక, దివ్యసూరిసూక్తులతో సామ్యములు అడుగడుగునా చూపబడినవి. ఇది పలు పర్యాయములు ముద్రింపబడినది. ప్రస్తుతవ్యాఖ్యలో ఇందలి కొన్ని విశేషములు కృతజ్ఞతాపూర్వకముగా గైకొనబడినవి. శ్రీ అణ్ణాస్వామివారివ్యాఖ్యయొక్క ఆంధ్రీకరణముకూడ పలుమార్లు ముద్రితము. ఉ.వే. శ్రీమాన్ శేట్టలూరు శ్రీవత్సాంకచార్యస్వామివారి తమిళవ్యాఖ్య వేరొకటి కలదు. గురువర్యులు, పరమపదవాసులు, పండితరాజ, వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ ఎన్.సి.వి. నరసింహాచార్యస్వామివారు (తిరుపతి), శ్రీవైష్ణవసింహ, ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామి

వారును కలసి పరిష్కరించి, సిద్ధముచేసిన పంచస్తవ – శ్రీనివాసాచార్యవ్యాఖ్య తిరుమల–తిరుపతి దేవస్థానములవారిద్వారా ఇటీవలే ముద్రింపబడుట అస్మదాదులకు ప్రమోదావహము. మిగిలిన పూర్వాచార్యకృతస్తుతుల వ్యాఖ్యానములకును ఇట్టి సమీక్షాత్మకసంస్కరణముల ఆవశ్యకత ఎంతయో కలదు. భగవదనుగ్రహముచే ఇది అచిరకాలములోనే తీరగలదనియు భావించెదము. తెనుగులో శ్రీమాన్ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారి సంగ్రహవ్యాఖ్య, శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యులవారి టీకాతాత్పర్యములు మొదలగునవి ఉన్నను, విశదవ్యాఖ్య ఇంతవరకు ప్రకటింపబడలేదు. ప్రస్తుతవ్యాఖ్య విపులమైనదని చెప్పవీలులేకున్నను, ఇందు యథావకాశముగా కొన్ని విశేషములు విన్నపింపబడుటచే దీని ప్రత్యేకతను సహృదయపాఠకులు గ్రహింపగలరు.

**కృతజ్ఞతావిష్కరణము**

దీనిని అస్మత్పితామహపాదులు, ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి– శేషశింగరాచార్యస్వామి వారుఅగు ప్రతి శనివారం రాత్రి తమ ఇష్టదైవము శ్రీరామచంద్రస్వామివారి సన్నిధిలో ఆర్తితో అనుసంధించుకొనుట, అస్మదాదిదాసవర్గముచే అనుసంధింపచేయుటయు ఇప్పటికినీ కళ్లకు కట్టినట్లున్నది. ఆ మహనీయుల అనుసంధానము, దివ్యకటాక్షముల ఫలమే ఈ వ్యాఖ్యకు బీజము. ఈ ప్రయత్నమున నన్ను ప్రోత్సహించి, **"స్థాలిత్యే శాశితారమ్"** అనునట్లు సరిచేసి, మార్గదర్శనముతో అనుగ్రహించి, మంగళాశాసనములను చేసిన మత్పితృపాదులు, **న్యాయవేదాంత విద్వాన్ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి** సన్నిధిలో కృతజ్ఞతాపూర్వకప్రణామములను సమర్పించు కొనుచున్నాను. నన్నీ కార్యమునకు ప్రేరేపించిన ఆచార్యసేవాపరాయణులు, సహృదయశిరోమణుల సన్నిధిలో, (వారి పేరు ప్రకటించుటకూడ వారికి అభిమతము కాదు) వారి ఆచార్యులు నా ప్రయత్నమును ఆమోదించి, ఆశీర్వదించిన మాతులపాదులు ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో కార్తజ్ఞ్యపురస్సరముగా ప్రణమిల్లుచున్నాను. ఈ ముద్రణను తమ కాలక్షేప ఆచార్యులగు ఉ.వే. శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో కైంకర్యరూపముగా సమర్పింపతలంచిన ఆ స్వామివారిని హార్దికముగా అభినందించుచున్నాను. అతి స్వల్పకాలములో ఈ గ్రంథమును అక్షరయోజనచేసి నాకు సహకరించిన సహృదయులు, మన్మిత్రము శ్రీ జె.వి.యస్.యస్.ఆర్.శర్మగారికి, కుమారి అభిలాషగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాను. పరమ గంభీరములైన, కూరేశుల సూక్తులను పరిమితబుద్ధిని, జ్ఞానమునుకల దాసుడు వివరింపనెంచుట హాస్యాస్పదమే అయినను, సహజచాపలముచేతను, యథాశక్తి ఆ ఆచార్యవర్యుల సన్నిధిలో వాచికకైంకర్యమును చేసికొని, తరింపవలెనను ఆశచేతను ఈ సాహసయత్నమును చేసితిని చాలా ఈ వ్యాఖ్యలోని సదసద్వివేచనను వారికే వదలివేయుచు సెలవు తీసికొనుచున్నాను.

1. **అతిమానుషనుతి రేషా ప్రోక్తా శ్రీకూరనాథగురువర్యైః ।
వ్యాక్రియతే గురుకృపయా ప్రీత్యై విదుషాం యథామతీదానీమ్ ॥**

2. **శ్రీమత్కూరేశసూక్తీనా మవాఙ్మానసగోచరమ్ ।
గాంభీర్యం క్వాల్పశక్తే ర్మే క్వ వచాంసి మితాన్యహో ॥**



3. **ప్రసీదంతు భవంతో మే విద్వాంసో గుణలోలుపాః ।
నీరక్షీరవిధానేన వ్యాఖ్యాం పశ్యంతు భావనామ్ ॥**



శ్రీమతే రామానుజాయ నమః

# కూరత్తాళ్వాన్ తనియన్
## (స్తుతికర్తృప్రార్థన)

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమఉక్తి మధీమహే ।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**

యత్ + ఉక్తయః = ఏ కూరేశుల సూక్తులు, త్రయీకంఠే = వేదమను అతివయొక్క కంఠమునందు, మంగళసూత్రతాం = మంగళసూత్రమగుటను, యాంతి = పొందుచున్నవో, అట్టి, శ్రీవత్సమిశ్రేభ్యః = శ్రీవత్సచిహ్నులను పూజ్యులకు, నమ ఉక్తిం = నమస్కారమును, అధీమహే = పల్కుచున్నాము.

శ్రీవత్సాంకుల సూక్తులు వేదకాంతకంఠమునందు మంగళసూత్రముగా శోభిల్లుచున్నవి. అట్టి ఆ మహనీయులకు నమస్కారమును చేయుచున్నాము.

(ఈ శ్లోకములోని అర్థవిశేషములు దాసుని శ్రీరంగరాజస్తవపూర్వశతకవ్యాఖ్య వరివస్యలో విన్నపింపబడినవి. సహృదయపాఠకులను అచట కటాక్షింప ప్రార్థింతును. విస్తరభీతిచే వానిని ఇచట నివేదించుట లేదు)



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీవత్సాంక (కూరత్తాళ్వాన్) ప్రణీతము

# అతిమానుషస్తవము

## భావనావ్యాఖ్యానము

1. **అతిమానుషశీలవృత్తవేషై**
**రతివృత్తామరవిక్రమప్రతాపైః ।**
**అతిలంఘితసర్వలోకసామ్యం**
**వరయే వైష్ణవవైభవావతారమ్ ॥**

**శ్రీశేషశింగరార్యం శుభగుణచరితం పితామహం భక్త్యా ।**
**పితరం చ రంగరామానుజగురు మనఘం సమాశ్రయే నిత్యమ్ ।**
**స్తవమ్ శ్రీ కూరనాథాఖ్యగురువర్యైః ప్రసాదితమ్ ।**
**అతిమానుషనామానం వ్యాకరోమి యథామతి ॥**

అతిమానుష = మానవాతీతములైన (అనగా – దివ్యములైన), శీల = సౌశీల్యము, (లేక స్వభావము), వృత్త = వర్తనము, వేషైః = రూపము అను–వీనిచే, అతివృత్త = అతిక్రమింపబడిన (మించిన), అమర = దేవతల, విక్రమ = విక్రమము, ప్రతాపైః = ప్రతాపములచేతను, అతిలంఘిత= అతిక్రమింపబడిన, సర్వలోక = సమస్తజనులతో (లేక, సమస్తలోకములతో), సామ్యమ్ = పోలికను కల, వైష్ణవ = విష్ణువుయొక్క, వైభవావతారమ్ = విభవావతారమును, వరయే = సమాశ్రయణీయముగా వరించుచున్నాను.

దివ్యములైన శీలాదిగుణములచేతను, స్వభావముచేతను, ప్రవర్తనల (లీలల) చేతను, రూపములచేతను, దేవతల విక్రమప్రతాపములకు మించిన విక్రమప్రతాపములచేతను **"న తత్సమశ్చా**



**భ్యధిక శ్చ దృశ్యతే"** **(శ్వేతా. 6-8)** అని, **"ఒత్తార్ మిక్కారై యిలైయాయ మామాయా"** **(తి.వా.2-3-2)** **"తన్నొప్పారిల్ అప్పన్"** **(తి.వా. 6-3-9)** అను రీతిలో నిస్సమాభ్యధికమైన శ్రీమన్నారాయణుని విభవావతారమును సమాశ్రయణీయముగా వరించుచున్నాను.

ప్రస్తుతస్తుతిలో ప్రధానప్రమేయము విభవావతారమాహాత్మ్యమగుటచే **"వరయే వైష్ణవవైభవావతారమ్"** అనుచు దానిని వర్ణ్యముగా వరించుచున్నానని కూరేశులు మొదటగా ప్రతిజ్ఞ చేయుచున్నారు. పూర్వాచార్యకృతస్తోత్రములన్నియు ద్వయార్థప్రతిపాదకములని శిష్ట సంప్రదాయము. ఆక్రమములో ఈ స్తుతియందును ద్వయపూర్వఖండార్థము విభవావతారవిషయమున కూరేశులు అనుసంధించుచున్నారనియు చెప్పవచ్చును. చివరలో కూడ **"త్వదీయచరణౌ శరణం ప్రపద్యే"** అని, **"శరణాగతశబ్దభాజః"** అనుచు శరణాగతిని చేయుట ఇందులకు ఉపోద్బలకముగా గొనవచ్చును. **(అతిమానుషశీలవృత్తవేషైః)** – భగవానుడు మనుష్యాది రూపములలో అవతరించినను **"ఆదియమ్ శోదియురువై యఙ్గువైత్తిఙ్గుప్పిఱన్ద"** అను రీతిలో, **"జన్మ కర్మ చ మే దివ్యమ్"** **(భ.గీ. 4-9)** అను రీతిలోను మానవాతీతములైన శీల, వృత్త, వేషములను కల్గియుండును. **"ఇమౌ స్మ మునిశార్దూల కింకరౌ సముపస్థితౌ"** **(రామా.బాల.31-4)** అని, **"అప్యహం జీవితం జహ్యామ్ త్వాం వా సీతే సలక్ష్మణామ్"** **(రామా.ఆరణ్య.10-19)** అను మొదలగు సూక్తులవలన శ్రీరామచంద్రుని అతిమానుష శీలము, **"మానుష్యకం చరిత మాచరితుం ప్రవృత్తో దేవాతిగం చరిత మంగ కి మంగ్యకార్షీః, యత్ సాగరే బత! బబంధిథ నాథ! సేతుమ్"** **(22)** అనునట్లు వారధినిర్మాణము ఇత్యాదిగాగల అతిమానుషవృత్తములు, **"పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"** **(రామా.అయో.3-28)** ఇత్యాదిగా అతిమానుషరూపమును (వేషము) వ్యక్తములు. అట్లే, **"అంభోదనీల మరవిందదళాయతాక్షమ్"** **(48)** ఇత్యాదిగా శ్రీకృష్ణుని అతిమానుషరూపము, **"సత్యేవ గవ్యనివహే నిజధామ్ని భూమ్నా పర్యంతసద్మసు కిమర్థ మచూచుర స్త్వమ్"** **(38)** అని, **"గోపాలనాది యదిదం భవదీయకర్మేత్యార్ద్రీకరోతి విదుషాం హృదయమ్"** **(54)** ఇత్యాదిగా శీలవృత్తములును వ్యక్తములు. ఇట్లు భగవదవతారములన్నిటియందు శీలవృత్త వేషములు అతిమానుషములేననుట గమనింపతగినది. శీలశబ్దము **"శీలం స్వభావే సద్వృత్తే"** అను నిఘంటువచనమును బట్టి ప్రవర్తనను (చేష్టను), స్వభావమును తెలుపును. కావున ఇచట ప్రకృతప్రయోగముచే భగవానుని స్వరూపరూపగుణచేష్టితములు నాల్గును తెలుపబడినవి.

**(అతివృత్తామరవిక్రమప్రతాపైః)** – సహజముగానే మానవుల విక్రమ ప్రతాపములకంటే దేవతల విక్రమప్రతాపములు మెండుగా నుండును. వారి విక్రమప్రతాపములకంటే మించిన విక్రమప్రతాపమును స్వామి అవతారదశలో కూడ కల్గియుండును. దీనిని స్తోత్రకర్త **"త్రిలోకగురు మీశ్వర మీశ్వరాణాం బాణాహవే కి మితి శంభు మజృంభయ స్త్వమ్"** **(56)** ఇత్యాదిగా వివరించిరి. విక్రమమనగా – ఎట్టి భయసంకోచములును లేక శత్రుపక్షములో ప్రవేశించు శక్తివిశేషము,

ఇతరులు ఆక్రమించి, పరాభవించుటకు వీలుకాని, ఇతరులకు సహింపసాధ్యముకాని శక్తివిశేషము ప్రతాపము. ఇట్టి విక్రమప్రతాపములు భగవానుని అవతారములలో అడుగడుగునా వ్యక్తమగుచుండుననుట ఈ స్తుతిలోని పలు శ్లోకములలో నిరూపింపబడినది. **"అతివృత్తామర విక్రమప్రతాపైః"** అను ప్రయోగమును స్వతంత్రవిశేషణముగాకాక, **"అతిమానుషశీలవృత్తవేషైః"** అను ప్రయోగమునకు విశేషణముగా కూడచేసి అన్వయింపవచ్చును. స్వతంత్రవిశేషణము చేసినపుడు విక్రమప్రతాపములకు బహువచనప్రయోగము ఎట్లు కుదురును? అనినచో, ఆయా సందర్భములనుబట్టి బహువచనార్థము సమన్వయించుకొనవచ్చునని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"తదానీ మవాంతరభేదేన బహుత్వం ద్రష్టవ్యమ్"** అని అచటి వివరణము. **(అతిలంఘిత సర్వలోకసామ్యమ్)** – (లోకశబ్దమునకు లోకములనియు, జనులనియును అర్థము చెప్పుట ద్వారా) ఈ లోకములోని ఎవరితోనేకాక, ఏ లోకములోనైనను ఎవరితోను పోలికలేదనియు చెప్పనగును.

**(వరయే)** – ఇచటి ఆత్మనేపదప్రయోగమును **"వర మాచష్టే – వరయతే"** అని వివరింపనగునని శ్రీకాంచీ అణ్ణాస్వామివారి సూక్తి. వరమనగా శ్లాఘ్యమని అర్థము. విభవావతారమును శ్లాఘ్యముగా పల్కుదుననగా పొగడుదుననియే కదా అర్థము. ఈవిధముగా కవి తాను స్తుతిలో వర్ణింపబోవు విషయములను సూక్ష్మముగా సూచించుటచే ఈ స్తుతికి మొదటశ్లోకము సంగ్రహరూపము. ఇట్టి ప్రక్రియ తిరువాయ్‌మొళ్రి దివ్యప్రబంధాదులలో పూర్వాచార్య స్తోత్రములలో కాననగును. **"ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్"** అని కదా! సూక్తి.

**"యః సర్వజ్ఞః సర్వవిత్" (ముణ్డక.1-1-9)** అని, **"పరాఽస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" (శ్వేతా.6-8)** అని, **"త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" (శ్వేతా.6-7)** అని, **"న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే" (శ్వేతా.6-8)** అని, **"అపహతపాప్మా విజరో విమత్యుః... సత్యకామః సత్యసంకల్పః" (ఛాందో. 8-7-1)** అని ఇత్యాది శ్రుతులలో తెలుపబడిన కల్యాణ గుణములు పరవ్యూహములలో కంటె అవతారములందే ప్రస్ఫుటముగా ప్రకాశించును. కావున అవతారము సమాశ్రయణీయమను అర్థ మిచట భాసించుచున్నది. స్తోత్రప్రారంభములో **"వరయే"** అను ప్రయోగముద్వారా (నమస్కారము తెలుపబడుటచే) మంగళాచరణము చేయబడినది. అట్లే, స్తుతిప్రతిపాద్యమును సంగ్రహముగా పేర్కొనుటచే వస్తురూపమంగళమును చేయబడినది. **"అతిలంఘితసర్వలోకసామ్యమ్"** అనుచు ఎవరితోను సాదృశ్యము చెప్పవీలుకాదనుటచే అనన్వయాలంకారము వ్యంగ్యము. అట్లే, **"వరయే"** అను క్రియాప్రయోగముచే భగవద్విషయక భక్తిరూపరసధ్వని, **"వైష్ణవవైభవావతారమ్"** అను సూక్తిద్వారా విభవావతారమహిమరూపవస్తు ధ్వనియు కలదని చెప్పనగును. ఈవిధముగా వస్త్వలంకారసరూపధ్వనిత్రయమిచట భాసించుటచే ఉత్తమ కావ్యమునకు ఉదాహరణ మీ శ్లోకము. **''అతివృత్తామరవిక్రమ ప్రతాపైః''** అనునపుడు **''అతివాయ్వింద్రియ కర్మాణమ్ అతిసూర్యాతితేజసమ్"** అను భీష్మస్తవరాజసూక్తి అనుసంధేయము. శ్రీపరాశరభట్టర్ **"అతీంద్రియః"** అను నామమును వ్యాఖ్యానించుచు **"అవిదితవిభవాయ ఇతి తన్మంత్రవర్ణః"** అని, పిమ్మట ఈ ప్రమాణమును గ్రహించిరి. అట్లే, భగవానుని వేషము ఆశ్చర్యమును కల్గించుననుటకు – **''త్రైలోక్యవిస్మయకరం కాంతాకృతిధరం స్మరేత్''** అను ప్రమాణమును చూపిరి. ప్రకృతశ్లోకానుగుణముగా – **"త్వాం శీలరూపచరితైః" (స్తోత్రరత్న-15)** ఇత్యాది యామునుల శ్లోకము, **"రూపశ్రియా పరమయా పరమేణ ధామ్నా చిత్రై శ్చ కైశ్చిదుచితైః భవత శ్చరిత్రైః, చిహ్నై రనిహ్నవపరై రపరై శ్చ కైశ్చిత్" (వైకుంఠ-29)** అను వైకుంఠస్తవసూక్తియు అనుసంధేయములు. శ్రీగార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో ఈ మొదటి శ్లోకము కనుపించుటలేదు. **"శ్రేయః కిరంతు"** అను రెండవ శ్లోకము నుండి ఆ వ్యాఖ్య ప్రారంభమైనది. కాని, పలు ప్రతులలో, ప్రాచీనకాలము నుండి అనుసంధానములో ఈ శ్లోకము కలదు. స్తుతిప్రారంభములో భగవద్వాచకమగు అకారము ప్రయోగింపబడుటచే మంగళాచరణము చేయబడినది. ఈ శ్లోకము సమవృత్తజాతికి చెందిన మాలభారిణి అను వృత్తమున రచింపబడినది. లక్షణము **"విషమే ససజాగురావనోజే సభరాయశ్చతు మాలభారిణీయమ్"**.

**2.** **శ్రేయః కిరంతు కిరణా శ్చరణారవింద-**
**నిష్యందమానమకరందరసౌఘదేశ్యాః ।**
**తజ్జా శ్శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః**
**మాంగల్యరంగనిలయస్య పరస్య ధామ్నః ॥**

మాంగల్య = గొప్ప శుభకరమగు, రంగ = శ్రీరంగమును, నిలయస్య = నివాసముగా కలవాడు, పరస్య = ఉత్తమమైన, ధామ్నః = తేజోరూపుడగు శ్రీరంగనాథునియొక్క, చరణ+అరవింద= పాదపద్మములనుండి, నిష్యందమాన = స్రవించుచున్న, మకరందరస = తేనెయొక్క, ఓఘ = ప్రవాహముతో, దేశ్యాః = పోలియున్నట్టివి, శ్రుతేః = వేదమువలన, మధునః ఉత్సః = మకరందముయొక్క ప్రవాహము, ఇతి = అని, ప్రతీతాః = ప్రసిద్ధి కల్గినవి అగు, తజ్జాః= ఆ శ్రీరంగనాథుని పాదములనుండి పుట్టిన, కిరణాః = కాంతులు, శ్రేయః = మంచిని (మనకు), కిరంతు= విస్తరింపచేయునుగాక!

గొప్ప శుభమును కల్గించు శ్రీరంగదివ్యక్షేత్రమును నివాసముగాకలవాడు, పరంజ్యోతిస్స్వరూపుడగు శ్రీరంగనాథుని పాదపద్మములనుండి పుట్టిన కిరణములు ఆ పాదపద్మములనుండి స్రవించుచున్న తేనెల సోనలవలె యున్నవి. వేదమును వానిని **"మధ్వ ఉత్సః"** అనుచు మకరందప్రవాహముగా కీర్తించినది. అట్టి శ్రీరంగనాథుని పాదపద్మముల కిరణములు మనకు మంచిని విస్తరింపచేయునుగాక!

అతిమానుషస్తవమను ఈ స్తోత్రప్రారంభమున కవి రామకృష్ణాద్యవతారములను

స్తుతింతునని ప్రతిజ్ఞ చేసిరి. కాని, వెను వెంటనే ఈ శ్లోకములో అర్చారూపియైన శ్రీరంగనాథుని స్తుతించుచున్నారే! అను సందేహము ఇచట కలుగవచ్చును. దీనికి వ్యాఖ్యాతలు అనేక విధములలో సమాధానమిచ్చిరి. భగవానుని అవతారములు **"బహూని మే వ్యతీతాని జన్మాని" (భ.గీ.4-5)** అని, **"ఎన్నిన్ఱ యోనియుమాయ్ ప్పిఱన్దాయ్" (తిరువిరు-1)**, **"ఆస్తాం తే గుణరాశివత్ గుణపరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా" (శ్రీరంగరాజ.)** అనియుగల పలు ప్రమాణములనుబట్టి అనేకములయినను, వానిలో ప్రధానములు శ్రీరామావతార, కృష్ణావతారములు. ఆ రెండు అవతారముల ప్రతినిధి శ్రీరంగనాథుడే. శ్రీరంగములోని మూలమూర్తిని శ్రీరామచంద్రునిగా, ఉత్సవమూర్తిని శ్రీకృష్ణునిగా పూర్వాచార్యులు సంభావించిరనుట ప్రసిద్ధము కదా! దివ్యసూరులును- **"మామునివేళ్వియైక్కాత్తు అవపిరదమాట్టియ అడుతిఱలయోత్తి ఎమ్మరశే అరజ్గత్తమ్మా" (తిరుప్పళ్ళి-4)** అని, **"కోవలనాయ్ వెణ్ణెయుణ్డ వాయన్ ఎన్నుళ్లమ్ కవర్న్దానై"** అని ఇట్లు పలు సూక్తులలో రామకృష్ణావతారములను ఎత్తి, యా దివ్యలీలలను చేసినది శ్రీరంగనాథుడేనని పల్కిరి. మఱియు, విభవావతారమును అనుభవించునపుడు మధ్యలో అర్చారూపిని స్తుతించి సమాధానపడుట, అర్చామూర్తిని కీర్తించునపుడు విభవరూపములను స్మరించి మనస్సు కుదుట పఱచుకొనుటయును దివ్యసూరులకు, పూర్వాచార్యులకు సమానమైన విషయము. ఈ స్తుతిని రచించిన శ్రీవత్సాంకులు అర్చావతార ప్రధానములైన సుందబాహుస్తవ, వరదరాజస్తవములలో మధ్య మధ్య అవతారములను వర్ణించుటను గమనింపవచ్చును. కావున ఇచట శ్రీరంగనాథుని స్తుతించుట యుక్తమే. ఈ శ్లోకమునుండి నాల్గు శ్లోకములలో కవి శ్రీరంగనాథుని స్తుతించుచున్నారు.

**(చరణారవింద . . . రసౌఘదేశ్యాః) - "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (వి.సూ.)** అను శ్రుతివాక్య మిచట అనుసంధేయము. శ్రీరంగనాథుని పాదపద్మకాంతులను కవి తాము మకరందప్రవాహముగా ఉత్ప్రేక్షించుటను శ్రుతి ప్రమాణముతో సమర్థించుచున్నారు. **"మధ్వ ఉత్సః"** అనగా తేనెయొక్క ప్రవాహమని అర్థము. పదములను పద్మములతో పోల్చుటకు అనుగుణముగా పాదముల కాంతులను పద్మములనుండి స్రవించు మకరందప్రవాహముతో పోల్చిరి. **"అత్ర గంగాజల మేవ మాధుర్యాతిశయేన మకరందశబ్దేనోక్తమ్"** అని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. ఇందులకు అనుగుణముగా ఆ వ్యాఖ్యానములో **"తదస్య ప్రియ మభిపాథో అస్యామ్"** ఇత్యాది శ్రుతిలోని **"విష్ణోః పాథః"** అనుటకు **"పాదసలిలం గంగాజల మితి యావత్"** అనియు తెలుపబడినది.

**(మాంగల్యరంగనిలయస్య) - "మంగల్య"** అనియు పాఠాంతరము కలదు. అర్థభేదము లేదు. **"మాంగల్య"** అను విశేషణమును ప్రథమపాదములోని **"శ్రేయః"** అను పదముయొక్క అర్థమునకు తగినట్లు ప్రయోగింపబడుట గమనింపతగినది. దీనిని రంగశబ్దమునకు, లేక రంగనిలయమునకును అన్వయింపవచ్చును. రంగమను పదము ఉభయకావేరిమధ్యలోగల అంతరీపము (ద్వీపము)ను, భగవానుని ఆలయమును, స్వామి వేంచేసియున్న విమానమును



నిర్దేశించును. వీనిలో ఇచట దేనినైనను గ్రహింపవచ్చును.

**(పరస్య ధామ్నః) - "పరంజ్యోతి రుపసంపద్య" (ఛాందో.8-12-2)** అని, **"తం దేవా జ్యోతిషాం జ్యోతిః", (బృహ.6-4-16) "అణియార్పొழ్ిల్ శూழ் అరజ్గనకరప్పా! . . పరంజోతీ" (కలియన్.11-8-8)** ఇత్యాది పరశ్శత ప్రమాణములు ఇచట అనుసంధేయములు.

**(శ్రేయః)** - ఇచట శ్రేయస్సునకు **"శ్రేయ శ్చ ప్రేయ శ్చ"** అను కఠోపనిషత్ సూక్తిలో శ్రేయశ్శబ్దముచే తెలుపబడిన మోక్షమును అర్థముగా చెప్పనగును. **"అన్యాన్ న మన్యామహే"** అను రీతిలో ప్రపన్నులు ఏది కోరినను అది భగవానుని వలననే పొందగోరుదురు కదా! **"ఉన్నాలల్లాల్ యావరాలుమ్ కుఱైవేణ్డేన్" (తి.వా.5-8-3)** అని కదా ఆழ்్వార్లసూక్తి. ప్రస్తుత సందర్భమునుబట్టి తాము ప్రారంభించిన స్తుతిని నిర్విఘ్నముగా పూర్తి చేయుటకు అవసరమైన వాగ్వైభవమును అనుగ్రహింపవలయునని కవి ఇచట ప్రార్థించుచున్నారని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అతిమానుషావతార-చరిత్రస్తోత్రానుగుణాం వాణీసమృద్ధిం ప్రదిశంత్వితి హార్దో భావః"** అని అచటి వివరణము. పూర్వశ్లోకములో నమస్క్రియా వస్తునిర్దేశరూపమంగళద్వయము చేయబడగా, ఇందు ఆశీర్వాదరూపమంగళము ఆచరింపబడినది. ఇట్లు స్తుతిప్రారంభములోని మొదటి రెండు శ్లోకములలో మంగళత్రయాచరణము చేయబడినది.

**(రసౌఘదేశ్యాః)** దేశ్యశబ్దము ఉత్ప్రేక్షావాచకము. ఇంచుమించు సదృశమైనదని అర్థమునిచ్చును. **"ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః"** అను పాణిని సూత్రమిచట స్మరణీయము. ఈ శ్లోకమునుండి అన్ని శ్లోకములు వసంతతిలకవృత్త నిబద్ధములు. శ్రీరంగనాథుని పాదకములు మధుప్రవాహములుగ ఉత్ప్రేక్షింపబడుటచే ఇందే ఉత్ప్రేక్ష కలదు.

3. **శ్రీమత్పరాంకుశమునీంద్రమనోనివాసాత్**
**తజ్జానురాగరసమజ్జన మంజసాఽఽప్య ।**
**అద్యాప్యనారతతదుత్థితరాగయోగం**
**శ్రీరంగరాజచరణాంబుజ మున్నయామః ॥**

శ్రీమత్పరాంకుశమునీంద్రకైంకర్యలక్ష్మిని (లేక భక్తిసిరిని కల) నమ్మాழ்్వార్ల, మనః = మనస్సులో, నివాసాత్ = ఎల్లప్పుడు నివసించుట వలన, తత్ + జ = ఆ మనస్సులో పుట్టిన, రాగరస = అనురాగ (భక్తి) మను రసమునందు, మజ్జనమ్ = స్నానమును, అంజసా = త్వరగా, ఆప్య = పొంది, అద్య + అపి = ఈ నాటికిని, అనారత = విచ్ఛేదములేని, తత్+ఉత్థిత = ఆ అనురాగము వలన పుట్టిన, రాగ = ఎఱ్ఱదనముయొక్క, యోగం = సంబంధమును కల్గినది(గా)అగు, శ్రీరంగరాజచరణాంబుజమ్ = శ్రీరంగనాథుని పాదపద్మమును, ఉన్నయామః= శిరసావహించుచున్నాము (భావించుచున్నాము).

ఇందు శ్రీరంగనాథుని పాదముల రక్తిమకు ఒక హేతువును ఉత్ప్రేక్షించుచు, కవి ఆ

పాదములందు శరణాగతి చేయుచున్నారు.

**"కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్"(శ్రీరంగరాజ-పూర్వ)** అను రీతిలో భగవద్విషయములోని అనురాగము నమ్మాళ్వార్లుగా రూపుదిద్దుకొన్నది. **"కాదల్ కడల్పురైయ విళైవిత్త"** అని వారే స్వయముగా తమ భక్తివిశేషమును గూర్చి సాయించిరి కదా! అట్టి అపారమైనభక్తిని, **"ఒழிవిల్ కాలమెల్లామ్ ఒழுవిలావడిమై శెయ్యవేణ్డుమ్ నామ్" (తి.వా.3-3-1)** అనెడి నిత్యమైన, సమస్తకైంకర్యమును చేయవలెనను కోతికను కలవారు ఈ దివ్యసూరులు. వారి హృదయములో భగవానుడగు శ్రీరంగనాథుడు నివసించుచున్నాడు. నమ్మాళ్వార్ల హృదయములో భగవద్విషయ కానురాగము నిత్యమై వర్ధిల్లుచుండుటచే, వారి హృదయములోని అనురాగసంబంధమును స్వామిపాదములు నిత్యము కల్గియుండును. కావుననే కాబోలు శ్రీరంగనాథుని పాదములు ఇప్పుడును ఎఱ్ఱగానే ఉన్నవి. అట్టి స్వామి చరణారవిందములను తలపై దాల్చుచున్నాము.

**(శ్రీమత్ . . . మనోనివాసాత్)** - కవిసమయమును బట్టి అనురాగము ఎఱ్ఱని రంగును కల్గినదిగా వర్ణింపబడుచున్నది. **"యశసి ధవళతా వర్ణ్యతే హాసకీర్త్యో, రక్తౌ చ క్రోధరాగౌ"** అని కదా కవిసమయము. భగవానుని విషయములోని అనురాగము అనగా భక్తియే కదా! **"శ్రీమత్"** అను విశేషణములోని శ్రీశబ్దమునకు భక్తి అని కాని, కైంకర్యము అని కాని చెప్పవచ్చును. శ్రీపరాశరభట్టరు **"భూతం సరస్య"** ఇత్యాది తనియన్ శ్లోకములో నమ్మాళ్వార్లను గూర్చి **"శ్రీమత్పరాంకుశమునిమ్"** అని ప్రయోగించుటకు మూలము ఈ సూక్తియేయనదగును. భగవద్భక్తి, భగవత్కైంకర్యమును సంపదగా చెప్పబడుచున్నవి. **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః", (రామా.బాల.18-31) "స తు నాగవరః శ్రీమాన్", "అంతరిక్షగతః శ్రీమాన్" (రామా.యుద్ధ.16-17)** అని కదా ప్రమాణములలో శ్రీమచ్ఛబ్దమునకు కైంకర్యలక్ష్మినికలవారని అర్థము చెప్పబడినది. పరాంకుశ నామమునకు **''మదావలిప్తర్క్కు అఙ్కుశమిట్టు''** అను రీతిలో విద్యామద-ధనమద-అభిజనమదములను మూడు మదములను అణచునట్టి గొప్ప అంకుశమువంటివారని, భగవానుని అస్తిత్వమును అంగీకరింపనివారియొక్క లేక అంగీకరించినను రూపము లేదు, గుణములు లేవనుచు వాదించువారి యొక్క మతములను తమ సూక్తులతో తిరస్కరించినవారని, పరుడగు గజమువంటి భగవానుని **"మాల్వణ్ణనై మలక్కు నావుడైయేఱ్కు" (తి.వా.6-4-9)** అను రీతిలో తమ సూక్తులనెడి అంకుశముతో వశము చేసికొనగలవారని అర్థము. **"ముని"** అనగా మననశీలుడని అర్థము. **"ఎణ్ణాదన వెణ్ణుమ్ నన్ముని" (తి.వా.10-7-5)** అని, **"ఆళుమాళార్" (తి.వా.8-3-3)** అనియు భగవానునకు ఇతోఽధిక సంపద కలుగవలెనని, రక్షణము కలుగవలెనని తలచి, యోగక్షేమములను ఆశాసించి, ఆలోచించువారు ఈ ఆళ్వార్లు. అట్లే, జీవుల యోగక్షేమములనుగూర్చి **"ఇవైయెన్న వులకియల్కై" (తి.వా. )** అని, **"శురుఙ్గచ్చొన్నోమ్ మానిలత్తెవ్వుయర్క్కుమ్" (తి.వా.9-1-7)** అనియు పల్కిన రీతిలో ఎల్లప్పుడు చింతించువారు కావునను ముని అనబడుచున్నారు. మునీంద్రశబ్దముచే దివ్యసూరులలోని శఠకోపుల ప్రాముఖ్యము



సూచితము.

**(తజ్జానురాగ . . . మజ్జనమ్)** - **"తత్"** శబ్దము నమ్మాళ్వార్ల మనస్సును నిర్దేశించును. భగవానుని స్వరూపరూపగుణవిభూతుల దివ్యానుభవములో **"ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి" (భార.మోక్ష.4-50)** అను రీతిలో మునిగిన దివ్యసూరులు ఆళ్వార్లుకాగా, ఆ ఆళ్వార్ల మనస్సులో ఎల్లప్పుడు పెల్లుబుకు అనురాగ రసములో మునిగి, స్నానముచేసిన స్వామియు ఒక ఆళ్వార్లు అయినాడు. ఈ సూక్తిలోని స్వారస్యము సహృదయైకవేద్యము కదా!. ఈ ప్రయోగమును అనుసరించియే ప్రాయశః భట్టరు- **"తద్వదుదారనిమ్నప్రసన్నశీతాశయమగ్ననాథాః"** అని శ్రీరంగరాజస్తవములో పల్కిరి.

**(అంజసా)** - వేగముగా **"తత్త్వేన ద్రుత మితి వా"** అని రామానుజాచార్య వ్యాఖ్య. **"తత్త్వే త్వద్ధాంజసా ద్వయమ్"** అను అమరకోశవచనమునుబట్టి ధ్రువమను అర్థమును గ్రహింపవచ్చును. సత్యముగా అనియు అర్థము. **"ఆప్య"** అనునపుడు **"ఆఙ్"** అను ఉపసర్గము కూడుకొన్నది అగుటచే ల్యబంతరూపము యుక్తమే. **"ముక్తి మాప్య పరమాం పరే పదే"** అని కూరేశులు సుందరబాహుస్తవములో ప్రయోగించిరి అని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(ఉన్నయామః)** పైకి ఎత్తుట అనగా శిరసా ధరించుటయే. **"యావ న్న చరణౌ . . . శిరసా ధారయిష్యామి" (రామా.అయో.98-8)** అని కదా లక్ష్మణస్వామి ఆశ. ఈ పదముద్వారా కవి శ్రీరంగనాథుని చరణారవిందములలో శరణాగతిని చేసిరి. ఇందుచే ఈ స్తుతి ద్వయమంత్రార్థ ప్రతిపాదకమనుటయు తెలియుచున్నది. తిరువాయ్మొழிలో **"కఙ్గులుమ్ పకలుమ్"** (7-2) అను ఒక్క దశకమునందే నమ్మాళ్వార్లు శ్రీరంగనాథుని స్తుతించిరి కదా! ఎల్లప్పుడు నమ్మాళ్వార్ల హృదయములో శ్రీరంగనాథుడు ఉన్నాడనుట ఎట్లు? - అనినచో, **"వాన్ తికழுమ్ శోలై మదిళ్ అరఙ్గర్ వణ్ పుకழ்మేల్ ఆన్ఱతమిழ్మాలైకళ్ ఆయిరమ్"** అను రీతిలో తిరువాయ్మొழி ప్రబంధమంతయు శ్రీరంగనాథునిగూర్చియేనని పూర్వాచార్యుల అభిమతము కావున యుక్తమే. నమ్మాళ్వార్లే స్వయముగా **"ముకిల్ వణ్ణనడిమేల్ శొన్నశొన్మాలై ఆయిరత్తుళ్" (తి.వా.7-2-11)** అని పలుకగా, ఇచటి **"ముకిల్ వణ్ణన్"** అను నామము శ్రీరంగనాథుని నిర్దేశించుచున్నదని పరమార్థవిదులగు పూర్వాచార్యుల వివరణము. **"తిరుక్కడిత్తానముమ్ ఎన్నుడైచ్చిన్దైయుమ్ ఒరుక్కడుత్తుళ్ళే యుఱైయుమ్ పిరాన్'' (తి.వా.8-6-2)** అని, **''ఉళ్ళపుకున్దు నీఙ్గాళ్నడియేనదుళ్ళత్తకమ్" (పెరియతిరు-68)** అనియు గల పలు సూక్తులు నమ్మాళ్వార్ల మనస్సులోని భగవానుని నిత్యవాసమును తెలుపుచున్నవి.

**4** **వజ్రధ్వజాంకుశసుధాకలశాతపత్ర -**
**పంకేరుహాంకపరికర్మపరీతమంతః ।**
**ఆపాదపంకజవిశృంఖలదీప్రమౌళేః**
**శ్రీరంగిణ శ్చరణయో ర్యుగ మాశ్రయామః ॥**

అంతః = లోపల, వజ్ర = వజ్రము, ధ్వజ = పతాక, అంకుశ = అంకుశము, సుధాకలశ = అమృతకలశము, ఆతపత్ర = గొడుగు, పంకేరుహ = పద్మము–అను వీని యొక్క అంక = గుర్తులను, పరికర్మ = అలంకారములుగా, పరీతమ్ = వ్యాప్తమైనది (కూడినది), ఆపాదపంకజ = పాదపద్మముల వరకు, విశృంఖల = అడ్డులేనట్లు, దీప్ర = మిక్కిలిగా ప్రకాశించు, మౌళేః = కిరీటమునుకల్గిన, శ్రీరంగిణః = శ్రీరంగనాథునియొక్క, చరణయోః యుగమ్ = పాదముల జంటను, ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాము.

వజ్రధ్వజాంకుశాదుల గుర్తులను పాదములందు కల్గియుండుట సర్వేశ్వరత్వ సూచకము. అట్టి గుర్తులు శ్రీరంగనాథుని పాదములందు కలవు. ఆ స్వామి కిరీటకాంతి పాదములవరకు ప్రసరించి, వానిని కాంతివంతముచేయుచున్నది. అట్టి శ్రీరంగనాథుని పాదములజంటను ఆశ్రయించుచున్నాము.

**(వజ్రధ్వజాంకుశ . . . పరీతమంతః)** – నారదీయములో **"భృంగారాసన వాజికుంజరరథశ్రీవత్సచాపేషుభిః, మాలాకుండలచామరాంకుశయవైః శైలధ్వజై స్తోమరైః, మత్స్యస్వస్తికవేదికావ్యజనకైః శంఖాతపత్రాంబుజైః, పాదే పాణితలే నరా నృపతితాం యాంతి స్త్రియో రాజ్ఞితామ్"** అని తెలుపబడినది. కావున వజ్రధ్వజాది చిహ్నములు పాదములందు ఉండుట సర్వేశ్వరత్వచిహ్నము. **"ఏష బ్రహ్మలోకః సమ్రా డితి హోవా చ" (6-3-33)** అనుచు బృహదారణ్యకము భగవానుని సమ్రాట్టుగా కీర్తించినది. ఆ చక్రవర్తిత్వమును సూచించు చిహ్నములను స్వామి పాదములు కల్గియుండుటను కూరేశులు ఇచట పల్కిరి. ఈ విధముగనే కూరేశులు వైకుంఠస్తవములో **"వజ్రాంకుశధ్వజ" (71)** ఇత్యాదిగా పల్కుట, భట్టరు శ్రీరంగరాజస్తవమున – **"వజ్రారవిందధ్వజ . . "** ఇత్యాదిగా పల్కుట, యామునులు **"శంఖరథాంగకల్పక . . ." (స్తోత్రరత్న-31)** ఇత్యాదిగా పల్కుటయు ఇచట స్మరింపనగును. దేశికులును దైవనాయకపంచశత్‌లో **"వజ్రధ్వజాంకుశసుధాకలశాతపత్ర"** అని నుడివిరి.

**(ఆపాదపంకజవిశృంఖలదీప్రమౌళేః)** – **''ముగ్ఱ్రవిమ్మావులకుమ్ విరికిన్ఱ శుడర్‌ముడిక్కే" (తి.వా.7-7-10)** అను రీతిలో లోకమంతయు వ్యాపించు స్వామికిరీట కాంతి పాదములవరకు వ్యాపించియున్నదనుట కైముతికన్యాయసిద్ధము. **"కదిరాయిరమిరవి కలన్దెరిత్తాలొత్త నీళ్‌ముడియన్" (పెరియా.4-1-1)** అను రీతిలో భాస్కరకోటితుల్యమైన స్వామికిరీట ప్రకాశము వాచామగోచరము కదా! **"ఆధిరాజ్య మధికం భువనానా మీశతే పిశునయన్ కిల మౌళిః" (వరద.స్తవ.-25)** అనునట్లు కిరీటముకూడ సర్వేశ్వరత్వసూచకమే. ఇట్లు శ్లోకములోని మొదటి మూడుపాదములలో పరత్వము ప్రతిపాదింపబడినది. ఈ విశేషణము దివ్యసూరిసూక్తిసిద్ధమనుట రామానుజాచార్యవ్యాఖ్యలో **"మౌళిః స్వప్రభయా పాదపర్యంతం ప్రకాశత ఇత్యయ మర్థో దివ్యప్రబంధేఽనుసంహితః"** అని తెలుపబడినది. **(శ్రీరంగిణః)** – దీనిచే సౌలభ్యము తెలుపబడినది. పరత్వసౌలభ్యవిశిష్టుడే కదా ఆశ్రయణీయుడు. కావున వెంటనే **"చరణయో ర్యుగ మాశ్రయామః"**



అని స్తుతికర్త పల్కుచున్నారు.

**"దీప్ర"** అనునపుడు **"నమికంపి ... దీపోరః" (అష్టా. 3-2-167)** అను సూత్రమునుబట్టి వచ్చిన రప్రత్యయమువలన ఎల్లప్పుడు ప్రకాశించునది అని అర్థము. పరికర్మ అనగా అలంకారము. **"ఉన్నయామః, దీప్త"**, అనియు పాఠాంతరములు కలవు.

5. **శ్రీరంగరాజచరణౌ ప్రణుమో యయోః ఖ-**
**ల్వేక స్త్రివిక్రమవిధౌ వసుధా మశేషామ్ ।**
**వ్యక్రంస్త సాచలకులా మపి విప్రకీర్ణ –**
**స్థూలావలగ్నసికతా మివ నిర్నతోచ్చమ్ ॥**

యయోః = భగవానుని ఏ రెండు పాదములలో, ఏకః = ఒకటి, త్రివిక్రమవిధౌ = మూడుపాదములమేరను కొలుచు క్రమమునందు, సాచలకులామ్ = కులపర్వతములతోకూడిన, అశేషామ్ = సమస్తమైన, వసుధామ్ అపి = భూమినికూడ, విప్రకీర్ణ = వెదజల్లబడినవి, స్థూల= లావుగా నున్నవి, అవలగ్న = పాదములకు అంటుకొన్నవి అగు, సికతామ్ = ఇసుకరేణువులను కల్గినదిగా, నిర్నతోచ్చమ్ = ఎత్తుపల్లములులేనట్లుగా, వ్యక్రంస్త = ఆక్రమించెనో, అట్టి, శ్రీరంగరాజచరణౌ = శ్రీరంగనాథుని పాదయుగమును, ప్రణుమః = స్తుతించుచున్నాము.

శ్రీరంగనాథుని త్రివిక్రమమూర్తిగా భావించుచు, ఆ స్వామి పాదారవిందములను స్తుతించుచున్నారు.

భగవానుడు తన రెండు పాదములోని ఒక పాదముతో త్రివిక్రమావతారసందర్భమున కులపర్వతములతో కూడిన భూమిని అంతటిని ఆక్రమించెను. అపుడు అంత పెద్దకులపర్వతములు కూడ స్వామి పాదములకు అంటుకొనిన చిన్న గులకరాళ్ళవలె కన్పించెను. ఎత్తైన పర్వతములతో కూడిన భూమినికూడ ఎత్తు పల్లములులేని సమతలమునువలె ఆక్రమించెను. అట్టి భగవానుడగు శ్రీరంగనాథుని పాదములను రెండిటిని స్తుతించుచున్నారు.

**(యయోః ఖలు ఏకః)** – త్రివిక్రమావతారసమయములో భగవానుడు ఎడమపాదముతో పైలోకమును, కుడిపాదముతో భూమిని కొలిచెనను ప్రసిద్ధి ఉన్నను కొన్ని దివ్యదేశములలో వ్యత్యస్తముగా కన్పించుచున్నది. కావున కుడిఎడమల ప్రస్తావన లేక **"ఏకః"** అని పల్కిరి అని వేరొక వ్యాఖ్య. రెండు పాదములు చేసిన లీలను అనుసంధింపకుండ, కవి ఒక పాదముయొక్క లీలను మాత్రమే ఇచట అనుసంధించుట దృష్టిదోషము కలుగకుండుట కొఱకని తలంపవలయునని శ్రీప్రభ అణ్ణాస్వామివారిసూక్తి. దీనివలన కూరేశుల భగవన్మంగళాశాసనపరత్వము వ్యక్తము.

**(సాచలకులా మపి విప్రకీర్ణస్థూలావలగ్నసికతామ్) "సమూఢ మస్య పాగ్ంసురే"** అను ఋగ్వేదసూక్తినిబట్టి ఈ ప్రయోగమును కూరేశులు చేసిరని చెప్పనగును. మహావరాహావతార సందర్భమున పెద్ద మేరుపర్వతము కూడ **"ఖురమధ్యగతో యస్య మేరుః కణకణాయతే" (విష్ణుధర్మే.)**

అని, పురాణములందు, **"శిలమ్బినిడై చ్చిఋపరల్‌పోల్ పెరియమేరు తిరుక్కుళమ్బిల్ కణకణప్ప" (కలియన్.4-4-8)** అని తిరుమజ్గెయాళ్వార్ల సూక్తిలో తెలుపబడిన రీతిలో స్వామి గిట్టల మధ్యలో చిన్న నిప్పుకణికవలె కన్పించెను. ఇట్టి స్థితి అవతారములన్నిటియందు సమానమే కావున త్రివిక్రమావతారములో కులాచలములు కాలికి అంటుకొనిన గులకరాళ్లవలె తోచెను. **"అచలకుల"** మనునపుడు పర్వతసమూహములనెడి సామాన్యార్థము తోచినను, కులాచలములని అర్థము చెప్పుటలోనే ఎక్కువ స్వారస్యము కలదు. వింధ్యము, పారియాత్రము మలయమువంటి పెద్ద పెద్ద పర్వతములుకూడ చిన్నచిన్న రాళ్లవలె కన్పించెను. మనము ఒకచోట కాలుమోపునపుడు అచట చిన్నచిన్నరాళ్లు, ఇసుక ఉన్నను అడ్డము లేనట్లే, స్వామిపాదములకు కులపర్వతములు చిన్నరాళ్లవంటివి అగుటచే అడ్డురాలేదు. **(నిర్నతోచ్చమ్)** - ఇది క్రియావిశేషణము. ఎత్తుపల్లములులేనట్లు అని అర్థము. ఎత్తైన పర్వతముపై కాలుపెట్టినపుడు క్రిందగానుండు భూమికి పాదసంబంధము ఉండదు. ఇచట అట్లుకాక ఎత్తుపల్లములు లేక అంతయు సమతలమైయున్నపుడు ఏవిధముగా ప్రదేశము అంతటికి పాదసంబంధము కల్గెనో, అట్లు అని భావము. ఈ పదముయొక్క అర్థస్వారస్యమునుబట్టి వసిష్ఠ ఛండాలవిభాగములేక అందఱిని ఆక్రమించి, వారికి తన పాదస్పర్శను స్వామి కలుగచేసెననియు అర్థము ధ్వనించును అని శ్రీఅణ్ణాస్వామివారి సూక్తి.

**(శ్రీరంగరాజచరణౌ ప్రణుమః) - "ఉవన్దఉళ్లత్తనాయ్ ఉలకమళ న్దణ్డముఱ నివర్న్ద నీణ్‌ముడియన్ ... కడియార్ పొళ్ధిల్ అరజ్గత్తమ్మాన్" (అమలనాది.)** అనుచు తిరుప్పాణాళ్వార్లు త్రివిక్రమాపదానమును శ్రీరంగనాథుని విషయమున అనుసంధించిన తీరును వీరును అనుసరించుచు ఇట్లు పల్కిరి. **"మన్దరమీదు పోకి మదినిన్జితెఙ్జ మలరోన్ వణఙ్గ వళర్‌శేర్ అన్దరమేళ్తినూడు శెలవుయ్‌త్త పాదమదు నమ్మైయాళుమ్ అరశే" (కలియన్.11-4-5)** అనుచు కలియన్ ఊర్ధ్వలోకములను కొలిచిన ఒక పాదమును ఆశ్రయించిరి. శఠకోపసూరి **"నిలమ్ తావియ నీళ్ కళ్లలే నాళ్‌తొఋమ్ వీడిన్ఱియే తొళ్లుక్కూడుజ్గొల్" (తి.వా.5-9-8)** అనుచు అధోలోకములను కొలిచిన ఒక పాదమును ఆశపడిరి. వీరు ఒక పాదముయొక్క లీలను అనుసంధించి, రెండు పాదములను ఆశపడిరను చమత్కారము ఇచట భావనీయము అని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(ప్రణుమః)** - ముందు శ్లోకములలో ద్వయములోని పూర్వార్థము **"ఉన్నయామః", "ఆశ్రయామః", "వరయే"** ఇత్యాది క్రియాపదముల ద్వారా అనుసంధింపబడగా, ఉత్తరార్థమగు కైంకర్యప్రార్థన **"ప్రణుమః"** అనుచు వాచిక కైంకర్యమును చేయుదుననుటద్వారా ఇందు తెలుపబడినది. ఇది కాయిక, మానసిక కైంకర్యములకును ఉపలక్షణము. ఈవిధముగా స్తుతి ద్వయార్థానుసంధాయకము.

వేదములందు **"త్రీణి పదా విచక్రమే", "యస్యోరుషు త్రిషు విక్రమణేషు" (విష్ణుసూక్తం)** ఇత్యాదిగా త్రివిక్రమావతారము విస్తృతముగా ప్రస్తావింపబడుటచే, ఆ అవతారములో అతిమానుష



చేష్టితములు సంభవించుటచే, అతిమానుషస్తవమను పేరుగల ఈ స్తుతిని ముందుగా త్రివిక్రమావతార ప్రస్తావనతో కూరేశులు ప్రారంభించిరనదగును. **"వ్యక్రంస్త"** అనునపుడు **"వేః పాదవిహరణే" (అష్ట.1-3-48)** అను సూత్రముచే ఆత్మనే పదరూపము వచ్చినది.

**6. జ్ఞానం బలం విపుల మీశన వీర్యశక్తి -**
**తేజాంసి చ త్రియుగభూయ ముపాగతాని ।**
**పూర్ణాని షట్చ పరిగృహ్య భవం శ్చతుర్ధా**
**భక్తం జనం త్వ మనుజగ్రహిథానురాగాత్ ॥**

త్వం = నీవు, విపులమ్ = అవధిలేని, జ్ఞానమ్ = జ్ఞానము, బలమ్ = బలము, ఈశనవీర్యశక్తితేజాంసి చ = ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు అను, షట్ = ఆఱు గుణములను, త్రియుగభూయమ్ = మూడు రెండ్లుగానుండుటను, ఉపాగతాని = పొందినవిగను, పూర్ణాని చ= సంపూర్ణములుగను, పరిగృహ్య = స్వీకరించి, చతుర్ధా భవన్ = (వాసుదేవ-సంకర్షణ-ప్రద్యుమ్న-అనిరుద్ధ రూపములతో) నాల్గు విధములుగా అగుచు, భక్తం జనం = భక్తజనులను, అనురాగాత్= ప్రేమతో, అనుజగ్రహిథ = అనుగ్రహింతువు.

భగవానుని విభవావతారవైభవమును ఈ స్తోత్రము స్తుతించునది అగుటచే, ఆ విభవమునకు మూలకందమగు వ్యూహరూపము ఇందు ప్రస్తావింపబడుచున్నది. ప్రధానముగా ఈ స్తుతి విభవమును పొగడునది అయినను, భగవానుని పరవ్యూహవిభవాంతర్యామి అర్చామూర్తులను అయిదు రూపములు ఇందు తెలుపబడినవి. **"వైభవావతారమ్"** అనుచు మొదటి శ్లోకములో విభవము, **"శ్రేయః కిరంతు ... పరస్య ధామ్నః"** అనుచు రెండవ శ్లోకములో పరవాసుదేవరూపము, ఇందు వ్యూహము, **"శ్రీమత్పరాంకుశమునీంద్రమనోనివాసాత్"** అని 3వ శ్లోకములో అంతర్యామి, **"శ్రీరంగరాజచరణాంబుజ మున్నయామః"** ఇత్యాదిగా అర్చారూపమును కీర్తింపబడుట గమనింపతగినది.

**"సంఖ్యాతుం నైవ శక్యంతే గుణా దోషా శ్చ శార్ఙ్గిణః, ఆనంత్యాత్ ప్రథమో రాశిః, అభావా దేవ పశ్చిమః"** అనునట్లు భగవానుని గుణములు అనంతములగుటచే లెక్కకట్టలేనివి, దోషములు అత్యంతాభావము కారణముగా (అసలు లేకపోవుటచే) లెక్కకట్టుటకు వీలులేనివి. కావున భగవానుడు అసంఖ్యేయకల్యాణగుణాకరుడు కదా! ఇచట జ్ఞానాది షడ్గుణములు ఆఱుమాత్రమే ఏల తెలుపబడినవి ? అనినచో, ఈ ఆఱుగుణములే ప్రధానములు. మిగిలినవి వీని ప్రకారభేదములే. వీనియందు అంతర్భవించునవియే. **"తవానంతగుణస్యాపి షడేవ ప్రథమే గుణాః, యై స్త్వయేవ జగత్ కుక్షౌ అన్యేఽ ప్యంతర్నివేశితాః"** అని కదా ప్రమాణము - అని సమాధానింపనగును. కారుణ్యమను గుణముయొక్క విభాగములుగా క్షమా, వాత్సల్యము మొదలైన గుణములను చెప్పుట వంటిదే ఇదియును. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులలో ప్రధానమగు వాసుదేవమూర్తియందు జ్ఞానాదిగుణములు ఆఱు ప్రకాశించును. మిగిలిన

సంకర్షణాదిమూర్తులు మూడింటిలో ఒక్కొక్కదానిలో రెండేసి గుణములు ప్రధానముగా నుండును అని పాంచరాత్రములో తెలుపబడినది. ఆ అంశమే ఇచట ప్రస్తావింపబడినది. ఈ ఆఱు గుణముల రూపము ఇచట సంగ్రహముగా తెలుపబడుచున్నది.

1. జ్ఞానమనగా – **"యో వేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః" (న్యాయతత్త్వే.)** అనునట్లు సార్వకాలికమైన సమస్తపదార్థసాక్షాత్కారము, 2. బలమనగా **"స దధార పృథివీం ద్యా ముతేమామ్"**, అని, **"విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" (భ.గీ.10–42)** అనియు చెప్పబడినరీతిలో ఉభయవిభూతులను అనాయాసముగా ధరింపగల సామర్థ్యము, **"పొఙ్గోదమ్ శూర్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అజ్గాదుమ్ శోరామే ఆళ్కిన్దవెమ్బెరుమాన్"** అని కదా స్వామి పొగడబడుచున్నాడు. 3. ఐశ్వర్యమనగా – **"క్షరాత్మానా వీశతే దేవ ఏకః" (శ్వేతా.1–10)** అనునట్లు ఇట్లు ధరించిన జగత్తును తన అధీనములో ఉంచుకొని, పాలింపగల్గినట్టి నియంతృత్వము, 4. వీర్యమనగా – **"న శ్రమో న చ ఖేద స్తే జగద్ధారణశాసనే"** అనునట్లు జగత్తును ధరించుట, నియమించుటలలో ఎట్టి శ్రమను పొందకుండుట, లేక, తాను ఎట్టి వికారమును పొందకుండుట 5. శక్తి అనగా – **"పరాఽస్యశక్తిః వివిధైవ శ్రూయతే" (శ్వేతా.6–8)** అని, **"చేష్టా తస్యాప్రమేయస్య వ్యాపినో వ్యాహతాత్మికా"** అనియును చెప్పబడినట్లు తాను ప్రారంభించిన కార్యము ఏ విధముగా ఆగకుండ పూర్తిచేయగల్గిన సామర్థ్యము, లేక, అఘటితఘటనాసామర్థ్యము, లేక జగదుపాదాన శక్తి. 6. తేజస్సు అనగా – **"రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ, రత్నాని చర థా శ్చైవ త్రాసం సంజనయంతి మే"** అనునట్లు శత్రువులకు భయమును పొందించునట్టి గొప్పతనము, లేక, గొప్ప ప్రయత్నము ద్వారా సాధింపవలసిన పనిని ఇతరుల సహాయము లేకుండగనే అనాయాసముగా పూర్తిచేయగల్గుట.

పరవాసుదేవునియందు, వ్యూహవాసుదేవునియందు జ్ఞానాదిగుణషట్కము ప్రకాశించుచుండుటచే వారిమధ్య గుణభేదము లేదు. కావున సంకర్షణ – ప్రద్యుమ్న – అనిరుద్ధమూర్తులు మూడు మాత్రమే వ్యూహరూపములనెడి పక్షమును కలదు. దీనిని కూరేశులు వరదరాజస్తవములో **"గుణై ష్షడ్భి స్త్వేతైః" (16)** అను శ్లోకములో ప్రస్తావించిరి. సంకర్షణాది వ్యూహరూపములలో రెండు రెండు గుణములు మాత్రమే ప్రకాశించుచుండునన్నచో భగవన్మూర్తులలో గుణవైకల్యదోషము సంభవించును కదా! అను సందేహము ఇచట కలుగవచ్చును. జ్ఞానాది గుణములలో రెండు రెండు గుణములు వ్యూహరూపములందు ఒక్కొక్క దానియందు ప్రకాశించునని అర్థమేకాని, మిగిలిన నాల్గు గుణములు బొత్తుగా ఉండవను అర్థముకాదు. అనగా **"త్రియుగభూయమ్"** అను వ్యవస్థ సత్తా ప్రయుక్తము కాదు, ఆవిష్కరణ ప్రయుక్తము అని భావము. ఒక్కొక్కమూర్తిలో రెండు రెండు గుణములు కార్యవశముచే ఆవిష్కరింపబడినను, మిగిలిన నాల్గింటియొక్క సత్తకు లోపము లేదు. అన్ని మూర్తులయందు సకలగుణములు పుష్కలముగా నుండుటలో లోపము లేదు. **"వ్యవస్థా యా చైషా నను వరద! సాఽవిష్కృతివశాత్ భవాన్ సర్వత్రైవ త్వగణితమహామంగళగుణః" (16)** అనుచు కూరేశులు వరదరాజస్తవములో పల్కిరి కదా!



భగవద్రామానుజుల శరణాగతి గద్యలోని **"జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజః"** అను క్రమమును అనుసరించుచు కూరేశులు ప్రస్తుత శ్లోకమును రచించిరి. ఈ శరణాగతి గద్యక్రమములోని స్వారస్యమును శ్రీదేశికులు తమ గద్యభాష్యములో వివరించుచు ఇట్లనిరి – లోకములోని మనుష్యులు స్వప్నము మొదలగు అవస్థలలో తమ ఐశ్వర్యమును గూర్చిన జ్ఞానము వారికి ఉండదు. ఉన్నను వానిని ధరింపలేరు. ఒకవేళ తెలిసి ధరించినను, వానిని పూర్తిగా నియమింపజాలరు. నియమింపగల్గినను అట్లు నియమించుటలో మిక్కిలి శ్రమను పొందుదురు. ఒకవేళ శ్రమను పొందకున్నను వాని సత్తా, స్థితులకు వారు కారణము కాజాలరు. ఒకవేళ కారణమైనను ఇతరుల సహకారము లేకుండ అట్లు కారణము కాలేరు. భగవానుని స్థితి ఈ క్రమముకంటే భిన్నమైనది అను విషయము ఈ గుణముల క్రమము సూచించుచున్నది". ఈ వివరణమును ప్రస్తుతములో కూడ అనుసంధేయము.

(భక్తం జనం త్వ మనుజగ్రహిథ) – **"షాడ్గుణ్యాత్ వాసుదేవః పర ఇతి స భవాన్ ముక్తభోగ్యో బలాఢ్యాత్ బోధాత్ సంకర్షణ స్త్వం హరతి వితనుషే శాస్త్ర మైశ్వర్యవీర్యాత్, ప్రద్యుమ్న స్సర్గధర్మే నయసి చ భగవన్ శక్తితేజోఽనిరుద్ధో బిభ్రాణః పాసి చ త్వం గమయసి చ తథావ్యూహ్య రంగాధిరాజ"** అను శ్రీరంగరాజస్తవ ఉత్తరశతక శ్లోకము, శ్రీపిళ్లైలోకాచార్యులవారు తత్త్వత్రయములో ఈశ్వరప్రకరణమందు **"పరత్వత్తిల్ జ్ఞానాదికళాఱుమ్ పూర్ణమాయిరుక్కుమ్, వ్యూహత్తిల్ ఇవ్విరణ్డుగుణమ్ ప్రకటమాయిరుక్కుమ్, అదిల్ సంకర్షణర్ జ్ఞానబలజ్గళ్ ఇరణ్డోదుమ్ కూడి దేహతత్త్వత్తై అధిష్ఠిత్తు, అత్తై ప్రకృతియిల్ నిస్టుమ్ వివేకిత్తు, ప్రద్యుమ్నావస్థైయుమ్ భజిత్తు, శాస్త్రప్రవర్తనత్తైయుమ్ జగత్సంహారత్తైయుమ్ పణ్ణక్కడవరాయిరుప్పర్. అనిరుద్ధర్ – శక్తితేజస్సుక్కళ్ ఇరణ్డోదుమ్ కూడి రక్షణత్తుక్కుమ్, తత్త్వజ్ఞానప్రదానత్తుక్కుమ్, కాలసృష్టిక్కుమ్, మిశ్రసృష్టిక్కుమ్ కడవరాయిరుప్పర్"** అనుచు సాయించిన సూక్తులును ఇచట అనుసంధింపతగినవి. **"వరద సకల మేతత్ సంశ్రితార్థం చకర్థ" (వరదరాజ. 63)** అనునట్లు, ఈ నాల్గు వ్యూహరూపములలో అనుగ్రహించుట ఆశ్రితానుగ్రహము కొఱకు అని భావము. **"విపులమ్"** అను విశేషణమును జ్ఞానాదిగుణములన్నిటియందు అన్వయించుకొననగును. **"త్రయాణాం యుగానాం సమాహారః త్రియుగం, తస్య భావః త్రియుగభూయమ్"** అని విగ్రహము. ఇట్టి ప్రయోగములు కూరేశుల రచనావైశిష్ట్యమునకు నిదర్శనములు. ఇచట **"తత స్త్రిస్రః తేషాం త్రియుగయుగళైః హి త్రిభు రభూః" (16)** అను వరదరాజస్తవసూక్తిని, **"పూర్ణాని షట్చ"** అనునపుడు **"గుణై ష్షడ్భి స్త్వేతైః ప్రథమతరమూర్తి స్తవ బభౌ" (16)** అనెడి ఆ స్తవములోని ప్రయోగమును స్మరణీయములు. ఈ శ్లోకములోని **"జ్ఞానంబలమ్"** ఇత్యాది ప్రతిపాద్యవిషయమునకు ఆగమములు ప్రమాణమగుటచే ఇందు ఆగమప్రమాణాలంకారము కలదు.

7. **ఏకాంతమంగళగుణాస్పద మస్తహేయం**
**నిత్యం పదం తవ యత స్తత ఏవ దేవ ।**
**ఆమ్నాయతే తదిహ విశ్వవిరూపరూపం**
**తేనైవ నన్విద మశబ్ద మరూప మాహుః ॥**

దేవ = ఓ దేవా!, తవ = నీయొక్క, పదం = స్వరూపము, యతః = ఎందువలన, నిత్యం = ఎల్లప్పుడు, ఏకాంత = అసాధారణములైన, మంగళగుణ = కల్యాణగుణములకు, ఆస్పదమ్ = నివాసము, అస్తహేయం = హేయగుణములు లేనిదియు అగుచున్నదో, తతఃఏవ= అందువలననే, తత్ = ఆ స్వరూపము, ఇహ = ఇచట, విశ్వవిరూప = అన్నిటికంటె విలక్షణమైన, రూపం = రూపమును కల్గినదిగా, ఆమ్నాయతే = వేదములచే ప్రతిపాదింపబడుచున్నది, తేన+ఏవ= ఆ కారణముచేతనే, ఇదమ్ = ఈ దివ్యాత్మ స్వరూపము, అశబ్దం = (ఒక నిశ్చితమైన) పేరును లేనిదిగా, అరూపం = (ఒక నిశ్చితమైన) రూపమును లేనిదిగా, ఆహుః = (వేదవిదులు) చెప్పుదురు.

ఇందు భగవానుని దివ్యాత్మస్వరూపమునుగూర్చి తెలుపబడుచున్నది.

ఓ దేవా! నీ దివ్యాత్మస్వరూపము నిత్యము సకలకల్యాణగుణాకరము, హేయ రహితమును. కావుననే దానిని సకలవిలక్షణమైన రూపమును కల్గినదిగా వేదములు తెలుపుచున్నవి. అందుచేతనే నీ ఈ దివ్యాత్మ స్వరూపమును వైదికులు నామరూపశూన్యముగా – అనగా ఇట్టి పేరునే, ఇట్టి రూపమునే కల్గియున్నదని చెప్పుటకు సాధ్యము కానిదిగా పల్కుదురు.

**(ఏకాంతమంగళగుణాస్పదమ్ అస్తహేయమ్)** – భగవద్రామానుజులు శరణాగతి గద్యలో– **"అఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాన"** అనుచు పల్కిన సూక్తి ఇచట అనుసంధేయము. బ్రహ్మసూత్రకారులును **"న స్థానతోఽపి పరస్య ఉభయలింగం సర్వత్ర హి" (3-2-11)** అనుచు ఉభయ లింగాధికరణములో హేయగుణరాహిత్యమును, కల్యాణగుణాకరత్వములను భగవానుని అసాధారణ లక్షణములుగా పల్కిరి. ఈ ఉభయలింగములవలన భగవత్స్వరూపము స్వేతరసమస్తవస్తువిలక్షణమై– అనగా తనకంటె ఇతరములయిన వస్తువులకంటె విలక్షణమైనదై యుండును. ఈ అర్థవిశేషము ప్రస్తుతవిశేషణముచే ధ్వనించును.

**(తవ పదమ్)** – **"పద్యతే ప్రాప్యతే ఉపాస్యతే ఇతి పదమ్ – స్వరూపమ్"** అను వ్యుత్పత్తి ఇచట వివక్షితము. శ్రీవిష్ణుపురాణములో **"సమస్తహేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్" (1-22-53)** అను చోట పదశబ్దము స్వభావవాచకముగ ప్రయోగింపబడుట ప్రకృతమున స్మరణీయము. భగవద్రామానుజులును వేదార్థసంగ్రహములో కూడ ఇట్లే అనుగ్రహించిరి. పదశబ్దమునకు పరమపదము, ముక్తాత్మస్వరూపము అను వేరు అర్థములున్నను ఇచటి ప్రకరణమును బట్టి భగవత్స్వరూపమను అర్థమునే గ్రహింపవలెను.

**(ఏకాంతమంగళగుణాస్పదమ్ అస్తహేయమ్)** – ఏకాంతమనగా తనకే



అసాధారణమైయుండుట. **"తదుత్కర్షచౌర్యైః పరేషాం స్తుత్యత్వాత్" (శ్రీరంగరాజ.పూర్వ.)** అని భట్టరు సాయించిన రీతిలో భగవానునకు చెందిన గుణములను దొంగిలించియే (ఆరోపించియే) ఇతరుల స్తుతిని చేయవలసియున్నది. స్వామి విషయమున ఆ అవస్థ లేదు కదా!

**(అస్తహేయమ్)** అస్తమించిన దోషములను కల్గినవి అను అర్థము వచ్చుటచే శాస్త్రములలో తెలుపబడు ప్రధ్వంసాభావము – అనగా – కొంతకాలము దోషములుండి పిమ్మట నశించినవను అర్థము ఆపాతతః తోచినను, భగవానుని విషయమున అత్యంతాభావమే – అనగా– హేయగుణములు అసలు లేకుండుటయే అర్థము. **"అసు–క్షేపణే"** అను ధాతువు నుండి పుట్టిన క్త ప్రత్యయాంతరూపమిది. **"అపహతపాప్మా"** ఇత్యాది వైదిక సూక్తులందు ఇట్లే కదా! అర్థము తెలుపబడినది. మఱియు **"నిత్యమ్, అస్తహేయమ్"** అను పదయోజనవలన కూడ అత్యంతాభావమే స్ఫురించును.

**(తత్ విశ్వవిరూపరూపమ్ ఆమ్నాయతే)** – **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" (శ్వేతా.6-8)** అను శ్రుతివాక్యమును ఉద్దేశించి, **"న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే" (శ్వేతా.6-8)** అను శ్రుతినిబట్టి భగవానుని సకలేతరవిలక్షణత్వమును కని పల్కిరి. విరూపమనగా విసజాతీయమని అర్థము.

**(ఇదమ్ అశబ్దమ్ అరూప మాహుః)** ఇచట నామరూపముల అత్యంతాభావము – అనగా – బొత్తిగా లేవని అర్థము కాదు. శ్రీభాష్యములో **"వివక్షితగుణోపపత్తే శ్చ"** (1-2-2) అను సూత్రభాష్యములో తాము ప్రస్తావించిన **"సర్వగంధః సర్వరసః" (ఛాందో.13-14-4)** అను శ్రుతిని వివరించుచు భాష్యకారులు **"అశబ్ద మస్పర్శమ్ ఇత్యాదినా ప్రాకృతగంధరసాదినిషేధాత్ అప్రాకృతాః స్వాసాధారణాః నిరవద్యాః నిరతిశయాః కల్యాణాః స్వభోగ్యభూతా స్సర్వవిధా గంధరసాః తస్య సంతీత్యర్థః"** అని అనుగ్రహించిరి. కావున కర్మనిబంధనములైన నామరూపములు లేవను అర్థమే కాని, అప్రాకృతములైన, స్వాసాధారణములైన, దోషరహితములైన, నిరతిశయములైన నామరూపములు లేవని అర్థము కాదు. లేనిచో వేదములు, శాస్త్రములు, వైదికులు పల్కు భగవానుని నామరూపములు అసంగతములే అగును కదా!. **"పలపలవే యాబరణమ్ పేరుమ్ పలపలవే శోది వడివు"** అని కదా నమ్మాళ్వార్ల సూక్తి. **"య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే ... తస్యోదితి నామ" (1-6-6)** అను శ్రుతివాక్యమునందును **"హిరణ్మయః"** అనుటచే రూపనిర్దేశము, **"ఉదితి నామ"** అనుటచే నామనిర్దేశమును చేయబడినది కదా! ఇచట **"తథా చ శ్రుతిః – యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్రవర్ణః, అచక్షుః శ్రోత్రం తదపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్, తదవ్యయమ్ యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః – ఇత్యత్ర అగోత్రమ్ అనామకమ్"** అని గార్గ్యరామానుజార్యవ్యాఖ్య.

శోధకవాక్యములలో భగవానుని దివ్యాత్మస్వరూపమును శోధించి, అది ఇతర

విలక్షణమైనదని స్థాపించుటకై, ఆ స్వరూపము అంతట వ్యాపించియున్నదైనను ఏవిధమైన హేయగుణములు దానికి అంటవు అని, అన్నివేళల సమస్త కల్యాణగుణాకరమైయుండుననియు తెలుపబడినది. దీనిని భగవద్రామానుజులు ముఖ్యముగా ఉభయలింగాధికరణభాష్యమునందు, ఇంకను పలు సందర్భములలో వ్యక్తపఱచిరి. **"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" (కఠ.3-15)** అని, **"యత్ తత్ అద్రేశ్యమ్"** అనియు భగవానుని దివ్యాత్మస్వరూపమును వేదములు వర్ణించినవి. దీనిని ఆధారముగా చేసికొని కొందఱు పరమాత్మకు గుణములు, నామములు, రూపము లేవు అని సిద్ధాంతీకరించిరి. **"న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదమ్, తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే" (జితంతే.)** అను వాక్యమును తమకు అనుకూలముగా గొనిరి. చివరకు బ్రహ్మ నిర్గుణము, జడము అని తేల్చి చెప్పిరి. వారి సిద్ధాంతమును తిరస్కరించుటకై కూరేశులు ప్రస్తుత శ్లోకమున, అనంతర శ్లోకమునను శోధకవాక్యముల భావమును వివరించిరి అనదగును అని వ్యాఖ్యానాంతరము.

**"ఆనందం బ్రహ్మణో విద్వాన్" (తైత్తి.ఆ.)** అని, **"తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యమ్"** అను మొదలగు శ్రుతివాక్యములలో భగవానునకు మాత్రమే ఏకాంతమైన గుణముగా ఆనందగుణము తెలుపబడుటను దృష్టిలో నుంచుకొని **"ఏకాంతమంగళగుణాస్పదమ్"** అని అనదగును అనియు కొందఱి వ్యాఖ్య. అట్లే. **"సమస్తహేయరహితమ్" (విష్ణు.1-22-53)** అని, **"అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సః విపిపాసః ... " (ఛాందో.8-7-1)** ఇత్యాది శ్రుతులనుబట్టి **"అస్తహేయమ్"** అనిరి. **"నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్" (ముణ్డక.1-6-6)** అను శ్రుతిని అనుసరించి **"నిత్యం"** అనిరి అని చెప్పనగును. వేదములో **"య ఏషోఽన్త రక్షిణి పురుషో దృశ్యతే" (ఛాందో.8-12-3), "ఆదిత్యం వర్ణం తమసః పరస్తాత్"** అను మొదలగు పలు చోట్ల పరబ్రహ్మ రూపమును గూర్చి తెలుపబడినది. **"స ఉత్తమః పురుషః", "దివ్యో దేవ ఏకో నారాయణః" (నారాయణోపనిషత్తు.), "యత్ర దేవానా మధిదేవ ఆస్తే" (జైమినీయ.3-384)** వంటిశ్రుతులలో నామముగూర్చి ప్రస్తావింపబడినది. అంతియేకాక, **"ఆస్య జానంతో నామచిత్ వివక్తన ధ్రువాసో అస్య కీరయో జనాసః" (వి.సూ.)** అను శ్రుతిలో భగవన్నామములను కీర్తించువారు తిరిగి ఈ ప్రకృతి మండలమున జన్మింపరనియు చెప్పబడినదని పరాశరభట్టర్ భగవద్గుణ దర్పణములో నుడివిరి. ఇట్లుండగా, పరబ్రహ్మనామరూపరాహిత్యమును పల్కుట ఎట్లు సంగతము? అను ప్రశ్న కలుగును. దీనికి సమాధానముగా భగవద్రామానుజులు **"అశబ్దమ్, అస్పర్శమ్, అరూపమ్" (కఠ.3-15)** అనునవి దివ్యాత్మ స్వరూపమును గూర్చినవని పల్కుట ఇచట స్మరణీయము. దానిని బట్టియే కూరేశులు ప్రస్తుత శ్లోకము న రాహిత్యమును ప్రస్తావించిరి. ఇక, ఇచట **"అశబ్దమ్, అరూపమ్"** అని నామరూప ప్రస్తావన ఎందులకు చేయబడినది? అనినచో, రాబోవు శ్లోకములలో భగవానుని పలు అవతారముల పేర్లను, రూపములను ప్రస్తావించి, ఆ స్వామి అతిమానుషలీలలను స్తుతింపబోవుటకు అనుగుణముగా వీనిని ప్రస్తావించిరని చెప్పనగును. అనగా, ముందుగా భగవానుడు నామరూపములను కలవాడని



ఇందు ముందుగా స్థాపించిరని తాత్పర్యము. ఇట్టి పలు విశేషములు ఈ స్తుతిలోని అన్ని శ్లోకములలో కలవు. కాని, విస్తరభీతిచే ప్రస్తావించుట లేదు.

**8. శబ్దాదిహేయ మిహ గోచర ఇంద్రియాణాం**
**తత్ప్రత్యనీకవిభవ స్త్వ మతీంద్రియోఽసి ।**
**తేనైవ తే న బత! దర్శన మస్తి కించిత్**
**వాచో ధియ శ్చ తత ఏవ న గోచరోఽసి ॥**

(స్వామీ), ఇహ = ఈ లోకమున, హేయమ్ = అసహ్యించుకొనతగిన, శబ్ద + ఆది = లౌకికమగు శబ్దాదివిషయము, ఇంద్రియాణాం = చెవులు మొదలగు ఇంద్రియములకు, గోచరః= కనుపించుచున్నది (విషయమగుచున్నది), తత్ = దానికి, ప్రత్యనీక = విరుద్ధమైన, విభవః = వైభవమును కల నీవు, అతి + ఇంద్రియః + అసి = ఇంద్రియములకు కానరాని వాడవై యున్నావు, తేన+ఏవ = కావుననే, తే = నీయొక్క, కొంచమైనను, దర్శనమ్ అస్తి = దర్శనము లేదు (కొంచెము కూడ నీవు చూడబడుట లేదు) బత = అయ్యో! తతః ఏవ = అందువలననే, వాచః = వాక్కుకు, ధియః+చ = బుద్ధికిని, గోచరః న అసి= కానవచ్చుట లేదు.

పూర్వశ్లోకమున తెలుపబడిన అర్థమే ఇందు స్థూణానిఖననన్యాయమున స్థిరీకరింపబడుచున్నది.

స్వామీ! లోకములోని శబ్దాదివిషయములు జుగుప్సాకరములు. అత్యంతహేయములు. అవి శ్రోత్రాది ఇంద్రియములకు కానవచ్చునవి. ఇంతకంటే విలక్షణమైన, విరుద్ధమైన వైభవమునుకల నీవు ఇంద్రియగోచరుడవు కావు. అయ్యో! అందుచేతనే నీ దర్శనము కొంచెము కూడ సాధ్యము కాదు. ఆ కారణముచేతనే వాక్కుకు, బుద్ధికిని నీ రూపము విషయము అగుట లేదు.

భగవద్విషయము చక్షురాదీంద్రియగ్రాహ్యము కాదనుటను శ్రీశఠకోపసూరి **"పొఱియుణర్ వవైయిలన్"** అను సూక్తిద్వారా తెలిపిరి. వేదమును **"న సందృశే తిష్ఠతి రూప మస్య, న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్" (తైత్తి.నారా.1-3)** అని **"న చక్షుషా గృహ్యతే నాపి వాచా" (ముణ్డక 3-1-8)** అని, **"న మాంసచక్షుభి రభివీక్షతే తమ్"** ఇత్యాది వాక్యములద్వారా ఈ అర్థమును వ్యక్తపఱచినది. ఇంద్రియములకు విషయమైనది ఐంద్రియము, అట్లు విషయముకానిది అతీంద్రియము. కావున భగవద్విషయము అతీంద్రియమైనది. **"స్వాధ్యాయ శ్చక్షు రుత ఏక మస్య యోగో ద్వితీయ మభివీక్షణాయ, అధ్యయన మననయనోఽస్య ద్రష్టా"** అనుచు వేదాధ్యయనము ద్వారా, యోగముద్వారా భగవత్స్వరూపమును దర్శింప వీలగునని వేదము తెలిపినది. బుద్ధికిని, వాక్కుకును భగవత్స్వరూపము విషయముకాదన్నచో **"బ్రహ్మవాదినో వదంతి", "బ్రహ్మవి దాప్నోతి పరమ్" (తైత్తి.ఆ.)** అనుచు పలువురు మహనీయులనుగూర్చి వారు బ్రహ్మవేత్తలని పల్కుట ఎట్లు సంగతము? అనినచో, భగవద్విషయము మనోవాక్కులకు అత్యంతము

అవిషయమన్నచో అది శశశృంగాదులవలె తుచ్ఛమగును. కావున అర్థమది కాదు. మనవంటి అల్పుల అపరిశుద్ధమైన మనస్సుకు, వాక్కుకు గ్రహింప వీలుకానిదనియే అర్థము. కావుననే వేదము **"మనసా తు విశుద్ధేన"** అని అన్నది. ఈ వివరములు సర్వత్రప్రసిద్ధ్యధికరణములో శ్రీభాష్యకారులు వివరించిరి.

**(తత్ప్రత్యనీకవిభవ స్త్వమ్)** – శబ్దాదివిషయములు హేయతమములై యుండుటకు విరుద్ధముగా భగవానుడు **"ఉయర్వర ఉయర్నలమ్ ఉడైయవన్" (తి.వా.1-1-1)** అనునట్లు అత్యుత్తమములైన ఆనందాదిసకలకల్యాణగుణములను కలవాడని అర్థము.

**(వాచో ధియ శ్చ తత ఏవ న గోచరోఽసి)** – భగవానుడు అతీంద్రియుడు; కావుననే వాక్కుకు, బుద్ధికి అందనివాడు. భగవానుని ఆనందగుణమును లెక్కింప సమకట్టిన వేదము చివరకు **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (తైత్తి.ఆ.)** అని వెనుదిరిగినది కదా! **"అద్రేశ్యమ్ అగ్రాహ్యమ్, అచక్షుశ్శోత్రమ్" (ముణ్డక.1-1-6)** అనుటకును ఇదియే అర్థము. **"యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః" (కేనో.2-3)** ఇత్యాదులు ఇచట స్మరణీయములు. కావున మనవంటివారికి భగవానుని దర్శనము దుర్లభము. కాని, ముదలాళ్వార్లవంటి మహనీయుల జ్ఞాననేత్రమునకు ఆదర్శనము లభించును. **"తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్" (మూన్దామ్-1)** అని వారేస్వయముగా భగవద్దర్శనమును గూర్చి నుడివిరి కదా! దేశికులు దేహళీశస్తుతిలో – **"దదృశు ర్భవంతం స్వాధ్యాయయోగనయనాః శుచయః కవీంద్రాః"** అని పల్కిరి.

**9.** **ఏవం స్థితే త్వదుపసంశ్రయాభ్యుపాయో**
**మానేన కేన చిదలప్స్యత నోపలబ్ధుమ్ ।**
**నోచే దమర్త్యమనుజాదిషు యోనిషు త్వమ్**
**ఇచ్ఛావిహారవిధినా సమవాతరిష్యః ॥**

ఏవం స్థితే = ఇట్లుండగా (నీవు అతీంద్రియుడవైయుండగా), త్వం = నీవు, ఇచ్ఛావిహారవిధినా = (కర్మ మూలముగా కాకుండ) స్వచ్ఛందవిహారప్రయుక్తముగా, అమర్త్యమనుజ+ ఆదిషు = దేవతలు, మనుష్యులు మొదలగు, యోనిషు = జాతులలో, నో సమవాతరిష్యః చేత్ = అవతరింపకపోయినచో, త్వత్ + సంశ్రయణ+అభ్యుపాయః = నిన్ను ఆశ్రయించుటకు తగిన ఉపాయము, కేనచిత్ మానేన = ఏ ప్రమాణము చేతను, ఉపలబ్ధుం న + అలప్స్యత = తెలిసికొనుటకు వీలులేకుండెడిది.

ప్రస్తుతస్తుతివిషయమగు విభవావతారమును ప్రస్తుతించుటద్వారా ఇందు స్తుతి ప్రారంభమును కూరేశులు చేయుచున్నారు.

స్వామీ! నీవు ఇంద్రియములకు గోచరుడవు కావు. ఇట్టి నీవు ఈ లీలావిభూతిలో నీ



ఇచ్ఛను అనుసరించి లీలార్థము సురనరతిర్యక్ స్థావరరూపములలో అవతరింపకున్నచో నిన్ను ఆశ్రయించు ఉపాయము ఏవిధముగానైనను లభింపకుండెడిది కదా!. కావున నీవు అవతరించి, నిన్ను ఆశ్రయించుటకు తగిన అవకాశమును మాకు నీవే కలుగజేసితివి.

**(త్వదుపసంశ్రయాణాభ్యుపాయః)** – గీతాభాష్యములోని (4-8) **"వైష్ణవాగ్రేసరాః మత్సమాశ్రయణే ప్రవృత్తాః"** అను భగవద్రామానుజుల గీతాభాష్యసూక్తి ఇచట అనుసంధేయము. శాస్త్రములలో విధింపబడిన ఉపాసన–అర్చన–ప్రదక్షిణ–నమస్కారాది రూపసమాశ్రయణములకు విషయమే లేకుండపోవును కదా! అని భావము. గీతాభాష్యప్రారంభములో భాష్యకారులు – **"అస్మదాదీనా మపి సమాశ్రయణీయత్వాయావతీర్య పరావరనిఖిలజనమనోనయనహారిదివ్యచేష్టితాని కుర్వన్, అనవధికదయాసౌహార్దానురాగగర్భావలోకనాలాపామృతైః విశ్వ మాప్యాయయన్"** అని సాయించుటయు ప్రకృతమున స్మరణీయము. ఇట్టిది అవతారప్రయోజనము.

**(అమర్త్యమనుజాదిషు యోనిషు నో చేత్ సమవాతరిష్యః)** – ఇచట ఆదిశబ్దముచే తిర్యక్ – స్థావరములు చెప్పబడినవి. నరనారాయణావతారాదులు సురరూపావతారములు. రామకృష్ణాద్యవతారములు నరరూపావతారములు. మత్స్యకూర్మ వరాహాదులు తిర్యగవతారములు, వట, అశ్వత్థాదులు స్థావరరూపావతారములు. భగవానుడు పలు రూపములో అవతరించుటను గూర్చి **"బహుధా విజాయతే" (పురుష.సూ.)** అని వేదము, **"బహూని మే వ్యతీతాని జన్మాని" (4-5)** అని గీత, దివ్యసూరులు **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ద యోనియుమాయ్ ప్పిఱన్దాయ్" (తిరువిరు-1)** అని, **"నిలవరమ్బిల పలపిఱప్పాయ్" (తి.వా.1-3-2)** అనియు పల్కిరి కదా! దేశికులు అధికారసంగ్రహములో – "దేవతిర్యక్ మనుష్య స్థావరములనెడి నమ్మాళ్వార్లు అన్ని విధములుగను ప్రమాణసిద్ధములైయున్న ప్రాణిసమూహములు నాల్గింటియందును – వానితో సజాతీయుడనదగినట్లు అవతారరహస్యానుసారము సత్యమై, జ్ఞానసంకోచము మొదలగు దోషముల ప్రసక్తిలేనిదై, నిత్యనిర్దోషశుద్ధసత్త్వమయ దివ్యమంగళవిగ్రహపరిణామాత్మకమై, స్వేచ్ఛామాత్రహేతుకమై, కర్మకృతకాలనియమరహితమై, సాధుపరిత్రాణాదిమాత్ర ప్రయోజనమై, వ్యూహ–వ్యూహాంతర–విభవ–విభవాంతరరూపమైయున్న అవతారవర్గముచే – **"నిలైవరమ్బిల పలపిఱప్పాయ్ ఒళివరు ముళ్ళునలమ్" (తి.వా.1-3-2)** అనునట్లు జన్మించితివి అని సాయించుట ఇచట స్మరణీయము.

**(ఇచ్ఛావిహారవిధినా)** – **"ఇచ్ఛాగృహీతాభిమతోదేహః" (6-5-84)** అని విష్ణుపురాణము, **"స్వేచ్ఛాకేసరిణః"** అని ఆనందవర్ధనుడు, **"ఇచ్ఛామీన"** అని, **"స్వేచ్ఛావరాహ"** అని, **"విహారకచ్ఛప"** అని దశావతార స్తోత్రమున దేశికులును పల్కుట గమనింపతగినది. భగవానుని జన్మ ఆస్వామి ఇచ్ఛానుసారము, లీలారూపమైనదేకాని, మనవంటివారి జన్మవలె కర్మకృతమైనది కాదని భావము. **''జన్మ కర్మ చ మే దివ్యమ్'' (4-9)** అను గీతానూక్తి, దీనిని వివరించు **"కర్మమూలహేయత్రిగుణప్రకృతిసంసర్గరూప జన్మరహితస్య"** అను గీతాభాష్యసూక్తి, ఈ రెండిటిని

విశదముచేయు శ్రీదేశికుల తాత్పర్యచంద్రిక సూక్తియు ఇచట స్మరణీయములు. సుందరబాహుస్తవములో కూరేశులు – **"ఐశస్వభావ మజహద్భి రిహావతారైః యో౽లంచకార జగదాశ్రితతుల్యధర్మా" (84)** అనుచు ఈ విషయమును అనుసంధించిరికూడ. **"ఇన్బుఱుమ్ ఇన్బు ఇవ్విళైయాట్టుడైయాన్" (తి.వా.3-10-7)** అని, **"పిఱన్దవాఱుమ్" (తి.వా.5-10-1)** అనియు గల దివ్యసూరిసూక్తులు, **"అకర్మవశ్యనానతాన్ కర్మవశ్యరోడొక్క ప్పిఱప్పతు, పిఱన్దాల్ ఆశ్రితసంరక్షణమే తనక్కు ప్రయోజనమా యిరుప్పదు, అవర్కళాపత్తుప్పదుమ్ కాలమే తనక్కు ప్పిఱక్కైక్కుమ్ కాలమావదు, పిఱవా నిన్ఱాల్ తన్నైశ్వర్యత్తిలొన్ఱుమ్ కుఱైయామల్ పిఱప్పదు, అప్రాకృత సంస్థానత్తై ఇతరసజాతీయమాకానిఱ్పతు, తన్ జన్మత్తై అనుసంధిత్తరుడైయ జన్మజ్గళ్ పోమ్బడియాయిరుప్పదు"** (ఈడు – 5-10-1) ఇత్యాది పూర్వాచార్యసూక్తులును భావనీయములు. భగవానుని అవతారము స్వేచ్ఛాప్రయుక్తమనుటను మహర్షులు సైతము – **"నైష గర్భత్వ మాపేదే, న చ యోన్యా మవసత్ ప్రభుః, న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేధో౽స్థిసంభవా, న భూతసంఘసంస్థానో దేహో౽స్య పరమాత్మనః" (వరాహ.75-44)** ఇత్యాదిగా వివరించిరి. తన అవతారరహస్యమును తెలియనివారినిగూర్చి భగవానుడు **"అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్, పరం భావ మజానంతః" (భ.గీ.9-11)** అని విచారించెను కదా!. ఇది అవతారప్రకారము. ప్రకృతమున కూరేశులు **"త్వదుపసంశ్రయణాభ్యుపాయః"** అనుటద్వారా భగవదవతారప్రయోజనమును, **"అమర్త్యమనుజాదిషుయోనిషు ఇచ్ఛావిహారవిధినా సమవాతరిష్యః "** అనుచు అవతారక్రమమును తెలుపుటచే ఈ శ్లోకము అవతారరహస్యప్రతిపాదకము. గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో **"ఇచ్ఛావిహారవిధినా"** అనుటకు – **"సర్వజ్ఞేషు నిత్యముక్తేషు పితృవచనపరిపాలనదౌత్యసారథ్యాది– స్వేచ్ఛావిహారో న సంభవతీతి తదర్థం మనుష్యాదిసాధర్మ్యేణ"** అని వివరింపబడినది. శ్రీనివాసాచార్య వ్యాఖ్యలో **"త్వదుపసంశ్రయణాభ్యుపాయః"** అనుటకు శరణాగతికి ఉపాయమను అర్థము గ్రహించి, **"త మేవం శరణం గతః(రామా.సుం.38-33), రాఘవం శరణం గతః (యుద్ధ.17-14), మా మేకం శరణం వ్రజ (భ.గీ.18-66), నమశ్చక్రుః జనార్దనమ్ – ఇత్యుక్త ప్రకారేణ శరణాగతిజ్ఞాన మవతారవిషయకశ్రీరామాయణాధీన మితి హృదయమ్"** అని వ్యాఖ్యానింపబడినది. **"అలప్స్యత"** అనునపుడు కర్మణిలో, **"నమవాతిరిష్యః "** అనునపుడు కర్తరిలో లుఙ్ ప్రయోగములు చేయబడినవి. పర, వ్యూహములు రెండును కరణవిప్రకృష్టములగుటచే ఆరూపములను ఆశ్రయించుట దుర్లభము. సర్వేంద్రియసులభమగు అవతారములే లేకున్నచో శరణాగతికి అవకాశమే లేకుండ పోయెడిది అని శ్లోకములోని పిండితార్థము.

**10.** శీల కః ఏష తవ హంత! దయైకసింధో!
క్షుద్రే పృథగ్జనపథే జగదండమధ్యే ।
క్షోదీయసో౽పి హి జనస్య కృతే కృతీత్వ
మత్రావ తీర్య నను లోచనగోచరో౽భూః ॥



దయా+ఏకసింధో = దయకు అద్వితీయమైన సముద్రము వంటివాడా!, కృతీ = కృతకృత్యుడవగు, త్వం = నీవు, జగత్ + అండమధ్యే = బ్రహ్మాండము మధ్యలో, క్షుద్రే = అత్యల్పము, పృథక్ జనపథే = ప్రాకృతజనులకు నివాసస్థానము అగు, అత్ర = ఈ లోకమున, క్షోదీయసః కృతే = మిక్కిలి క్షుద్రుడైన, జనస్య అపి = జనుల కొఱకును, అవతీర్య = అవతరించి, లోచనగోచరః = కన్నులకు కనుపించువాడవు, అభూః నను = అయితివి కదా!, తవ = ఇట్లు అవతరించిన నీయొక్క, ఏషః శీలః = ఈ శీలము (సౌశీల్యము) కః = ఎట్టిది?, హంత = ఆశ్చర్యము.

అతీంద్రియమైన భగవానుని అద్భుత రూపము అత్యంతము అల్పులైన వారికిని దర్శించి, ఆరాధించుటకు వీలగునట్లు ఈ లోకమున అవతరించుట తమ స్మృతిలోనికి రాగానే, భగవానుని ఆ సౌశీల్యగుణమునకు ఆశ్చర్యమును పొంది ఈ శ్లోకమును కూరేశులు సాయించిరి. ఆళ్వార్లు **"ఎత్తిఱమ్", "పిఱన్దవాఱుమ్"**, అనుచు ఆశ్చర్యమును, వ్యామోహమును పొందిన విషయము ఇచట గుర్తుకు తెచ్చుకొనతగును. భగవానుని కల్యాణగుణములందు ప్రావణ్యమును పొందక, ఎదిరించు అసురులవంటి క్షుద్రులున్న ఈ లోకములో అవతరించిన స్వామి సౌశీల్యము మిక్కిలి సుకుమారమైన మనస్సునుకల కూరేశులను ఆశ్చర్యపఱచుటలో, ద్రవీకరించుటలో ఆశ్చర్యమేమున్నది? **"పయనన్ఱాకిలుమ్ పాఙ్గల్లరాకిలుమ్ శెయల్ నన్ఱాక త్తిరుత్తిప్పణి కొళ్వాన్"** అనునట్లు చేతనులను సంస్కరించి, వారివలన తాను కైంకర్యమును స్వీకరించుటయే ప్రయోజనముగా తలచి, **''కట్కిలీ'' (తి.వా.7-2-3)** అను స్వరూపమును వదలి, సకలమనుజనయనవిషయమగుట ఆహా! ఏమి నీ కృప! ఏమి నీ శీలము! అని కవి ఆశ్చర్యపడుచున్నారు.

**(దయైకసింధో)** – ఇది సాభిప్రాయవిశేషణము. నీ శీలగుణమునకు మూలము నీ దయ. నీవు దయకు సముద్రుడవగుటచే నీశీలగుణమును అపరిమితము అని తాత్పర్యము.

**(ఏష తవ శీలః క)** – **"న తే విష్ణో జాయమానో న జాతో దేవ! మహిమ్నః! పర మంత మాప"** అనుచు ఋగ్వేదము (7-99-2) భగవానుని మహిమను తెలిసినవాడు పుట్టలేదు, పుట్టబోడు అని అన్నది. కావున **"తవ"** అను సర్వనామశబ్దము పరత్వ సూచకము. అట్లే **"కృతీ"** అనునదియు పరత్వసూచకము. దీనిని బట్టియే గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో **"పరత్వసౌలభ్యాదినోపబృంహితం సౌశీల్య మనుసంధత్తే"** అని అవతారికలో వివరింపబడినది.

**(కృతీ)** – **"కృతీ"** అను స్తోత్రరత్నసూక్తిని శ్రీదేశికులు – **"కృతీ – స్వార్థకర్తవ్యవిశేషరహితః . తదాహ – న మే పార్థాస్తి కర్తవ్యమ్ – ఇతి"** అని వివరించిరి. కావున తన కొఱకై తాను చేయతగిన కర్తవ్యమేమియు లేనట్లు కృతకృత్యుడైనవాడని అర్థము. దీనివలన భగవానుని అవాప్త సమస్తకామత్వము తెలుపబడినది. ఈ అర్థమునే గద్యత్రయభాష్యమునందును తెలుపుచు దేశికులు **"విహితానుష్ఠాననైరపేక్ష్యం ధర్మప్రవర్తనార్థానుష్ఠానత్వం వా వివక్షితమ్, తేనాపి పరోపకారార్థ**

**మేవ ప్రవృత్తత్వ ముక్తం భవతి"** అని పల్కిరి. కావున కృతి అనగా పరోపకారముకొఱకు ప్రయత్నించువాడను ఈ అర్థము ప్రకృతముననను అనుసంధేయము. అట్లే, **"ఆది కర్మణి క్తః, కృతం కర్తవ్యత్వేనోపక్రాంతమ్ ఆశ్రితానాం యద్ధితమ్, తత్ సర్వం పూర్వమేవానేన ప్రయోజనకర్త్రా ప్రారబ్ధ మిత్యర్థః"** అని దేశికులు చూపిన అర్థాంతరముకూడ ప్రకృతమున సంగతమే.

**(అత్రావతీర్య నను లోచనగోచరోఽభూః)** ఇట్లు అవాప్తసమస్తకాముడవు, భక్తుల క్షేమము కొఱకు ప్రవర్తించు స్వభావమునుకల నీవు నీ అప్రాకృతసంస్థానమును మాంసచక్షువులకును గోచరమగునట్లు అవతరించి, చూపితివి కదా!.

**(శీలః క ఏషః) – "శీలం హి నామ మహతో మందైః సహ నీరంధ్రేణ సంశ్లేష – స్వభావత్వమ్''** అనుచు శీలగుణమును శ్రుతప్రకాశికాచార్యులవారు నిర్వచించిరి. **''విధిశివసనకాద్యైః ధ్యాతు మత్యంతదూరమ్'' (స్తోత్రరత్న.47)** అను రీతిలో బ్రహ్మరుద్రసనకసనందనాదులకును భావింపవీలుకాని రూపము అందఱు దర్శించునట్లు అవతరించుటచే ఏమి శీలమిది? అని కవి ఆశ్చర్యపడుచున్నారు.

**(పృథక్ జనపథే) – పృథక్ కార్యో జనః పృథగ్జనః, సజ్జనేభ్యః పృథక్భూతోజనః –** అనగా మంచివారినుండి వేరుచేయవలసినవారని సుధావ్యాఖ్య. **"మూర్ఖనీచౌ పృథగ్జనౌ"** అని, **"వివర్ణః పామరో నీచః, ప్రాకృత శ్చ పృథగ్జనః"** అని అమరము. ఈ లోకము **"త్వం నీచశశవత్ స్మృతః" (రామా.సుం.22–16)** అనునట్టి నీచప్రచురము కదా! ఏదియో అపూర్వమైన అభీష్టమును పొందుట కొఱకు నీవు ఈ లోకమున అవతరించుట లేదు. ఇచటి అల్పులను అనుగ్రహించుటకొఱకే నీ అవతారము అనుచు అవతార ప్రయోజనమును కూరేశులు ఇందు తెలియజేసిరి.

**''అవాకీ అనాదరః''** – అను ఛాందోగ్యసూక్తిని భగవద్రామానుజులు – **"అవాప్తసమస్తకామత్వేన ఆదర్తవ్యాభావాత్ ఆదరరహితః, అత ఏవ అవాకీ – అజల్పాకః, పరిపూర్ణైశ్వర్యత్వాత్ బ్రహ్మాదిస్తంబపర్యంతం నిఖిలం జగత్ తృణీకృత్య జోష మాసీన ఇత్యర్థః"** అని వివరించుట **''కృతీ''** అనునపుడు స్మరింపనగును. పూర్వశ్లోకమున అవతారము సమాశ్రయణమునకు అనుగుణమని తెలిపినందులకు అనుగుణముగా ఈ శ్లోకమున **"కృతీత్వమ్"** అనుటచే అవాప్త సమస్తకామత్వరూపపరత్వము, **"క్షుద్రే . . . అత్రావతీర్య"** అనుటచే మిక్కిలి తక్కువవారితో కలియునట్టి సౌశీల్యము, **"లోచనగోచరోఽభూః"** అనుటచే మాంసచక్షువులకు సైతము కన్పించు స్వభావమగు సౌలభ్యమును తెలుపబడినవి. పరత్వవిశిష్టసౌలభ్యమును కలవాడే కదా సమాశ్రయణీయుడు. ఈ సౌలభ్య, సౌశీల్యములు రెండును దయాగుణ కార్యములనుటను **"దయైకసింధో"** అను ప్రయోగము సూచించుచున్నది. **"త్వదసాధారణః త్వదుత్కర్షాచ్ఛాదక ఇత్యర్థః"** అని గార్గ్యరామానుజాచార్యవాఖ్య. **"హంత"** అను అవ్యయము ఆశ్చర్యమును, హర్షమును తెలుపును.



**11.** **యం పాతకాత్ సుమహతోఽప్యుదధారయ స్త్వం**
**త్వత్పాదవారిపరిపూతశిరా శ్చ యోఽభూత్ ॥**
**తం వందసే కిల తత శ్చ వరం వృణీషే**
**క్రీడావిధి ర్బత విలక్షణలక్షణ స్తే ॥**

(హేదేవ = స్వామీ!), త్వం = నీవు, యం = ఏ రుద్రుని, సుమహతః అపి = మిక్కిలి గొప్పదైనను, పాతకాత్ = పాపమునుండి, ఉదధారయః = ఉద్ధరించితివో, యః చ = ఏ రుద్రుడు, త్వత్ పాదవారి = నీ పాదములనుండి పుట్టిన జలమగు శ్రీపాదతీర్థముచే (గంగచే), పరిపూత=పరిశుద్ధమైన, శిరాః = తలను కలవాడు, అభూత్ = అయ్యెనో, తం = అట్టి, రుద్రుని, వందసే = నమస్కరించుచున్నావు, తతః చ = ఆ రుద్రుని వలన, వరం = వరమును, వృణీషే చ= కోరుచున్నావు, తే = నీ యొక్క, క్రీడావిధిః = లీలాప్రకారము, విలక్షణలక్షణః = విశిష్టమైన రూపమును కల్గినది సుమా!, బత = ఆశ్చర్యము.

పూర్వశ్లోకమున అనుసంధించిన సౌశీల్యగుణము అత్యుత్కటమైయున్న స్వామియొక్క ఒక లీలాప్రకార విశేషమును ఇందు అనుసంధించుచు, కూరేశులు "స్వామీ! నీ సౌశీల్యప్రకారములు నిరంకుశములు కదా!" అని ఆశ్చర్యపడి, శిరఃకంపమొనర్చుచున్నారు.

స్వామీ! రుద్రుని నీవు బ్రహ్మహత్యా పాతకమునుండి కాపాడితివి. అతని శిరస్సును నీపాదమునుండి పుట్టిన గంగాజలమనెడు శ్రీపాదతీర్థము పవిత్రము చేసినది. అట్టి రుద్రుని నీవు నమస్కరించి, వరము వేడితివి కదా! ఆహా! ఇది నీ ఈ సౌశీల్యము అతి విలక్షణమైనదనుటను తెలియజేయుచున్నది.

**(యం పాతకాత్ . . . ఉదధారయః)** – ఒకానొక సమయమున శివునకువలెనే బ్రహ్మకును అయిదు ముఖములుండెడివి. పార్వతీదేవివంటి పలువురు భ్రమ చెందుటకు ఇది హేతువైయుండుటను గమనించిన రుద్రుడు బ్రహ్మకుకల అయిదు శిరస్సులలో మధ్య శిరస్సును ఒక దానిని గిల్లిపారవైచెను. ఆ పాప ఫలితముగా అతని చేతికి బ్రహ్మకపాలము అంటుకొనెను. **"యస్మాత్ అనపరాధస్య శిర శ్ఛిన్నం త్వయా మమ, తస్మాత్ శాపసమాయుక్తః కపాలీ త్వం భవిష్యసి"** అని బ్రహ్మ శపింపగా రుద్రుడు కపాలి అయ్యెను. ఇందులకు పరిహారము ఏమి చేయవలెనో తెలియక శివుడు బాధపడుచుండగా, దేవతలు, మునులును అతనితో "ఈ పాపము తొలగుటకు నీవు బిచ్చమెత్తుచుండుము. ఎపుడు ఈ కపాలము నిండునో అపుడు ఇది నీ చేతినుండి విడిపోవును" అని పల్కిరి. ఇట్లు బిచ్చమెత్తుచు శివుడు బదరికాశ్రమమును చేరి, అచట భగవానుని భిక్షవేడగా, స్వామి **"అక్షయమ్"** అనుచు భిక్షను ప్రసాదించిన వెంటనే ఆ కపాలము నిండి, రుద్రుని చేతినుండి విడిపోయి భగ్నమయ్యెను. భగవానుడు తన వక్షమును నఖముతో గీరగా, అందుండి స్రవించిన రక్తముతో కపాలము నిండి విడిపోయెను అనియు కలదు. **"విష్ణుప్రసాదాత్ సుశ్రోణి! కపాలం తత్ సహస్రధా, స్ఫుటితం బహుధాయాతం స్వప్నలబ్ధం**

**ధనం యథా"** అని ఈ వృత్తాంతము మత్స్య పురాణములో 182వ అధ్యాయమున వివరముగా తెలుపబడినది. దీనిని పూర్వాచార్యులు తమ వ్యాఖ్యలలో ఉట్టంకించిరి. భగవానుని తిరుమేనినుండి స్రవించిన స్వేదజలముతో కపాలమునిండి, శివుని శాపము తీరెనని వరాహపురాణవచనము. ఇదియే శ్వేతనదిగా ప్రవహించెనని శ్రీముష్ణస్థలపురాణము పేర్కొనుచున్నది. అప్రాకృతమైన భగవానుని దేహమునుండి ఇట్లు రక్తము, స్వేదము జనించునా? అను ప్రశ్నకు – **"అప్రాకృతే భగవద్విగ్రహే యుద్ధాదిషు, అత్ర చ రుధిరస్వేదాదికం మాయాసృష్టం మంతవ్యమ్"** అనుచు అది భగవానుని మాయాసృష్టి అని దేశికులు స్తోత్రరత్నభాష్యమున సమాధానించిరి. పై వృత్తాంతములలోని భేదములను కల్పభేదమునుబట్టి సమన్వయించుకొననగునని పూర్వాచార్యులు సాయించిరి. కావున విరోధము లేదు. **"తుణ్డవెణ్పిఱైయన్ తుయర్ తీర్త్తవన్" (అమలనాది)** అను తిరుప్పాణాళ్వార్లసూక్తిని మునివాహన భోగములో వివరించుచు శ్రీదేశికులు పల్కిన సూక్తులిచట స్మరణీయములు.

**(పాతకాత్ సుమహతః)** – ఏ పాపము ఎఱుగనివాడు, సాక్షాత్తు తండ్రి, అందునను **"గరీయాన్ బ్రహ్మదః పితా"** అనునట్లు వేదాంతపారంగతుడు, తనకు ఆచార్యుడైన బ్రహ్మయొక్క తలను ఖండించుట మహాపాతకము; ప్రత్యేకించి సర్వేశ్వరుడను కీర్తిని కల రుద్రునకీ కార్యము తగదు. **"విదుషోఽతిక్రమే దండభూయస్త్వమ్"** అని గౌతమధర్మశాస్త్రవచనము. కావుననే ఇచట **"సుమహతః"** అను విశేషణము ప్రయోగింపబడినది. శ్రీరామాయణము అయోధ్యాకాండలో (75వ సర్గ) భరతుడు కౌసల్యాదేవివద్ద చేయు ప్రమాణములలో – **"కపాలపాణిః పృథివీ మటతాం చీరసంవృతః, భిక్షమాణో యథోన్మత్తో యస్యార్యోనుమతే గతః" (40)** అనుచు ఈ వృత్తాంతమును పేర్కొనెను. **"అజ్ఞానాత్ బ్రాహ్మణం హత్వా చీరవాసా జటీ భవేత్, స్వేనైవ హతవిప్రస్య కపాల మపి ధారయేత్"** అను మార్కండేయ వచనమును హేమాద్రి తన ధర్మశాస్త్రమున ఉదాహరించెను.

**(త్వత్పాదవారిపరిపూతశిరాః)** భగవానుడు త్రివిక్రమావతారమును దాల్చినపుడు పై లోకములను కొలిచిన స్వామి పాదమును బ్రహ్మ తన కమండలుజలముతో కడుగగా, ఆ శ్రీపాదతీర్థము గంగానదియై ప్రవహించినది. ఆ పవిత్రజలమును శివుడు భక్తితో తలపై దాల్చి పునీతుడయ్యెను అను పౌరాణికవృత్తాంత మిచట ప్రస్తుతము. **"తదంబు పరయా భక్త్యా దధార శిరసా హరః, పావనార్థం జటామధ్యే యోగ్యోఽస్మీత్యవధారణాత్"** అనుచు దీనిని ఈశ్వరసంహిత తెలిపినది. **"తీర్త్త నులకళన్ద శేవడిమేల్" (తి.వా.2-9-6)** అని, **"కుఱైకొణ్డునాన్ముకన్ కళైకొణ్డ కణ్డత్తాన్ శెన్నిమేల్ ఏఱక్కళువినాన్" (నాన్ముకన్-9)** ఇత్యాదిగా దివ్యసూరులీ వృత్తాంతమును అనుసంధించిరి. **"యచ్చౌచనిస్సృతసరిత్ ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివః శివోఽభూత్"** అని శ్రీశుకులు, స్తోత్రరత్నములో **"పాదోదకేన స శివః స్వశిరోధృతేన" (13)** అని యామునులును పల్కిరి. ఈవిధముగా శివుని విషయమున పాతకవిమోచనము ద్వారా అనిష్టనివృత్తి, పవిత్రతను కల్గించుటద్వారా ఇష్టప్రాప్తి రూపమైన రక్షణకార్యమును భగవానుడు చేయుటచే, శివుడు రక్ష్యకోటిలోనికి చేరినవాడని, భగవానుడే స్వామి అని ఏర్పడినది కదా!. ఇట్టి శివుని



నీవు నమస్కరించుట, అతనివలన నీవు వరమును వాంఛించుట ఆశ్చర్యకరము అని ఉత్తరార్ధములో అనుచున్నారు. **(తం వందసే కిల తత శ్చ వరం వృణీషే)** – హరివంశములో. కైలాసయాత్రాసందర్భములో శ్రీకృష్ణుడు శివుని వేడి, వరమును పొంది, తత్ఫలముగా పుత్రసంతానమును పొందెనని కలదు. **"నమ స్తే శితికంఠాయ నీలగ్రీవాయ వేధసే, ... నమ స్తే వామదేవాయ మహాదేవాయ తే నమః"** అనుచు శివుని నమస్కరించి, కృష్ణుడు వరమును పొందినట్లు హరివంశము విష్ణుపర్వములో 117వ అధ్యాయములోనున్నది. **"కిల"** అను అవ్యయముద్వారా ఇది అంతయు నీలీలా వ్యాపారమే సుమా! వాస్తవము కాదు అను అర్థమును ధ్వనించును. భగవానుని శివుడు తనకు కొంత గొప్పతనమును ప్రసాదింపుమని వేడగా, భక్తవత్సలుడగు స్వామి అతని ప్రార్థనను అనుసరించి, తాను అర్థియై, శివుని వేడి వరమును పొందినట్లు నటించు, శివునకు గొప్పతనమును కల్గించెను; అంతియే!. భారతము శాంతి పర్వములోని **"అస్య చైవానుజో రుద్రో లలాటాత్ యః సముత్థితః, బ్రహ్మానుశిష్టో భవితా సర్వసత్త్వవరప్రదః"** అను వాక్యమునందు, **"దేవకార్యనిమిత్తేషు మానుషత్వ ముపాగతః, త్వా మేవారాధయిష్యామి త్వం చ మే వరదో భవ"** అను వరాహపురాణవచనమునందు ఈ విషయము స్పష్టముచేయబడినది. **"స్వరక్ష్యవిషయే ప్రణమన-వరప్రదానే అత్యాశ్చర్యకరే ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(క్రీడావిధి ర్వత విలక్షణలక్షణః)** తనకు శేషభూతుడైన శివుని శేషిగా చేసి, అతనికి నమస్కారాదులను చేయుట శివుని పరత్వమును, భగవానుని అవరత్వమును తెలుపును కదా! అనినచో, ఇదియు భగవానుని ఒక విధమైన లీలయే. **"ఇన్బుఱుమ్ మివ్విళైయాట్టుడైయాన్" (తి.వా.3-10-7)** కదా! స్వామి. ఆ స్వామి! లీలాప్రకారమే ఇది. కావున దీనిచే స్వామి పరత్వమునకు హానిలేదు. ఇది సౌశీల్యముయొక్క ప్రకారమే అని భావము. ద్వితీయపాదములోని చకారమును అనుక్తసముచ్చాయకముగా గొని, అనేక పురాణములలోవర్ణింపబడిన ఇట్టి స్వామి నిరంకుశస్వాతంత్ర్యప్రయుక్తములగు సౌశీల్యవృత్తాంతములు పలు ఇచట వివక్షితములని చెప్పనగును.

**12.** **క్రీడావిధేః పరికర స్తవ యా తు మాయా**
**సా మోహినీ న కతమస్య తు హంత జంతోః ।**
**హై మర్త్యసింహవపుష స్తవ తేజసోఽంశే**
**శంభు ర్భవన్ హి శరభ శ్శలభో బభూవ ॥**

(హేదేవ = స్వామీ!), యా మాయా = యే మాయ (ప్రకృతి), తవ = నీ యొక్క క్రీడావిధేః = లీలావ్యాపారమునకు, పరికరః = సాధనముగానున్నదో, ఆ మాయ, కతమస్య తు జంతోః = ఏ ప్రాణియొక్క, న మోహినీ = అవివేకమును (మోహమును) కల్గించునది కాదు, శరభః భవన్ = శరభరూపమును పొందుచున్నవాడైన, శంభుః = శివుడు, మర్త్యసింహవపుషః =

నృసింహరూపమునుకల, తవ = నీ యొక్క తేజసః + అంశే = తేజస్సుయొక్క అత్యల్ప భాగములో, శలభః = మిడతగా, బభూవ హి = అయ్యెను కదా!, హై = ఆశ్చర్యము.

భగవానుడు సృజ్యకోటిలోనికి చేరిన శివుని నమస్కరించుట, వరము వేడిపొందుటయును కేవలము లీలామాత్రమేననుటను ఇతిహాసాంతరమును ప్రస్తుతించుట ద్వారా కైముతికన్యాయమున సమర్థించుచున్నారు. లేక, భగవానుడు లీలకొఱకు శివుని నమస్కరించినను, సర్వజ్ఞుడుగా పేరుపొందిన శివుడెట్లు తన స్వరూపమును మఱచి, ఊరకుండెను? అనుటకు పూర్వార్థమున సమాధానమును పల్కుచు, అందులకు ఉపోద్బలకముగా వేరొక ఇతిహాసమును అర్థాంతరన్యాస ప్రక్రియలో ప్రస్తావించుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ! నీ లీలావ్యాపారమునకు సాధనమైన మాయ (ప్రకృతి) ఎవరినైనను మోహింపచేయు శక్తి కల్గినది. కావుననే, నృసింహరూపియైన నిన్ను ఎదిరింపవచ్చిన శరభరూపుడగు శివుడు నీ తేజస్సులోని అత్యల్పభాగమున మిడతయై నశించెను కదా!

**(తవ క్రీడావిధేః పరికరః మాయా)** – మాయ అనగా ప్రకృతి. **"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్" (శ్వేతా.4-10)** అని వైదికసూక్తి. విచిత్రమైన సృష్టికి సాధనమై, ఎవరినైనను మోహింపచేయు శక్తిని కల్గినదగుటచే దీనికి మాయ అను పేరు కల్గెను.

**(సా మోహినీ న కతమస్య జంతోః)** – **"బ్రహ్మాద్యాః సకలా దేవాః మనుష్యాః పశవ స్తథా, విష్ణుమాయామహావర్తమోహాంధతమసావృతాః" (5-30-17)** అనుచు విష్ణు పురాణములో పరాశరమహర్షి పల్కిన రీతిలో బ్రహ్మాదిదేవతలందఱు విష్ణుమాయతో మోహమును పొందువారే; కావున ఆశ్చర్యము లేదు అని తాత్పర్యము. **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" (7-14)** అని కదా గీతాసూక్తి. బదరికాశ్రమములో క్రోధాంధుడైన రుద్రుడు భగవానుని ఎదిరించుట, బ్రహ్మ అపుడు చేసిన ఉపదేశము వలన రుద్రునకు వివేకము కల్గుట, భగవానుడపుడు రుద్రుని క్షమించుటయును మహాభారతము శాంతిపర్వములో కలదు. అట్లే, బాణాసుర వృత్తాంతమునందును శివుడు స్వామిని ఎదిరించుటను గమనింపవచ్చును. వీని వలన తేలినది ఏమనగా – జ్ఞానాధికులలో గొప్పవారుకూడ కర్మవశ్యులగుటచే, కొన్ని సందర్భములలో భగవన్మాయాతిరోహితస్వరూపులై మోహమును చెందుదురని, **"యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్"** అనునట్లు కర్మ సంబంధమును పోగొట్టుకొనిన సనత్సుజాతీయునివంటి కొద్దిమంది మాత్రమే భగవానుని స్వరూపమును తత్త్వతః గ్రహింపగలరని ఏర్పడుచున్నది.

**(శంభుః శరభః భవన్ . . . శలభో బభూవ)** – ఎనిమిది కాళ్లను, రెండు తలలను, ఱెక్కలను, పదునైన గోళ్లను, పైకిచూచు కళ్లనుకల పశురూపమే శరభమని అందురు. పక్షి అను కూడ ప్రసిద్ధి కలదు. ఇది సింహమును సైతము సులభముగా వధింపగలదట. భగవానుడు నృసింహావతారమునెత్తి, హిరణ్యుని వధించినపుడు, అసురపక్షపాతియైన శివుడు నృసింహుని ఎదిరించుటకై శరభరూపమును దాల్చి రాగా, భగవానుడు ఆ శరభమును సైతము ఛిన్నాభిన్నము చేసెనని **"హంతు మభ్యాగతం రౌద్రం శరభం నరకేసరీ, నఖై ర్విదారయామాస హిరణ్యకశిపుం యథా"** ఇత్యాది వరాహపురాణ వాక్యములందు స్పష్టము. **"నమోஉస్తు నరసింహాయ లక్ష్మీస్థితిజితక్రుధే, యత్క్రోధాగ్నౌ పురా రుద్రః శరభః శలభాయితః"** అను వేరొక పురాణవచనము కూడ శ్రీనివాసాచార్య సంస్కృతవ్యాఖ్యలో ఉదాహరింపబడినది. ఈ సూక్తినిబట్టియే **"శలభాయితమ్"** అని శ్లోకములో ప్రయోగింపబడినది. దీపమును చూచి ఏదో ఫలమని భ్రమించి, ఆ దీపశిఖలోపడి మాడిపోవు రెండు ఱెక్కలను కల చిన్న కీటకమునకు మిడత అని పేరు. **"జ్వలంతమ్"** అని స్తుతింపబడు నృసింహుని అప్రమేయతేజస్సులోని అత్యల్పభాగములో మాడి భస్మమైన రుద్రుని మిడతగా పల్కుట మిక్కిలి యుక్తము. ఈ వృత్తాంతము కూరేశవిజయమను గ్రంథమునందును కలదు. నృసింహము సామాన్యసింహము కాదు. అతివృత్తాసురవిక్రమ ప్రతాపసింహము కావున, శరభరూపియైన శివుని అవలీలగా వధించెనని శ్రీప్రభ అణ్ణాస్వామివారి రసోక్తి. **"కేళ్రిళరు మఱ్ఱవేళ్కున్ఱ అళ్లల్‌శరబత్తై ప్పిళన్ద శిఙ్గవేళ్రకున్ఱత్తినార్"** అని పిళ్లైప్పెరుమాళ్ అయ్యఙ్గార్ నూఱ్ఱెట్టుత్తిరుపతి అన్దాదిలో సాయించిరి.

**"తుయక్కఱు మదియిన్ నన్ఞానత్తుళమరర్రై త్తుయక్కుమ్ మయక్కుడై మాయైకళ్ వానిలుమ్ పెరియనవల్లన్" (తి.వా.1-3-10)** అని కదా భగవానుడు ప్రసిద్ధిని పొందినాడు. క్రీడాపరికరముగా స్వామి సృష్టించిన మాయలోపడి మోహమును చెందనివారెవ్వరు లేరు. బ్రహ్మహత్యాపాతక విమోచనము మొదలగు పలు మహోపకారములను పొందిన శివుడుకూడ భగవానునకు విరోధియైవచ్చి ఎదిరించుటకు మాయచే తిరోహితమైన స్వరూపమును కలవాడగుటయే కారణము. ప్రహ్లాదునివలె నృసింహుని ఆశ్రయించి, ఉజ్జీవింపవలసియుండగా, శివుడిట్లు నృసింహప్రతాపాగ్నిలోపడి మిడతవలె భస్మమగుట భగవన్మాయాకార్యమే తప్ప వేరు కాదు అను శ్రీప్రభ అణ్ణాస్వామివారి వివరణము అనుసంధేయము.

భగవానునితో యుద్ధముచేయుటకే సిద్ధపడిన రుద్రుడు భగవానుడు చేయు నమస్కార, వరప్రార్థనాదులను అంగీకరించుటలో చెప్పవలసినదేమి? అను అర్థము ఇచట తోచుటచే అర్థాత్ అర్థాపత్తి అలంకారము కలదు. **"మాయామోహితత్వాత్ యుద్ధోన్ముఖస్య ప్రణామాదిస్వీకార ముచిత మేవేతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. పూర్వార్థములో తెలుపబడిన భగవన్మాయ అందఱిని మోహపఱచునను అర్థము. ఉత్తరార్థములోని శరభవృత్తాంతముద్వారా సమర్థింపబడుటచే అర్థాంతరన్యాసము.

**13.** **యస్యాత్మతాం త్రిపురభంగవిధా వధా స్త్వం**
**త్వచ్ఛక్తితేజితశరో విజయీ చ యోஉభూత్ ।**
**దక్షక్రతౌ తు కిల తేన వినిర్జిత స్త్వం**
**యుక్తో విధేయవిషయేషు హి కామచారః ॥**

(దేవ = స్వామీ), త్రిపురభంగవిధౌ = త్రిపురాసులను సంహరించు కార్యమందు, యస్య = ఎవని (ఏ శివునకు), ఆత్మతామ్ = అంతరాత్మ అగుటను, త్వం = నీవు, అధాః = దాల్చితివో, త్వత్ + శక్తి = నీ శక్తిచే, తేజిత = పదునుపెట్టబడిన, శరః = బాణమును కలవాడు, విజయీ చ = జయమును కలవాడును, అభూత్ = అయ్యెనో, తేన = అట్టి రుద్రునిచే, దక్షక్రతౌ= దక్షయజ్ఞమందు, త్వం = నీవు, వినిర్జితః కిల = జయింపబడితివి అట, విధేయవిషయేషు = తనకు విధేయులైయున్న వారిపట్ల, కామచారః = స్వేచ్ఛగా ప్రవర్తించుట, యుక్తః హి = తగినదే కదా!

భగవానుని పారతంత్ర్యమును స్వాతంత్ర్యమువలె నిరంకుశము, అతిశయావహమును అని ఇందుకవి అనుచున్నారు. భగవత్పారతంత్ర్యము కృపామూలకము, నిరంకుశ స్వాతంత్ర్యమూలకము అని రెండువిధములై యుండును. కృపామూలకమైన పారతంత్ర్యము పలుచోట్ల కన్పించును. కాని, స్వాతంత్ర్య ప్రయుక్తమైన పారతంత్ర్యము మిక్కిలి అరుదు. అది త్రిపురాసురసంహారసందర్భములో రుద్రునిపట్ల వ్యక్తమైనది. అది ఇచటి విషయము.

తారకాసురుని పుత్రులగు విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడను ముగ్గురు అసురులు తీవ్రమైన తపస్సుచేసి, బ్రహ్మ అనుగ్రహమువలన ఆకాశమున సంచరించు బంగారు, వెండి, ఇనుముతో చేయబడిన పట్టణములను వరఫలములుగా పొందిరి. వానితో వారు ఇష్టము వచ్చినట్లు సంచరించుచు, లోకములను హింసించుటచే, దేవతలు, ఋషులును వారిని వధింపవలసినదిగా శివుని వేడిరి. అపుడు అతడు భూమిని రథముగా, సూర్యచంద్రులను రథచక్రములుగా, నాల్గువేదములను నాల్గు అశ్వములుగా, బ్రహ్మను సారథిగా, మహామేరువును ధనుస్సుగా, ఆదిశేషుని వింటినారిగా, విష్ణువు, వాయువులను తెక్కలుగా, అగ్నిని మొనగా కలబాణమును అమర్చుకొని త్రిపురాసుర సంహారము చేసెనని పురాణ కథనము. శివుడిట్లు త్రిపురాసురులను వధించుటకు భగవానుడతనికి అంతరాత్మగా నిలచియుండుటయే కారణము. ఈ అంశము **"విష్ణు రాత్మా భగవతో భవస్యామితతేజసః, తస్మా ద్ధనుర్జ్యాసంస్పర్శం స విషేహే మహేశ్వరః" (35-50)** అని భారతము కర్ణపర్వములో తెలుపబడినది.

**(త్వచ్ఛక్తితేజితశరః)** – తేజితమనగా పదునుపెట్టబడిన అని అర్థము. "తిజ–నిశానే" అను ధాతువునుండి పుట్టిన పదమిది. **"త ఇషుం సమకుర్వత, అగ్ని మనీకమ్, సోమం శల్యమ్, విష్ణుం తేజనమ్"** అను శ్రుతిని బట్టి కూరేశులు ఈ పదప్రయోగమునుచేసిరని కొందఱి వ్యాఖ్య. **"చింతయిత్వా హరిం విష్ణు మవ్యయం యజ్ఞవాహనమ్, శరం సంకల్పయాంచక్రే విశ్వకర్మా మహామనాః"** అనునట్లు భగవానుని శక్తి విశేషము వలననే త్రిపురాసురసంహారము సాధ్యమైనది. కావున త్రిపురాసురసంహర్త నిజమునకు భగవానుడే. అందుచే ఆళ్వార్లు **"పురమొరు మూన్టెరిత్తు"** (1-1-8) అని, **"నణ్ణార్ నకరమ్ విళ్ల నవిమలై శిలైవళైవుశెయ్తఙ్గజ్గల్ నిఅవమ్మదు వానవనే" (కలియన్.6-1-3)** అనియు త్రిపురదాహమును స్వామియే చేసి, దానిని శివుడు చేసినట్లు



ప్రసిద్ధి కల్గించెననిరి. ఇట్లు నీ వలన జయమును పొందిన రుద్రుడు దక్షాధ్వరములో నిన్ను జయించెననుట నీ స్వాతంత్ర్య ప్రయుక్తపారతంత్ర్యమునకొక ఉదాహరణము అని ఉత్తరార్ధ తాత్పర్యము.

పూర్వము ఒకానొక సమయమున దక్షప్రజాపతి ఋషులుచేయు ఒక యజ్ఞమునకు పోయినపుడు దేవతలు, మహర్షులు అందఱు గౌరవపూర్వకముగా లేచి నమస్కరించిరి. కాని, శివుడు మాత్రము లేవలేదు. అందులకు దక్షుడు తన అల్లుడైనను రుద్రునిపై మిక్కిలి కోపించి, అతనికి హవిర్భాగము లేని ఒకానొక యజ్ఞమునుచేయ తలపెట్టి, రుద్రుని తప్ప అందఱు దేవతలను ఆహ్వానించెను. దక్షుని కుమార్తె సతీదేవి తన తండ్రి చేయు యజ్ఞమును చూడగోరినను. శివుడామెను పోవలదని నివారించెను. కాని, ఆమె వినకుండ యజ్ఞవాటికకు పోయెను. అచట దక్షుని వైముఖ్యమును చూచి, సహింపలేక తన యోగబలముద్వారా అగ్నిని సృష్టించి, అందు దేహమును త్యజించెను. ఆమె మరణవార్తను వినిన శివుడు కోపోద్రిక్తుడై, వీరభద్రుని సృష్టించి, వానిద్వారా యజ్ఞమును ధ్వంసము చేయించెను. యజ్ఞమునకు వచ్చిన దేవతలు అందఱు వీరభద్రుని చేతిలో పరాభవపడిరి. అపుడు భగవానుడు శివుని సమాధానపఱచెను. ఈ వృత్తాంతము భాగవతములోని నాల్గవ స్కంధములో విస్తరముగా కలదు. ఈ కథలో విష్ణువు పరాజితుడైనట్లు శబ్దతః లేకున్నను, **"యజ్ఞో వై విష్ణుః"** అని, **"సర్వే యజ్ఞాః సర్వఇజ్యా శ్చ కృష్ణః"** అని, **"వేళ్వియాయ్ త్తక్కణైయాయ్ త్తానుమానాన్"** అని, **"అహం క్రతు రహం యజ్ఞః" (భ.గీ.9-16)** అనియు, **"యజ్ఞ ఇజ్యో మహేజ్య శ్చ క్రతు స్సత్రం"** అనియు చెప్పినరీతిలో భగవానుడు యజ్ఞరూపి కావున యజ్ఞధ్వంసమైనపుడు విష్ణుపరాజయము ఏర్పడెనను భావముతో కూరేశులు ఇట్లు పల్కిరని శ్రీప్రభ అణ్ణాస్వామివారి వ్యాఖ్య. కొన్ని తామస పురాణములలో భగవానుడు కాకిరూపమును దాల్చి హరణరూపమునుదాల్చి పారిపోయెనని ఉన్నది. కావున కూరేశులు దానిని దృష్టిలో నుంచుకొని ఇట్లు పల్కిరని కొందఱు వ్యాఖ్యానించిరి. కాని, పరమప్రామాణికులగు కూరేశులు ఆ కథను బట్టి ఇట్లు పల్కిరనుట సమంజసముగా తోచదు.

తనకు విధేయుడైన రుద్రుడు దక్షయజ్ఞమునకు కల్పించిన విఘ్నమును నివారించి, యజ్ఞము పరిసమాప్తి అగునట్లు రక్షింపవలసియుండగా, భగవానుడిట్లు ఊరకుండుటకు కారణము ఏమి? అనినచో, తన భక్తుడైన రుద్రునకు విజయమును కల్గించి, అతని కీర్తిని ప్రకాశింపచేయవలెనను అభిప్రాయమే. దీనిని అర్థాంతరన్యాసప్రక్రియలో చివరి పాదమున సమర్థించుచున్నారు.

**(యుక్తో విధేయవిషయేషు కామచారః)** – తనకు విధేయులైన భార్యాపుత్రాదులను ఒకానొక సమయమున దండించుట, వేరొక సమయమున వారిని శిరసావహించుటయు లోకానుభవసిద్ధము. అంతమాత్రముచే శేషశేషిభావము మారదు కదా! అనగా రెండు సందర్భములలోను భార్యాపుత్రాదులు యజమానికి విధేయులే అగుదురు. అట్లే,

దక్షాధ్వరధ్వంసఘట్టములో రుద్రునకు విజయమును కల్గించి, అతని కీర్తి ప్రకటించినంత మాత్రమున భగవానుని పారమ్యమునకు భంగము లేదు. సరికదా, ఇట్టి పారతంత్ర్యము భగవానునకు తగినదే, మరింత అతిశయావహమే అని భావము. **"స్వాధీనజనపారతంత్ర్య మతిశయావహ మేవేతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

14. **ముగ్ధ శ్శిశు ర్వటదళే శయితోఽతితన్వా**
**తన్వా జగంతి బిభృషే సవికాస మేవ ।**
**ఐశీ మిమాం తు తవ శక్తి మతర్కితవ్యా**
**మవ్యాజతః ప్రథయసే కి మిహావతీర్ణః ॥**

వటదళే = మఱ్ఱి ఆకులో, శయితః = శయనించిన, ముగ్ధః శిశుః = మిక్కిలి బాలుడవగు (త్వం = నీవు), అతితన్వా = మిక్కిలి చిన్నదైన, తన్వా = రూపముతో, జగంతి = లోకములను, సవికాసమ్ + ఏవ = నిస్సంకోచముగా, బిభృషే = ధరించుచున్నావు, తవ = నీయొక్క, ఐశీమ్= ఈశ్వరత్వసంబంధమైన, ఇమాం = ఈ, శక్తిమ్ = శక్తిని, ఇహ = ఈ లోకమున, అవతీర్ణః సన్= అవతరించినవాడవై, అవ్యాజతః = నిర్హేతుకముగా, కిమ్ ప్రథయసే = ఎందులకు వ్యక్తముచేయుచున్నావు?

పూర్వశ్లోకమునందు ప్రస్తుతమైన దక్షయజ్ఞ ధ్వంసము మొదలగు కొన్ని వృత్తాంతముల వలన రుద్రపారమ్యమును తలంచువారు కొందఱు ఉందురు. కావున వారికి తగిన సమాధానమును వటపత్రశాయిఅవతారమును అనుసంధించుటద్వారా కూరేశులు తెలుపుచున్నారు. **"ఎమ్బెరుమాన్ ఉణ్డుమిழ్న్ద ఎచ్చిల్ దేవర్ అల్లాదార్ తాముళరే?"** అను రీతిలో ప్రళయకాలమున ఈశ్వరునితో పాటు అందఱు భగవానుని ఉదరమున ప్రవేశించి, జీవించిరని తెలిపినచో, భగవానుని పరత్వమును, ఇతర దేవతల అవరత్వమును గ్రహింతురని వటపత్రశాయి అవతారమును కూరేశులు ప్రస్తుత శ్లోకమున ప్రస్తుతించిరి. నమ్మాழ்వార్లును తిరువాశిరియ ప్రబంధములో **"ఓ ఓ ఉలకినతియల్వే!"** అనుచు ఇతరదేవతల పారమ్యమును అంగీకరించువారిని గూర్చి పరితపించి, **"నళిర్ మదిచ్చడైయనుమ్"** అని ప్రారంభించి, **"ఒరుపొరుళ్ పుఱప్పాడిన్ఱి ముழுవదుమ్ అకప్పడక్కరన్దు ఓరాలిలైచ్చేర్న్ద ఎమ్బెరుమామాయనై యల్లదు ఒరుమాదెయ్వమ్ మఱ్ఱుడైయమోయామే"** అనుచు సప్తలోకములను ఉదరమున నుంచుకొనిన వటపత్రశాయి వృత్తాంతమును అనుసంధించుట ఇచట స్మరింపనగును.

**(ముగ్ధ శ్శిశుః) – "పడియాదుమిల్ కుழவిప్పడి"** అను నమ్మాழ்వార్ల శ్రీసూక్తి, దానిని వివరించు నమ్పిళ్లై **"ఒప్పొన్ఱు మిన్ఱిక్కే యిరుక్కిఱ పిళ్లైత్తనత్తాలే. యశోదాస్తనంధయముమ్ ఒప్పన్ఱు వటదళశాయిక్కు తొట్టిల్‌నిన్ఱుమ్ తత్తైయిలే విழுప్పుకుకిఱోమ్ ఎన్ఱు అఞ్జవతియాద బాల్యమితే అఱ్ఱు. ఆలిలైయిల్ నిన్ఱుమ్ ప్రళయత్తిలే విழுకిఱోమ్ ఎన్ఱు అఞ్జవతియాద మౌగ్ధ్యమితే యిఱ్ఱు"** అని పల్కుటయు స్మరణీయములు. అట్లే, **"పాలకనాయ్ ఏழులకుణ్డు" (తి.వా.4-2-1)** అను



తిరువాయ్‌మొழிసూక్తి, అచటి నమ్పిళ్లై వ్యాఖ్యానసూక్తియు అనుసంధేయములు.

**(వటదళే శయితః)** అపుడే పుట్టిన లేత ఆకులో శయనించినవాడు. **"ఒరుపవనాన ఆలిలైయిలే"** అని నమ్పిళ్లైసూక్తి.

**(అతితన్వా తన్వా)** – లోకములో అపుడే జన్మించిన శిశువు చిన్నదిగానే ఉండును. కాని, ఇచటి స్వామి రూపము అంతకంటే చాలా చిన్నది అని భావము.

**(జగంతి బిభృషే)** – జగచ్ఛబ్దార్థములో శివుడును చేరిన వాడే కావున, ఆ ఈశ్వరునికూడ స్వామి తన ఉదరములో భరించెననుట కింపునఃన్యాయసిద్ధము. **"నెఱ్ఱిమేఱ్కణ్ణానుమ్ నిఱైమొழிవాయ్ నాన్ముకనుమ్ కడలరైయన్ విழுఙ్గామల్ తాన్ విழுఙ్గి యుయ్యక్కొణ్డ కొఱ్ఱప్పేరాழியాన్"** అనుచు దీనిని విశదముగా పల్కినవారును కలరు అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వివరణము.

**(బిభృషే)** – వర్తమానకాలికమైన ఈ క్రియాపదమును ప్రయోగించుటద్వారా కూరేశులు వటదళశాయిసన్నివేశము తమ జ్ఞాననేత్రము ముందు సాక్షాత్కరించుటను తెలిపిరి. ఎపుడో జరిగిన ఈ వృత్తాంతమును వర్తమానకాలమున నిర్దేశించుటలోని స్వారస్యము ఇదియే కదా! **"బభృషే"** అను పాఠమున భూతకాలికముగా అర్థము చెప్పనగును.

**(సవికాస మేవ)** – ప్రళయసముద్రమున చిన్న వటదళము, అదియు అపుడే పుట్టినది అగుట, అందులో అత్యంతము చిన్నదైన రూపమునుకల శిశువుగా పరుండుట, ఆ శిశురూపములోని ఉదరమున లోకములన్నియు ఎట్లి సంకోచము, ఒరపిడి లేక స్వేచ్ఛగా స్పష్టముగా అమరియుండుట – అన్నియు అతిమానుషములే. కావుననే ముదలాழ்వార్లు – **"పాలన్ తనదురువాయ్. . . ఆలన్ఱు వేలైనీరుళ్లదో? విణ్ణదో? మణ్ణదో? శోలైశూழ்కున్ఱెడుత్తాయ్! శొల్లు" (ముదల్‌తిరు–69)** అనుచు విస్మయపడిరి.

**(ఐశీ మిత్యాది)** – అఘటితఘటనాసామర్థ్యము శక్తి. ఇది పరత్వచిహ్నము. కావున ఇట్టిదని, ఇంతటిదని చెప్పరానిది. **"పరాఽస్య శక్తిః వివిధైవ"** అని వేదము అన్నది. ఇట్టి శక్తిని నీవు ఈ లోకమున మనుష్యాది సజాతీయుడవై అవతరించి, నిర్హేతుకముగా ప్రకాశింపచేయుట ఎందులకు? యశోదాస్తనంధయునిగా అవతరించి, అజ్ఞునివలె, అశక్తునివలె తాటితో కట్టబడి, కొట్టబడి, వెక్కివెక్కి ఏడ్చుట ద్వారా ప్రదర్శించిన అశక్తి ఒక ప్రక్క–ఏడు దినముల పాటు గోవర్ధన పర్వతమును చిటికెన వేలిపై ధరించుట ద్వారా వెలువరించిన అచింత్యదివ్యాద్భుత శక్తి పేరొక ప్రక్క. ఇట్లు అవతారములలో అశక్తియు, అద్భుతశక్తియు కలిసి ప్రకాశించుచున్నవి. సౌలభ్యసౌశీల్యములను ప్రకాశింపచేయుటకొఱకే అయిన అవతారములలో సర్వేశ్వరత్వసమానాధికరణములగు శక్తివిశేషములనుకూడ ప్రకటించుట ఎందులకు స్వామీ! అని ఇచటి కూరేశుల ప్రశ్న.

**(ఇహావతీర్ణః కిం ప్రథయసే)** – వటదళశాయియై చేసిన అతిమానుషలీలను మనుష్య సజాతీయుడవై యశోదాపుత్రుడవై అవతరించినపుడును ప్రకాశింపనగునా? **"వైయమేళ్లుకణ్డాళ్ పిళ్లైవాయుళే" (పెరియా. 1-1-6)** అని, **"వాయుళ్ వైయకమ్ కణ్డమడనల్లార్" (పెరియా. 1-1-7)** అనియు దివ్యసూరులు ఈ అద్భుతావ దానమును కీర్తించిన రీతిలో ఆ శక్తివిశేషమును ఇచటను ఈ లీలావిభూతిలో – **"పాలకనెన్ఱు పరిబవమ్ శెయ్యేల్ పణ్డొరునాళ్ ఆలినిలైవళర్న్ద శిఱుక్కనవనివన్" (పెరియా. 1-4-7)** అనునట్లు ప్రదర్శించుట ఎందులకు?

**(అవ్యాజతః)** – వటదళశాయిరూపమును భగవానుడు మార్కండేయుని ప్రార్థనపై ఆ మహర్షికి ప్రకాశింపచేసెను అని పురాణకథనము. కాని, యశోదకుమారునిగా అవతరించినపుడు ఆ శక్తిని, అతిమానుషలీలను ప్రదర్శింపుమని ఎవరును ప్రార్థింపకనే స్వామి ప్రదర్శించుటచే, ఇట్లు నిర్హేతుకముగా ఎందులకు ప్రదర్శించితివని కూరేశులు ప్రశ్నించుచున్నారు. ప్రకృత శ్లోకములో ఇందులకు కవి సమాధానము తెలుపకుండుటకు భగవానుని అతిమానుష చేష్టితములచే వారి మనస్సు ద్రవించిపోవుటయే కారణమని శ్రీ అణ్ణాస్వామి వారి రసోక్తి. అత్యంతమృదుమనస్కులగు కూరేశుల విషయమున ఇట్టి స్థితి తగును కదా! **"ఆదియమ్ శోది యురువై అఙ్గువైత్తిఙ్గుప్పిఱన్ద"** అను రీతిలో అజహత్స్వభావుడవై, అప్రాకృతదివ్యసంస్థానముతో అవతరించుటచే నీవు నీ దివ్యశక్తిని ఎంతగా మఱుగువఱచుకొనదలచినను, వానిని మరచిపోలేక, వ్యక్తముచేయుచున్నావను సమాధానము ఇచట అర్థతః ఆక్షిప్తము.

ఈ స్తుతి భగవానుని విభవావతారములలోని అతిమానుషచేష్టలను కీర్తించునది అగుటచే, అట్టి అవతారములలో మొదటిదిగా చెప్పదగినది అగు వటపత్రశాయి అవతారము ఇందు ప్రస్తుతింపబడినదని గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్య. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమునందు – **"యుగాదికృత్"** అను నామమునుండి **"వృషః"** అను నామము వరముగల 14 నామములలో ఈ అవతారవైభవము స్తుతింపబడినది. **"యశోదావత్సశైశవరూపసౌలభ్యేఽపి పరత్వావిష్కార అత్యాశ్చర్యకర ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**15.** **బ్రహ్మేశమధ్యగణనా గణనార్కపంక్తా**
**ఇంద్రానుజత్వ మదితే స్తనయత్వయోగాత్ ।**
**ఇక్ష్వాకువంశయదువంశజని శ్చ హంత !**
**శ్లాఘ్యాన్యమూన్యనుపమస్య పరస్య ధామ్నః ॥**

అనుపమస్య = సాటిలేని, పరస్య ధామ్నః = పరంజ్యోతియగు భగవానునకు, బ్రహ్మ+ ఈశమధ్యగణనా = బ్రహ్మరుద్రుల మధ్యలో ఒకడుగా లెక్కింపబడుట, అర్కపంక్తౌ = ద్వాదశాదిత్యులవరుసలో, గణనా = లెక్కింపబడుట, అదితేః = అదితియొక్క తనయత్వయోగాత్= పుత్రుడుగా పుట్టిన సంబంధమువలన, ఇంద్ర + అనుజత్వమ్ = ఉపేంద్రుడగుటయును,



ఇక్ష్వాకువంశ = ఇక్ష్వాకువంశమునందు, యదువంశ = యాదవవంశమునందును, జనిః + చ= అవతరించుటయును, అమూని = (అను) ఇవి (ఈ అవతారములు), శ్లాఘ్యాని = (నీకు) అతిశయమును కల్గించునవి, హంత = ఆశ్చర్యము.

పూర్వశ్లోకములో **"ఇహావతీర్ణః"** అనుచు భగవానుని అవతారవిషయము ప్రస్తావనకు రాగానే, ఇందు భగవానుని పలు అవతారములను స్మరించుచు, అవి అన్నియు **"పలపిఱప్పాయ్ ఒళివరుముఙ్గనలమ్"** అనునట్లు ఆ స్వామికి అతిశయావహములే కదా! అని ఆశ్చర్యపడుచున్నారు. కేవలపరత్వమో, లేక కేవలసౌలభ్యమో శ్లాఘనీయములు కావు. పరత్వసహితసౌలభ్యమే. అతిశయావహము. అట్టి సౌలభ్యమే విజృంభించినట్లు స్వామి తన పరత్వమును మఱుగుపఱచి, అవతరించి, ప్రకాశించుట ఎంత ఆశ్చర్యము! అనుచున్నారు.

**(బ్రహ్మేశమధ్యగణనా)** – **"బ్రహ్మావిష్ణుమహేశ్వరాః"** అని, **"తతః త్వ మపి దుర్ధర్షః తస్మాత్ భావాత్ సనాతనాత్, రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వ ముపజగ్మివాన్"** అని, **"బ్రహ్మా విష్ణు శ్చ రుద్ర శ్చ జగతః కారణం పరమ్"** అను రీతిలో జగద్రక్షకుడుగా, బ్రహ్మరుద్రులమధ్యలో పరిగణింపబడు విష్ణురూపుడుగా అవతరించిన ప్రథమావతారము. **"మధ్యే విరించిగిరిశం ప్రథమావతారః" (శ్రీరంగరాజ. ఉత్తర.)** అని పరాశరభట్టర్కూడ దీనిని స్మరించిరి. **"నల్లరన్ నారణన్ నాన్ముకనుక్కు"** అని పరకాలసూరియు పల్కిరి.

**(అర్కపంక్తౌగణనా)** – **"ఆదిత్యానా మహం విష్ణుః" (10-21)** అని భగవద్గీతలో స్వయముగా తానే పల్కెను. ద్వాదశాదిత్యులలో విష్ణువను పేరుగల ఆదిత్యుడు ఒకడు కలడు కదా!

**(అదితే స్తనయత్వయోగాత్ ఇంద్రానుజత్వమ్)** – అదితికశ్యపులకు వామనరూపుడై అవతరించిన వృత్తాంతమిచట అనుసంధేయము. అదితి ఇంద్రునకును తల్లి కావున, భగవానుడు ఇంద్రునకు అనుజుడు – అనగా ఉపేంద్రుడైనాడు. **"ఉప ఇంద్రః అస్మాత్ ఇతి ఉపేంద్రః"** ఇంద్రుడు ఎవనికంటే తక్కువవాడో అతడు ఉపేంద్రుడు అను వివరణమును ఈ పదమునకు కొందఱు చెప్పిరి. అపుడు **'ఉప'** అను పదము హీనార్థకములో ప్రయోగింపబడినది. ఇందులకు **"ఉపేధికే చ"** (1-4-87) అను సూత్రము స్మరణీయము.

**(ఇక్ష్వాకువంశయదువంశజనిః)** త్రేతాయుగమున ఇక్ష్వాకువంశములో శ్రీరామునిగా, ద్వాపరయుగములో యదువంశమున శ్రీకృష్ణునిగా అవతరించుట ఇచట ప్రస్తుతము. ఇక్ష్వాకువు బ్రహ్మమానసపుత్రులలో ఒకడు. గొప్ప విష్ణుభక్తుడు. బ్రహ్మ ఇతనికి తాను ఆరాధించు శ్రీరంగనాథుని అర్చామూర్తిని ప్రసాదింపగా, దానిని అయోధ్యలో చిరకాలము ఆరాధించెను. ఇట్టి పరమభాగవతుడగు ఇక్ష్వాకువుయొక్క వంశములో అవతరించి, ఆ వంశమునకు గౌరవమును భగవానుడు కల్గించెను.

యదువు యయాతి నల్గురు కుమారులలో ఒకడు. శుక్రుని శాపవశముచే అకాల వార్ధక్యమును పొందిన యయాతి తన ముసలితనమును తీసికొని, యౌవనమును ఇవ్వవలసినదిగా తన కుమారులను కోరెను. కాని అట్లు అంగీకరించినచో తనకు మాతృగమనదోషము ప్రాప్తించుటయేకాక, తల్లిదండ్రులకును అవద్యము కల్గునని తలచి యదువు మౌనముగా ఉండెను. ఇట్టి యదువు ధర్మతత్పరతను చూచియే వ్యాసభగవానుడు యదువును **"యదుః పరమధార్మికః"** అని ప్రశంసించెను. ఆ యదువువంశములో భగవానుడు శ్రీకృష్ణుడుగా జన్మించి **"స్వబలాదుద్ధృతయాదవ ప్రకాశః"** అనునట్లు ఆ కులము ఉన్నతికి కారణమయ్యెను.

**(అనుపమస్య) "తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే" (శ్వేతా.6-8), "ఒత్తార్ మిక్కారై ఇలైయాయ" (తి.వా.2-3-2) - తన్నొప్పారిల్లప్పన్" (తి.వా.6-3-9)** అనునట్లు తనకు సాటియైనవాడు వేరొకటి లేనివాడు. ఈ శ్లోకములోని భావమునకు మూలమనదగినట్లున్న వేదార్థసంగ్రహములోని భగవద్రామానుజుల ఈ క్రింది సూక్తిని గమనింప సహృదయులను వేడెదను. **"యథా లీలయా దేవసంఖ్యాపూరణం కుర్వత ఉపేంద్రత్వం పరస్యైవ, యథా చ సూర్యవంశోద్భవ రాజసంఖ్యాపూరణం కుర్వతః పరస్యైవ బ్రహ్మణో దాశరథిరూపేణ స్వేచ్ఛావతారః , యథా చ సోమవంశసంఖ్యాపూరణం కుర్వతో భగవతో భూభారావతరణాయ స్వేచ్ఛయా వసుదేవగృహేఽవతారః"**

**16.** **త్వన్నిర్మితా జఠరగా చ తవ త్రిలోకీ**
**కిం భిక్షణా దియ మృతే భవతః దురాపా ।**
**మధ్యే కదా తు న విచక్రమిషే జగచ్చేత్**
**త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రంచితా స్యాత్ ॥**

స్వామీ, త్వత్ + నిర్మితా = నీచే సృష్టింపబడినది, తవ జఠరగా = ఒకానొక (ప్రళయ) సమయమున నీ ఉదరములోనుండి, రక్షణను పొందినది అగు, ఇయం = ఈ, త్రిలోకీ = ముల్లోకములు, (మహాబలి వలన) భిక్షణాత్ ఋతే = యాచించుటకంటే వేరొక ఉపాయము వలన, భవతః = నీకు, దురాపా కిమ్ = లభించుటకు వీలుకానిదా ఏమి?, మధ్యే = మధ్యలో, కదా తు = ఒకానొక సమయమున, జగత్ = ఈ లోకమును, న విచక్రమిషే చేత్ = భిక్షావ్యాజముతో విక్రమించియుండకపోయినచో, శ్రుతిః = వేదము, త్వత్ + విక్రమైః = నీ విక్రమములతో, కథమ్ అంచితా స్యాత్ = ఎట్లు గొప్పతనమును పొందినది కాగలదు?

కూరేశులు ఇందు త్రివిక్రమావతార సౌలభ్యమును స్మరించుచు విద్ధులగుచున్నారు. నమ్మాళ్వార్లు పెరియ తిరువన్దాదిలో సాయించిన సూక్తిని అనుసరించి కూరేశులు ఈ శ్లోకమును అనుగ్రహించిరని చెప్పనగును. **"శీరాల్పిఱన్దు శిఱప్పాల్ వళరాదు పేర్ వామనా కాక్కాల్ పేరాళా? మార్ప్పార పుల్‌కి నీయుణ్డుమిళ్గ్న్ద పూమినీరేఱ్పరిదే శొల్లు నీ యామతియచ్చ్వాళ్గ్న్దు" (పెరియతిరు-16)** అనుచు సర్వదా నీ వశములోనున్న భూమిని ఒక అల్పుని వద్ద యాచించిపొందవలసిన కారణమేమి తెల్పుము స్వామీ!" అని భగవానుని నమ్మాళ్వార్లు ప్రశ్నించుటను అనుసరించుచు కూరేశులు ఈ శ్లోకమును రచించిరి. "చతుర్ముఖుని ద్వారా లోకములను సృష్టించి, స్వేనరూపముతో వానిని రక్షించుటచే నీకు ముల్లోకములును సొత్తు, దానిని ఎవరైనను తనదని అభిమానించినపుడు వానిని శిక్షించి పొందవలసియుండగా, అట్లు చేయక, వాని వద్దకే వెడలి, యాచించి పొందవలెనా? వేరొక ఉపాయము నీకు లేదా? స్వామీ! ఏమి నీ సౌలభ్యము" – అనుచు ప్రశ్నించుచు, శ్లోకపూర్వార్ధమున భగవానుని సౌలభ్యమునకు విద్ధులైన కూరేశులు ఉత్తరార్ధములో సమాధానపడుచు, అందులకొక సమాధానమును కూడ అనుగ్రహించిరి.



**(పరస్య ధామ్నః) - "ధామ్నః పరస్య"** అని అన్వయము. తేజోరూపుడైన సర్వస్మాత్పరునకు అని అర్థము. పూర్వశ్లోకములో ప్రస్తుతింపబడిన అవతారరూపజన్మమున వలన దోషసంసర్గము సంభవింపదా? అను ప్రశ్నను ఈ శ్లోకము సమాధానించుచున్నదని భగవద్విషయ అరుంబదకారులు తెలుపుచు దోషావహము కాకపోవుటయే కాదు, ప్రత్యుత శ్లాఘ్యము కూడా అని పల్కిరి.

నిరుపయోగములైన, అపవిత్రములైన పలు విషయములనుగూర్చి పల్కిన వేదము **"విచక్రమాణ స్తేధోరుగాయో"** అనియు **"త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపాదాభ్యః"** అని, నీ త్రైవిక్రమాపదానమును స్తుతించి, పవిత్రతను పొందుట కొఱకే కదా నీవు అట్లు బలివద్దకు పోయి, మూడడగులు యాచించి, త్రివిక్రమావతారమును ఎత్తితివి. లేనిచో వేదము అపవిత్రముగానే యుండియుండును అని తాత్పర్యము.

**"భవతా దురాపా"** అని, **"శ్రుతి రంకితా స్యాత్"** అనియు పాఠభేదములు కలవు. అంకితమనగా చిహ్నితమని అర్థము. **"సృష్టిప్రళయవిషయకప్రమాణైః త్రిలోక్యాం త్వదీయాయాం సత్యా మపి శ్రుతిస్తుతివిషయాపదానసంపాదనార్థం సుమనోయాచనాం రచితవా నితి పిండితార్థః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో **"జగత్మధ్యే – మధ్యమభాగే"** అని, **"తథేతి వాక్యాంతరోపక్రమణే వా"** అనియు వివరింపబడినది. ఈ శ్లోకములోని పూర్వార్ధభావమును కూరేశులు సుందరబాహుస్తవములోని **"క్షితి రియం జనిసంహృతిపాలనైః నిగరణోద్గిరణోద్ధరణై రపి వనగిరీశ! తవైవ సతీ కథం వరద! వామన! భిక్షణ మర్హతి" (98)** అను శ్లోకమున అనుసంధించుటను గమనింపనగును.

**17.** **పృచ్ఛామి కించన యదా కిల రాఘవత్వే**
**మాయామృగస్య వశగో మనుజత్వమౌగ్ధ్యాత్ ।**
**సీతావియోగవివశో న చ తద్గతిజ్ఞః**
**ప్రాదా స్తదా పరగతిం హి కథం ఖగాయ ॥**

స్వామీ, కించన = కొంచెము, పృచ్ఛామి = అడిగెదను (సమాధానమును పల్కుము),

రాఘవత్వే = శ్రీరామచంద్రుడవై అవతరించినపుడు, యదా = ఏ సమయమున, మనుజత్వమౌగ్ధ్యాత్= (**"ఆత్మాను మానుషం మన్యే"** అను) మనుష్యత్వప్రయుక్తమైన మోహమువలన, మాయామృగస్య = మారీచుడను మాయామృగమునకు, వశగః సన్ = పరవశుడవై, సీతావియోగ= సీతాదేవియొక్క విశ్లేషమువలన, వివశః = బాధను పొందితివో, తత్ + గతిజ్ఞః చ న = ఆ సీతయొక్క జాడను తెలిసినవాడవు కూడ కాలేదో, తదా = అపుడు, ఖగాయ = జటాయువునకు, పరగతిమ్ = పరమపదప్రాప్తిని, కథం = ఎట్లు, ప్రాదాః = ఇచ్చితివి?

ఈ శ్లోకమునుండి వరుసగా 17 శ్లోకములందు శ్రీరామావతార వృత్తాంతములపట్ల తమకుగల అభినివేశమును కూరేశులు తెలిపిరి. మధ్యలోనున్న 27వ శ్లోకమగు **"ఏతత్ కథం కథయ"** అను శ్లోకము మాత్రము ప్రాసంగికము. మొదటగా జటాయువునకు మోక్ష మిచ్చుట అనెడి అతిమానుషలీలను ప్రస్తావించుచు, అందులకు సమాధానమును తాము ఊహించుటకు సాధ్యముకాకపోవుటచే, భగవానుని ఆశ్చర్యపూర్వకముగా కవి ప్రశ్నించుచున్నారు.

మాయామృగమువెంట వెడలి, సీతావిశ్లేషమును పొంది, ఆమె ఎచటికి తీసికొనిపోబడినదో తెలియలేక, "ఓ పర్వతమా! నీవు సీతను చూచితివా? ఓ సరస్సా! సీతను చూచితివా?" అనుచు కనుపించిన చేతనాచేతనములను అన్నిటిని నమస్కరించి, ప్రార్థించుట ఒక ప్రక్క; జటాయువునకు **"గచ్ఛ లోకాన్ అనుత్తమాన్" (ఆరణ్య.68-30)** అనుచు పరగతిని చేరుటకు అనుజ్ఞను ఇచ్చుట వేరొక ప్రక్క. పరస్పరవిరుద్ధములైన ఈ రెండు లీలల సమన్వయము ఎట్లు కుదురునో! స్వామీ! నీవే తెలుపుము" అనుచు గొప్ప విచికిత్సతో భగవానుని కవి ప్రశ్నించుచున్నారు. కంటికి కనుపించు ఈ లోకములో సీత ఎచటికి ఏ దారిలో పోయెనో తెలియనివాడు కంటికి కనుపించని అదృష్టలోకమునకు దారిచూపుట ఎంత విచిత్రము? అని హార్దమైన భావము. సీతావిషయమున పరితపించిన దంతయు **"ఆత్మానం మానుషం మన్యే" (రామా.యుద్ధ.120-12)** అను రీతిలో మానుషభావనకు అనుగుణమైనచో, ఆ భావన సర్వత్ర వర్తింపవలెను కదా! జటాయువిషయము రాగానే ఆ మానుషభావన పోయి, పరత్వము వ్యక్తమై, **"మయా త్వం సమనుజ్ఞాతః గచ్ఛ లోకాన్ అనుత్తమాన్" (రామా.ఆరణ్య.68-30)** అని పల్కుట ఏమి? ఈ రెండిటిని మేము ఎట్లు అర్థము చేసికొనవలెనో నీవే వివరింపుము - అని కూరేశుల హృదయము. దీనికి సమాధానమును **"సత్యేన లోకాన్ జయతి" (రామా.అయో.12-29)** అను శ్రీరామాయణసూక్తి ద్వారా తెలియనగునని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యాన సూక్తి. దాని వివరమిది.

శ్రీపరాశరభట్టర్ వంశమునకుచెందిన నడువిల్ తిరువీథిపిళ్లై భట్టర్ అను ఆచార్యులను చోళరాజు పై శ్లోకములోని సందేహమునుగూర్చి ప్రస్తావించెనట. వెంటనే సమాధానమును చెప్పలేని ఆ ఆచార్యులు రేపు సమాధానమును పల్కెదనని రాజునకు తెలిపి, ఆనాడు నమ్బిళ్లై తిరుమాళిగకు వెడలి, వారిని ఈ విషయమునుగూర్చి ప్రశ్నించిరి. అపుడు నమ్బిళ్లై - **"సత్యేన లోకాన్ జయతి" (రామా.అయో.12-29)** అని కలదు కదా! అని సమాధానము పలుకగా, మరునాడు ఆ



సమాధానమును భట్టర్ చోళరాజునకు తెలిపిరి. ఆ ప్రభువు మిక్కిలి సంతోషించి, వారికి బహుమానముగా గొప్ప ధనమును, విలువైన వస్తువులను ఇచ్చి సత్కరింపగా, భట్టరు వానిని అన్నిటిని తెచ్చి నమ్బిళ్లైకు సమర్పించిరట. ఈ ఐతిహ్యము దివ్యప్రబంధవ్యాఖ్యలలోనేకాక, గోవిందరాజీయవ్యాఖ్యలో కూడ - **''సత్యేనేతి. సత్యేన భూతహితేన లోకాన్ స్వర్గాదివైకుంఠపర్యంతాన్, జయతి స్వాధీనాన్ కరోతి . . . చోళమహీపతిః కదాచిత్ సన్నిహితం మధ్యమవీధిభట్టారకం ప్రతి ఆత్మానం మానుషం మన్య ఇతి వదన్ రామః కథం జటాయుషో మోక్షం దత్తవా నితి పప్రచ్ఛ. సోఽపి సత్యేన లోకాన్ జయతీత్యుక్త్వా మహతీం బహుమతి మవాప్త వానిత్యైతిహ్య మత్ర జ్ఞేయమ్"** అని ప్రస్తావింపబడుట గమనింపతగినది. ఇట్టి సమాధానమును దృష్టిలోనుంచుకొనియే కూరేశులు ఈ ప్రశ్నను లేవనెత్తిరనుటలో విప్రతిపత్తి లేదు కదా! **"పరగతిం హి కథం జటాయోః"** అని శ్రీగార్గ్యరామానుజార్య వ్యాఖ్యాన పాఠము. **"జటాయవే పరమపదప్రదాన శ్చ త్వయైవ వక్తవ్య ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**18.** **అక్షుణ్ణయోగపథ మగ్ర్యహతం జటాయుం**
**తిర్యం చ మేవ బత! మోక్షపథే నియోక్తుమ్ ।**
**శక్నోషి వేత్సి చ యదా స తదా కథం త్వం**
**దేవీ మవాప్తు మనలం వ్యథితో విచిన్వన్ ॥**

స్వామీ!, త్వం = నీవు, అక్షుణ్ణయోగపథం = యోగమార్గమునందు అభ్యాసములేనివాడు, అగ్ర్యహతం = బ్రాహ్మణజాతికి చెందిన రావణునిచే వధింపబడినవాడును, తిర్యంచ = తిర్యక్ జాతిలో పుట్టినవాడును అగు, జటాయుమ్ ఏవ = జటాయువును కూడ, మోక్షపథే = మోక్షమార్గమునందు పోవుటకు, నియోక్తుమ్ = అనుమతించుటకు, యదా = ఎపుడు, వేత్సి = తెలిసితివో, శక్నోషి చ = సమర్థుడవును అయితివో, తదా = అపుడే, సః త్వం = అట్టి నీవు, దేవీమ్ విచిన్వన్ = సీతాదేవిని వెదకువాడవై, అవాప్తుమ్ అనలమ్ (సన్) = ఆమెను పొందుటకు అసమర్థుడవై, వ్యథితః కథం అభూః = సంతాపమును చెందినవాడవు ఎట్లు అయితివి? (తెలుపుము), బత = ఆశ్చర్యము.

పూర్వశ్లోకమున తెలిపిన విషయమునే మరల ముఖభేదముతో ఇందును కూరేశులు అనుసంధించుచున్నారు.

సీతాదేవిని ఎడబాసి, వ్యథను పొందిన నీవు జటాయువునకు ఎట్లు పరమపదమును అనుగ్రహింపగల్గితివి? అని పూర్వశ్లోకమున తెలిపిరి. ఎట్టి యోగ్యతనులేని, ఒక తిర్యక్‌జాతికి చెందిన జటాయువునకు పరగతిని ప్రసాదించు సామర్థ్యమును కల నీవు సీతాదేవి వివరమును తెలియలేక అరణ్యముల వెంబడి తిరిగి, అలమటించి, ఎట్లు బాధపడితివి? అనుచు ఇందు ప్రశ్నించుచున్నారు. ఈ రెండు శ్లోకములలో ప్రశ్నభేదమే తప్ప అర్థ మొక్కటియే కావున ఇట్లు రెండు శ్లోకములను అనుగ్రహించుట అవసరమా? అని శంకింపవలదు. జటాయువునకు పరగతిని

ప్రసాదించిన గొప్పతనమునందుగల తమ అభినివేశమును ఈ శ్లోకమున తెల్పుట కూరేశులు ఉద్దేశ్యము. కావున ప్రమేయభేదముకూడ కలదని గ్రహింపనగునని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి దివ్యసూక్తి. జటాయువునకు మోక్షమునుపొందు యోగ్యత లేదనుటను మూడు విశేషణములద్వారా కవి తెలుపుచున్నారు.

**(అక్షుణ్ణయోగపథమ్)** – **"నోఱ్ఱనోన్బు ఇలేన్"** **(తి.వా.5-7-1)** అని, **"ఇడకిలే నొన్బట్ట కిల్లేన్" (తి.వా.5-7-1)** ఇత్యాది దివ్యసూరిసూక్తుల భావ మిచట స్మరణీయము. అక్షుణ్ణమనగా అభ్యాసముచేయబడనిది అని అర్థము. దీనివలన ఎట్టి సాధనానుష్ఠానమును చేయలేదని ఏర్పడుచున్నది.

**(తిర్యంచమ్)** – అట్టి సాధనానుష్ఠానమునకు తగిన జాతియందును జటాయువు పుట్టలేదు అని భావము.

**(అగ్రృహతమ్)** – సాధన సామగ్రి ఏ మాత్రము లేకున్నను, ప్రతిబంధకాభావమైనను అనగా – ఎట్టి ప్రతిబంధకము లేకుండుటనైనను కలదా? అనినచో, అదియును లేదు. **"అగ్నిహోత్రా శ్చ వేదా శ్చ రాక్షసానాం గృహేగృహే"** అను రీతిలో పులస్త్య బ్రహ్మవంశమునకు చెందిన, వైదిక ధర్మక్రియానిరతుడైన, అగ్రవర్ణమునకు చెందిన రావణునిచే జటాయువు వధింపబడినాడు. **"నాగ్రృహతస్య లోకోఽస్తి"** అని, **"య శ్చ హంతి ద్విజన్మానం య శ్చ విప్రేణ హన్యతే, తా వుభా వధమౌ జ్ఞేయౌ పరలోకపరాఙ్ముఖౌ"** ఇత్యాది శాస్త్ర ప్రమాణములవలన బ్రాహ్మణునిచే వధింపబడిన వానికి సద్గతిలేదని ఏర్పడుచున్నది.

**(మోక్షపథే నియోక్తుం శక్నోషి వేత్సి చ)** – ఇట్టి జటాయువునకు ఏ కారణముతో మోక్షమును ఇవ్వవచ్చునో తెలియగల జ్ఞానము, దానిని ఇచ్చు శక్తినికల వాడవు నీవు. దీనివలన నీ సర్వేశ్వరత్వము వ్యక్తము, **(కథం త్వం . . . వ్యథితో విచిన్వన్)** – ఈవిధమైన జ్ఞానమును, శక్తినికల నీవు సీతాదేవి జాడను ఎట్లు తెలియలేకపోయితివి? ఆమెను గూర్చి ఎందులకు అంతగా విలపించితివి? మనుష్యత్వప్రయుక్త అజ్ఞత్వము, సర్వేశ్వరత్వప్రయుక్త సర్వజ్ఞత్వము ఈ రెండును ఏకకాలములో వ్యక్తీకరించుట ఏమి నీ అతిమానుషమైన లీల? అని కూరేశులు ఆశ్చర్యపడుచున్నారు. **"అవాప్తు మనలః"** అనునది అబద్ధపాఠము. జటాయువు ఏ యోగ్యతను చూచి భగవానుడు మోక్ష మనుగ్రహించెననుటకు – **"అవధీర్య చతుర్విధం పుమర్థం భవదర్థే వినియుక్తజీవితస్సన్, లభతే భవతః ఫలాని జంతుః నిఖిలాన్యత్ర నిదర్శనం జటాయుః"** అను దేశికసూక్తి సమాధానముగా స్మరణీయము.

**19.** సాలాన్ హి సప్తసగిరీన్ సరసాతలాన్యాన్
ఏకేషు మందజవతో నిరపత్రయ స్త్వమ్ ।
తేష్వేకవివ్యథనఖిన్నకపిప్రణున్నం
శాఖామృగం మృగయసే స్మ కథం సహాయమ్ ॥



స్వామీ, యాన్ = ఏ, సప్తసాలాన్ = ఏడు సాలవృక్షములను, సగిరీన్ = పర్వతములతో కూడినవిగా, సరసాతలాన్ = పాతాళములతో కూడినవిగా, ఏక + ఇషు = ఒక్కబాణముయొక్క, మందజవతః = స్వల్పవేగమువలన, త్వం = నీవు, నిరపత్రయః = ఛేదించితివో, తేషు = ఆ సాలవృక్షములందు, ఏక = ఒక వృక్షమును, వివ్యథన = పెకలించుటలో, ఖిన్న = శ్రమపడిన, కపి = వానరమగు వాలిచే, ప్రణున్నం = తఱుమబడిన, శాఖామృగం = వానరమగు సుగ్రీవుని, సహాయం = సహాయముగా, కథం = ఎట్లు, మృగయసే స్మ = వెదకితివి?

కూరేశులు ముందు శ్లోకములో ప్రసక్తమైన అశక్తిభావననే మరల వేరొక విధమున ఇందు ప్రస్తావించుచు చమత్కారముగా ప్రశ్నించుచున్నారు. సీతాపహర్తయగు రావణుని వధింపగోరి, అందులకు మిక్కిలి దుర్బలుడు, నీతో ఏమాత్రము సమానుడు కానివాడును అగు సుగ్రీవుని ఎట్లు సహాయముగా గ్రహించితివి? అనుచు ప్రశ్నించుట ఇందలి విషయము.

లోకములోనివారు తమతో సమానమైన వారినే తమకు సహాయముగా గ్రహింతురు. రావణుని తన బాహుబంధమున పట్టి, అవమానపఱచిన వాలిని నీవు సహాయముగా చేసికొన్నచో కొంత అర్థమున్నది. కాని, ఆ వాలిని చూచిన వెంటనే సింహమును చూచిన నక్కవలె భయముతో పరుగుతీయు సుగ్రీవుని నీవు సహాయభూతునిగా అంగీకరించుటయా? నిజమునకు ఆ వాలి కూడ నీకు సమానుడా! కానే కాదు. ఎందులకు అందువా –

**(సాలాన్ . . . నిరపత్రయ స్త్వమ్)** – **"బిభేద చ పున స్సాలాన్ సప్తైకేన మహేషుణా, గిరిం రసాతలం చైవ" (66)** అని సంగ్రహరామాయణమున, **"స విసృష్టో బలవతా బాణః స్వర్ణ పరిష్కృతః, భిత్త్వా సాలాన్ గిరిప్రస్థం సప్తభూమిం వివేశ హ, ప్రవిష్ట శ్చ ముహూర్తేన ధరాం భిత్త్వా మహాజవః"** అని కిష్కింధాకాండలో 12-3 తెలుపబడిన రీతిలో ఒకే బాణమును ప్రయోగించి, సప్తసాలవృక్షములను, సప్తకులపర్వతములను, సప్తపాతాళములను అవలీలగా, శీఘ్రముగా ఛేదించినవాడవు నీవు. ఆ బాణమును కూడ నీవు వేగముగా ప్రయోగింపలేదు. చాల తక్కువ వేగముతో ప్రయోగించిన బాణమునకే అంతటి శక్తి ఉన్నచో, ఇక వేగముగా ప్రయోగించిన ఎడల లోకములన్నియు క్షోభించియుండును కదా! **"అతివేగితత్వే అండభిత్తిభేద ఏవ స్యా దితి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. **"నిరపత్రయః"** అను ప్రయోగము **"ఇమే చ విపులా స్సాలా స్సప్త శాఖావలంబినః యత్రైకం ఘటతే వాలీ నిష్పత్రయితు మోజసా"** అను కిష్కింధాకాండ 11-68 పయోగానుగుణమని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. శ్రీరామచంద్రుని బాణము రసాతలమును కూడ ఛేదించినదనుటను దేశికులు ప్రస్తావించుచు యాదవాభ్యుదయకావ్యములో – **"అపశ్యత్ ఋశ్యమూకాంతే శేషమౌళిమణిప్రభామ్, రామసాయకరంధ్రేణ నిస్సరంతీం నభస్స్పృశామ్"** అనుచు సాయించిన శ్లోకము స్మరణీయము.

**(తేషు ఏకవివ్యథనఖిన్నకపిప్రణున్నమ్)** – **"త మువాచాథ సుగ్రీవః సప్తసాలాన్ ఇమాన్ పురా, ఏవ మేకైకశో వాలీ వివ్యాథాథ స చాసకృత్" (కిష్కింధా.11-71)** అను

శ్రీరామాయణశ్లోకమును అనుసరించి కూరేశులు ఈ ప్రయోగమును చేసిరి. నీవు అవలీలగా ఛేదించిన ఏడు సాలవృక్షములలో ఒక సాలవృక్షమును పెకలించుటకే వాలి శ్రమపడెను. అట్టి వాలిచే ఓడింపబడి తరుమబడినవాడు కదా! సుగ్రీవుడు.

**(శాఖామృగం సహాయం కథం మృగయసే స్మ)** సుగ్రీవుని నీవు **"లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథ మిచ్ఛతి" (కిష్కింధా.4-18)** అని, **"యస్య ప్రసాదే సకలాః ప్రసీదేయు రిమాః ప్రజాః, స రామో వానరేంద్రస్య ప్రసాద మభికాంక్షతే" (కిష్కింధా.4-23)** అనియు పల్కినట్లు సహాయముగా ఎందులకు వెదకితివి?" అని కూరేశుల ప్రశ్న.

ఇచటి ప్రశ్నలోని స్వారస్యమును మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో ఇట్లు వివరించిరి – భగవానునకు ఎవరి సహాయమును అపేక్షింపవలసిన అవసరము లేదు. అతడు ఇతరనిరపేక్షశూరుడు కదా! అతడిట్టివాడు కావుననే అందఱిచే ఆశ్రయింపబడుచున్నాడు. ఇక, శ్రీరామచంద్రుడు సుగ్రీవుని వరించుట సహాయము కొఱకు కాదు. అతడు శరణాగతి చేయవచ్చినవాడు కావున శరణాగతరక్షణమును **"ఏతద్వ్రతం మమ" (యుద్ధ.18-32)** అను రీతిలో ప్రతముగా కలవాడు కావున అతనిని స్వీకరించెను అంతియే. కావుననే దేశికులు **"తరణిసుతశరణాగతిపరతంత్రీకృతస్వాతంత్ర్య"** అని రఘువీరగద్యలో పల్కిరి. మఱియు, వాలి ఇంతకుముందే రావణునితో స్నేహమును కల్గియుండెను. అందుచే వాలిని సహాయముగా చేసికొనుట వధ్యులగు రావణాదుల నిగ్రహమునకు ఉపయోగకరము కాదు. కావున సుగ్రీవుని మిత్రునిగా చేసికొనెనని గమనింపనగును. తత్త్వార్థ మిట్లుండగా, "నీ శత్రువును నేను చంపెదను, నా శత్రువును నీవు సంహరింపుము" అనుచు రామసుగ్రీవులు పరస్పరము ఒప్పందము చేసికొనిరి అని లోకమున అందఱు భావించురీతిలో ఇతిహాసవచనములుండుటచే, తదనుగుణముగా ఈ శ్లోకమును కూరేశులు అనుగ్రహించిరని భావింపనగును. వాలిని వధింపగల శక్తి రామబాణమునకున్నదా? లేదా? అని సందేహించిన సుగ్రీవుడు తనకు నమ్మకము కల్గుటకై ఒక బాణముతో ఏడు సాలవృక్షములను ఛేదింపుమని ప్రార్థించెనే కాని, పర్వతములను, పాతాళములను ఛేదింపుమని కోరలేదు కదా! కాని, రామబాణము అప్రహతిహతమైన, నిరుపమానమైన శక్తిని కల్గినది కావున తన స్వభావమునుబట్టి ఏడు అను సంఖ్యనుకల కులాచలపాతాళాదులను ఛేదించి, తిరిగి వచ్చినది. అందుచే శ్లోకమున **"సగిరీన్ సరసాతలాన్"** అని తెలుపబడినది. ఇట్టి రామునకు సుగ్రీవుని సహాయము అవసరమే లేదు కదా! సుగ్రీవుడే స్వయముగా **"యేన సప్త మహాసాలా గిరిః భూమి శ్చ దారితాః, బాణేనైకేన కాకుత్స్థ స్థాతా తే కో రణాగ్రతః"** అని పల్కెను. సప్తసాలములను లక్ష్యముగా చేసికొని ప్రయోగించిన బాణము వానిని ఛేదించుటతో ఆగక, సప్తసంఖ్యనుకల వేఱు వస్తువులను కూడ ఛేదించుటను చూచి, ఏడు అను సంఖ్యను కలవానిపై రామబాణమునకు కోపము కల్గినదేమో! అట్లయిన తమ గతి ఏమగునో? అని సప్తఋషులు, సూర్యుని సప్తాశ్వములు, సప్తసాగరములును గడగడ వణకినవనుచు కమ్బమహాకవి పల్కిన చమత్కారసూక్తి ఇచట స్మరణీయము అని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య. **"సపుంఖస్య శరస్య అపరపార్శ్వేన నిర్గమనం నిష్పత్రీకరణమ్"** అనువైయాకరణుల వివరణముబట్టి (పత్రమనగా బాణముయొక్క తెక్క. లక్షణయా ఇది బాణమును నిర్దేశించుననియు కొందఱు అందురు). బాణము లోపల ప్రవేశించి, బయటికి వచ్చుటకు నిష్పత్రీకరణమని పేరు. పత్రశబ్దము చెట్టు ఆకును తెలుపును. కావున ఆకులన్నియు రాలునట్లుచేయుట అను అర్థమునుకూడ కొందఱు తెలిపిరి. ఎండిన ఆకులు గాలికి రాలుట సహజము. కాని, రామబాణమువలన పచ్చని ఆకులు సైతము రాలిపడినవని తాత్పర్యము. **"స్వాపేక్షయాఽతిశయితశక్తిః కిల సహాయతయాఽపేక్షణీయ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.



**20.** **దాస స్సఖా సమభవ త్తవ యః కపీంద్రః**
**తద్విద్విషం కపి మమర్షవశా జ్జిఘాంసుః ।**
**త్వత్స్నేహవిక్లబధియం త మిమం కపీంద్రం**
**విస్రంభయన్ సపది సాలగిరీ నవిధ్యః ॥**

స్వామీ!, యః = ఏ, కపి+ ఇంద్ర=వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుడు, తవ = నీకు, దాసః = దాసుడు, సఖా = స్నేహితుడును, సమభవత్ = అయ్యెనో, తద్విద్విషం = ఆ సుగ్రీవునకు శత్రువగు వాలిని, (త్వం = నీవు), అమర్షవశాత్ = కోపవశముచే, జిఘాంసుః = చంపగోరినవాడవై, త్వత్ + స్నేహ = నీతోటి స్నేహమువలన, విక్లబ = కలత చెందిన, ధియం = బుద్ధినికల, తమ్+ ఇమమ్ కపీంద్రమ్ = ఆ ఈ సుగ్రీవుని, విస్రంభయన్ = నమ్మకము కలవానినిగా చేయుచున్నవాడవై, సపది = వెంటనే, సాలగిరీన్ = ఏడు సాలవృక్షములను, సప్తకులపర్వతములను, అవిధ్యః = భేదించితివి.

సప్తసాలవృక్షాదుల విదారణముకూడ సుగ్రీవుని విషయమున నీవు ప్రదర్శించిన సౌశీల్యగుణప్రయుక్తవిలాసమేననుట ఇందలి ప్రధానాంశము.

శ్రీరామునకు ఏవిధముగానైనను సమానస్కంధుడుకాని వాలిచేతిలో పలుమార్లు పరాభవపడిన సుగ్రీవునివలన శ్రీరామునకు ఏ ప్రయోజనము లేదు. కావున అతనిని సహాయముగా చేసికొనుట వ్యర్థము. అంతకుమించి, ఆ సుగ్రీవునకు విశ్వాసము కలుగవలెనని ప్రయత్నించుటయు, అందులకై సప్తసాలములను భేదించుటయు నిరుపయోగములే. తన పట్ల ఏ అపరాధమును చేయనివాడు, తన కార్యము నెఱవేరుటకు సహాయముకాదగిన బలమును కలవాడగు వాలిని వధించు మరింత అయుక్తము అనుచు విమర్శించువారిని ఉద్దేశించి కూరేశులు ప్రకృతశ్లోకమును రచించిరని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్యానము.

**(దాసః సఖా తవ)** – సుగ్రీవుడు రామునివద్దకు వచ్చి **"సోఽహం త్రస్తో వనే భీతో వసామ్యుద్భ్రాంతచేతనః, వాలినా నిష్కృతో భ్రాత్రా కృతవైర శ్చ రాఘవ, వాలినో మే మహాభాగ! భయార్తస్యాభయం కురు, కర్తు మర్హసి కాకుత్స్థ భయం మే న భవేత్ యథా" (కిష్కింధా.5-23,24)** అని శరణువేడి, అభయమును ప్రార్థింపగా, **"వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్"**

**(5-27)** – నీ భార్యను హరించిన వారిని సంహరింతును అనుచు శ్రీరాముడు అతనికి అభయము నిచ్చెనని ప్రసిద్ధము. సుగ్రీవుడు రామునకు దాసుడు, సఖుడును అనుట **"లోకనాథస్య రామస్య సఖా దాసోఽస్మి రాక్షస"** అను యుద్ధకాండములోని (40-10) సుగ్రీవచనమువలన స్పష్టము. ఇట్లు దాసుడై, సఖుడైయున్న సుగ్రీవునకు విశ్వాసము కల్గించుట, అతని అనిష్టమును తొలగించి, ఇష్టప్రాప్తిని కలుగచేయుటయును శరణాగతరక్షణమే పరమధర్మముగా తలచు శ్రీరామునకు అవర్జనీయములు కదా!.

**(తద్విద్విషం కపిమ్ అమర్షవశాత్ జిఘాంసుః)** – **"సుహృదం సర్వభూతానామ్"** అను రీతిలో సర్వభూతసుహృత్తు అయిన భగవానునకు సహజముగా ద్వేషింపతగినవారెవ్వరు లేరు. అయినను తన భక్తులను ద్వేషించువారిని భగవానుడు తనకు శత్రువులుగా భావించుననుట– **"పాండవాన్ ద్విషసే రాజన్ మమ ప్రాణా హి పాండవాః"** అను మొదలగు సూక్తులవలన స్పష్టము. కావున తనకు దాసుడు, తన దృష్టిలో సఖుడును అగు సుగ్రీవునకు శత్రువగు వాలిపై స్వామి కోపించి, వానిని చంపగోరుట యుక్తము.

**(త్వత్స్నేహవిక్లబధియం . . . విస్రంభయన్)** – వాలిని చంపగల శక్తి రామునకు కలదో? లేదో? అని సందేహముతో సుగ్రీవుడు విహ్వలుడయ్యెను. అతనికి నమ్మకము కల్గించినగాని, అతడు వాలితో యుద్ధము చేయడు. అతడు యుద్ధముచేసినగాని వాలిని చంపుటకు వీలుపడదు. వాలిని చంపినగాని తన అభయప్రదానము సఫలము కాదు. కావున సుగ్రీవుని నమ్మించుటకై రామునకు సాలవృక్షభంజనము చేయవలసివచ్చెనని కూరేశుల హృదయము. సుగ్రీవుడు **"సుగ్రీవ శ్శంకిత శ్చాసీత్ నిత్యం వీర్యేణ రాఘవే"** అని భయపడుటకు, శంకించుటకు కారణము రాముని విషయమునగల స్నేహమే. ఈ విషయము **"న ఖల్వహం త్వాం తులయే నావమన్యే న భీషయే, కర్మభి స్తస్య భీమై స్తు కాతర్యం జనితం మమ"** అను సుగ్రీవవచనమువలన స్పష్టమగుచున్నది. **"అతిస్నేహః పాపశంకీ"** అని కదా సూక్తి.

**(సపది సాలగిరీన్ అవిధ్యః)** – సుగ్రీవునివంటి అల్పుని నేను సహాయముగా చేసికొంటిని కదా! లోకులు ఏమని తలంతురో? అని సందేహింపక, వెంటనే అతని నమ్మకముకొఱకు సాలవృక్షములను, పర్వతములను ఛేదించెననుటచే భగవానుని సౌలభ్య, సౌశీల్యములు వ్యక్తములు. మహర్షులగు విశ్వామిత్రాదులను అనుసరించినట్లే, అవ్యవస్థితచిత్తుడైన ఒక వానరునివెంట వెడలిన శ్రీరాముని సౌశీల్యమునకు కూరేశులు ఆశ్చర్యపడుచున్నారు. ఇచట దేశికుల **"ప్రభు రనుసృతో విశ్వామిత్రః ప్లవంగపతి స్తథా"** అను సంకల్పసూర్యోదయసూక్తి స్మరణీయము.

ఈ శ్లోకమున – **"అమర్షవశాత్ తద్విద్విషం జిఘాంసుః దాసః సఖా చ యః కపీంద్రః సమభవత్"** అని అన్వయించి, **"తత్ విద్విషమ్ జిఘాంసుః"** అనుటకు నీ శత్రువగు రావణుని వధింపగోరినవాడను అర్థము చెప్పి, సువేల పర్వతముపై శ్రీరాముడు సైన్యముతో విడిదిచేసినపుడు, ఎవరు ఊహింపని రీతిలో సుగ్రీవుడు అచటినుండి లంకుకు వెడటి రావణునితో ద్వంద్వయుద్ధమును



చేసిన వృత్తాంతమును ఈ ప్రయోగమును సూచించుచున్నదని కొందఱు వ్యాఖ్యానించిరి. కాని, రావణునితో సుగ్రీవుడు ద్వంద్వయుద్ధము చేయుట, శ్రీరాముడు సాలవృక్షములను ఛేదించుటయు ఒకే సందర్భమునకు చెందినవి కావు. కావున పూర్వోక్త వివరణమే సరసతరమని సహృదయులు గ్రహింపగలరు. **"అవధ్యః"** అనునది అపపాఠము.

**21.** **యద్వా మృగం మృగయువ న్మృగయాపథేన**
**ఛన్నో జఘంథ న చ శత్రు వదాభిముఖ్యాత్ ।**
**తద్యుక్త మేవ తవ రాఘవవంశజస్య**
**తిర్యక్షు నైవ హి విపక్షతయోపచారః ॥**

మృగం = మృగమును, మృగయువత్ = వేటగాడువలె, మృగయాపథేన = వేటాడురీతిలో, ఛన్నః = దాగినవాడవై, జఘంథ = చంపితివి, శత్రువత్ = శత్రువువలె, ఆభిముఖ్యాత్ = అభిముఖుడవై, న = కాదు, ఇతి = అని, యద్వా = ఏది కలదో, తత్ = అది, రాఘవవంశజస్య= రఘవంశమున జన్మించిన, తవ = నీకు, యుక్తమ్ ఏవ = తగినదే! (ఎందులకనగా) తిర్యక్షు = తిర్యక్కుల విషయమున, విపక్షతయా = శత్రుభావనతో, ఉపచారః ఔపచారికముగానైనను ప్రవర్తించుట న హి యుక్తః = తగినది కాదు కదా! (ఉపచారమనగా ఒక వస్తువునందున్న ధర్మమును వేరొక వస్తువులో ఆరోపించుట. ఇచట శత్రుత్వ ధర్మమును ఆరోపించి చెప్పుటకు కూడ ఏమాత్రము తగని వాలిని శత్రువని భావించుటయే ఔపచారికము).

వాలివధ విషయమునకల్గు శంకకు కూరేశులు ఇందు తమదైన శైలిలో చమత్కారముగా సమాధానము చెప్పుచున్నారు.

తనను శరణువేడిన సుగ్రీవుని రక్షించుటకొఱకు రామునకు వాలిని వధింపవలసి వచ్చినదే అనుకొందము. కాని, అతడు వాలిని నేరుగా ఎదిర్చి వధించుట మాని, చాటుగానుండి బాణప్రయోగమును చేసి సంహరించుట తగునా? వేటగాడు మృగములను వేటాడు రీతిలో నిలిచి చెట్టుచాటులో చంపుట పాడియా! వాలిని శత్రువుగా తలచి చంపినపుడు, అతనిని ఎదిర్చి యుద్ధము చేసి వధించుట కదా న్యాయము! శ్రీరాముడు **"ధర్మాత్మా"** కదా! ఇట్లు అధర్మవధను చేయుట అనుచితమే కదా! అని లోకములో వాదమును చేయువారు పలువురు కలదు. **"నిరవధిగుణగ్రామే రామే నిరాగసి వాగసి స్ఫురణముషితాలోకా లోకా వదంతి సదంతికే, వరతనుహతిం వాలిద్రోహం మనాగపసర్పణం పరిమితగుణే స్వష్టావద్యే ముధా కి ముదాసతే"** అని సంకల్పసూర్యోదయములో దేశికులు పల్కిన సూక్తి ఇచట స్మరణీయము. మొదటగా వాలిని చంపుటయే అయుక్తమను వాదమునకు పూర్వశ్లోకమున సమాధానించిన కూరేశులు, ఇందు చాటుగా చంపుట తగదని తెగడువారికి సమాధానమును పల్కుచున్నారు. శ్లోకములోని పూర్వార్ధమున పూర్వపక్షము, ఉత్తరార్ధమున సిద్ధాంతమును ప్రతిపాదింపబడినవి. పూర్వపక్షము స్పష్టము. సిద్ధాంతమేమనగా –

**(తద్యుక్త మేవ . . . నైవ హి విపక్షతయోపచారః)** – **"వివాహ శ్చ వివాద శ్చ సమయో రేవ శోభతే"** అని కదా లోకోక్తి. శ్రీరాముడు ఇక్ష్వాకువంశమున జన్మించుటచే తిర్యక్ జాతికి చెందినవాడు, అన్ని విధముల అసదృశుడైన ఒక వానరుని విరోధిగా తలచి, అతనికి ఎదురుగా నిలచి, పోరాడెను అన్నచో అది ఆ వంశమునకే అవద్యకరము. వాలిని తనకు ప్రతిపక్షిగా తలచుట కొంచెముకూడ తగదు. కావున క్షత్రియులు దుష్టమృగములను చాటుగానుండి వేటాడినట్లు, రాముడు చెట్టు చాటునుండి తిర్యగ్జాతికి చెందిన వాలిని వధించుట యుక్తమైనదే అనునది ఇచట కూరేశుల సమాధానము.

ఇది చాటూక్తిగా చెప్పిన సమాధానమని కొందఱు తలంచినను, ఇది పరమార్థమైన సమాధానములలో ఒకటి అని అభిజ్ఞుల అభిప్రాయము – అనుచు కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో అనుగ్రహించిన మరి కొన్ని విశేషములిచట ప్రస్తుతింపబడుచున్నవి.

రావణవధకొఱకు సహాయమును చేయువారిని అన్వేషించు శ్రీరాముడు ఆ రావణుని అనాయాసముగా జయింపగల్గిన వాలిని వధించి, పరమభీరువైన సుగ్రీవుని సహాయముగా గొనుట ఏమి తెలివైన పని? అని నిందించువారినిగూర్చి సమాధానము ఏమనగా – వాలి ఇంతకు ముందే రావణునితో అగ్నిసాక్షికముగా స్నేహము చేసికొనెను. కావున అతనిని తాను సహాయముగా చేసికొనిన రావణాదిదుష్టుల నిగ్రహము సాధ్యము కాకుండపోవును. అందుచే శ్రీరాముడు వాలిని వధించి, సుగ్రీవుని సహాయకునిగా గ్రహించెను. వాలిని సహాయముగా స్వీకరింపకున్నను, అతనిని వధింపక విడచియుండవచ్చును కదా! అనినచో, భవిష్యత్తులో చేయవలసిన రావణవధ అనెడి దేవకార్యమునకు వాలివధ నాంది అని చెప్పవచ్చును. ఎందులకనగా – ఆర్ద్రాపరాధియైనను శరణువేడినచో అతనిని రక్షింపవలెననుటను పరమధర్మముగా తలచి, ఆచరించు శ్రీరాముడు ఆ ధర్మమునకు విరుద్ధముగా ప్రవర్తించిన వాలిని చంపుట తగినదే. ప్రమాదవశమున తప్పుచేసినను సుగ్రీవుడు వాలిని శరణువేడెను. కాని, అతనిని వాలి క్షమింపక, పలు రీతులలో బాధించి, చంపచూచెను. అది వాలిపట్ల పెద్ద దోషము గల పరదారాపరిగ్రహము, భ్రాతృవిరోధచింత, దుర్బలుడై వెన్నుచూపి పారిపోవు వానిని తఱిమి, చంపజూచుట మొదలగు దుశ్చర్యలను పూర్వము వాలి చేసియుండుటచే, ఏకదారావ్రతుడు, సోదరులను ప్రాణనిర్విశేషముగా తలచువాడు, హంతవ్యుడైనను, దుర్బలుడైన శత్రువును చూచి "ఈనాడు ఇంటికి పోయి, రేపు మరల రమ్ము" అని పల్కి విడచిపెట్టువాడును అగు మహావీరుడైన రాముడు వాలిని చంపుట మిక్కిలి ఉచితమే. ఇక, ఎదురుగా నిల్చి చంపకుండ, చాటునుండి వాలిని వధించుట యుక్తమనుటకు సమాధానములు కలవు. వినుడు. వాలికి ఎదురుగా నిల్చి యుద్ధము చేసినచో, అతడు తన పరాక్రమమును చూచి వెఱచి, శరణాగతుడైనచో, అతనినికూడ సుగ్రీవునివలె క్షమించి రక్షింపవలసివచ్చును. సుగ్రీవున కిచ్చిన వాగ్దానము భగ్నమగును. మఱియు, వాలితో ఎవరు ఎదురుగా నిల్చి యుద్ధము చేసినను, వారి బలములో సగభాగము అతనికి చెందునను వరమును పూర్వము శివుడు అతనికి అనుగ్రహించెను. అది నిరర్థకము కాకుండుట కొఱకును శ్రీరాముడు చాటునుండి వాలిని



వధించెను. దేవతాంతరములు అనుగ్రహించిన వరములు విఫలము కాకుండునట్లు భగవానుడు కార్యమును నిర్వహించుననుటకు నృసింహావతారాదులు సాక్ష్యములు. ఇంకను ఇట్టి సమాధానములు అనేకములున్నను విస్తరభీతిచే అవి ప్రస్తుతింపబడలేదు. **"యద్వై మృగం"** అను పాఠాంతరము కలదు. **"ఆభిముఖ్యాత్"** అనుటకు అభిముఖుడవై అని అర్థము. **"మృగం మృగయువత్, మృగయాపథేన"** అను పదముల అసకృదావృత్తిరూపమైన అనుప్రాసాలంకారము కలదు. సామాన్యేన విశేషసమర్థనరూప అర్థాంతరన్యాసాలంకారమును కలదు. **"యతో రాఘవాణాం తిర్యక్షు న తుల్యబలత్వప్రతిపత్తిః, తత ఆభిముఖ్యం వినాఽపి శాఖామృగహననముచిత మితి భావః"**అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**22.** **మానుష్యకం చరిత మాచరితుం ప్రవృత్తో**
**దేవాతిగం చరిత మంగ! కి మంగ్యకార్షీః ।**
**యత్సాగరే బత! బబంధిథ నాథ! సేతుం**
**శైలైః ప్లవంగమసమింగితసంప్రణున్నైః ॥**

ఓ స్వామీ!, అంగ = ఆహా!, మానుష్యకం = మనుష్యులకు మాత్రమే తగిన, చరితమ్= కార్యమును, ఆచరితుం = ఆచరించుటకు, ప్రవృత్తః = ప్రవర్తించినవాడవగు నీవు, దేవాతిగం = దేవతలకును వీలుకాని, చరితమ్ = కార్యమును, కిమ్ అంగ్యకార్షీః = ఎందులకు అంగీకరించితివి? (అట్టి కార్యమేమి అనినచో), నాథ = స్వామీ!, ప్లవంగమ = వానరులచే, సమింగితసంప్రణున్నైః= తీసికొని రాబడి, విసరివేయబడిన, శైలైః = పర్వతములచే, సాగరే = సముద్రమునందు, సేతుమ్= వారధిని, బబంధిథ = కట్టితివి, (ఇతి)యత్ = అనునది ఏది కలదో, (అది), బత = ఆశ్చర్యము.

**''మలైయదనాలణైకట్టి''** ఇత్యాదిగా దివ్యసూరులచే ప్రస్తుతింపబడిన సేతుబంధనరూపమైన అతిమానుషలీలను కూరేశులు ఇందు ప్రస్తుతించుచు, ఆనందాశ్చర్యములతో విద్దులగుచున్నారు.

**(మానుష్యకం . . . ప్రవృత్తః. . . కిమ్ అంగ్యకార్షీః)** స్వామీ! **"ఆత్మానం మానుషం మన్యే" (యుద్ధ.120-11)** అను పల్కిన రీతిలో మనుష్యులకు తగిన కృత్యమును చేయబూనిన నీవు దేవతలకును ఊహింపవీలుకాని కృత్యములను ఏల చేసితివి? అట్టి కృత్యమేది? – అనినచో–

**(యత్సాగరే . . . సంప్రణున్నైః)** – **"కురక్కినత్తాలే కురైకడల్తన్నై నెరుక్కి యణైకట్టి" (పెరియా.1-6-8)** అని, **"కల్లాల్ కడలై అణైకట్టి యుకన్దాయ్" (కలియన్.4-7-6)** అని కీర్తించిన రీతిలో సేతుబంధనకార్యమే అత్యాశ్చర్యకరము. నీటిని చూచినచో భయపడి వెనుకకు తగ్గు స్వభావమును కల్గి, శాఖామృగములై తిరుగు వానరవీరులతో సేతువు నిర్మించుట మానవులకే కాదు, దేవతలకును వీలుకాని పని కదా!. శ్రీరామచంద్రుడు మొదట మనుష్యభావనకు తగినరీతిలోనే కార్యమును సాధింప ప్రయత్నించి, సముద్రుని శరణాగతి చేసెను. ఇట్లు **"మానుష్యకం చరితమ్ ఆచరితుం ప్రవృత్తః"** అను సూక్తి ప్రకృతముననను అన్వయించును. కాని అతడు శ్రీరాముని

పరత్వమును గమనింపక, సౌలభ్యమును మాత్రమే చూచి, తక్కువగా తలచి, **"పరన్దిట్టునిన్ద పడుకడల్తన్నై ఇరన్దిట్టకైమేల్ ఎతితిరైమోద"** (పెరియా.1-6-7) అనునట్లు తిరస్కారపూర్వకముగా ప్రవర్తించుటచే, కోపించిన శ్రీరాముడు **"చాప మానయ సౌమిత్రే! శరాం శ్చాశీవిషోపమాన్, సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః" (యుద్ధ.21-23)** అనుచు బ్రహ్మాస్త్రప్రయోగమును చేయబోయెను. అపుడు భీతిల్లిన సముద్రుడు పరుగిడివచ్చి శ్రీరాముని శరణువేడి, తనపై సేతువును కట్టుటకు అంగీకరించుటచే, శ్రీరాముడు వానరులసహాయముతో కడలిపై సేతువును నిర్మించెను. ఇట్లు ఈ వృత్తాంతములో శ్రీరాముని మానుషభావనా ప్రయుక్తమైన సౌలభ్యమును పరత్వము జయించినది. అందుచే ఇచట మనుష్యత్వములోని పరత్వము వర్ణింపబడినదని శ్రీఅణ్ణాస్వామివారి వివరణము. **"మనుష్యభావనోద్యుక్తస్య భవతః దేవై రప్యశక్యః సేతుబంధః అత్యాశ్చర్యకర ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

సేతుబంధనవృత్తాంతము శ్రీరాముని పరత్వమునకు సూచకమనుట శ్రీరామాయణములోనే పలుచోట్ల తెలుపబడినది. మాల్యవంతుడు రావణునకు హితోపదేశము చేయుచు – **"న హి మానుషమాత్రోఽసౌ రాఘవో దృఢవిక్రమః, యేన బద్ధ స్సముద్రస్య స సేతుః పరమాద్భుతః"** అని పల్కుట, మండోదరీవిలాపమునందలి – **"యదైవ వానరై ర్ఘోరైః బద్ధఃసేతు ర్మహార్ణవే, తదైవ హృదయే నాహం శంకే రామ మమానుషమ్" (యుద్ధ.114-9)** అను వాక్యము మొదలగునవి ఇందులకు ఉదాహరణములు. ఈ వృత్తాంతము కవులను సైతము అమితముగా ఆకర్షించినది. ప్రవరసేనుడను కవి దీనిని ప్రధానముగా చేసికొని **"సేతుబంధ"**మను చక్కని ప్రాకృతకావ్యమును రచించెను. ప్రాచీనతమిళకావ్యమగు **"మణిమేకలై"** యందును దీని ప్రసక్తి కలదట. ఇట్టి అద్భుతకృత్యమగుటచే దీనిని కూరేశులు ఆశ్చర్యపూర్వకముగా ప్రస్తావించిరి. మానవునిగా ప్రవర్తింపదలచిన స్వామి దేవాతిగమైన ప్రవర్తనను ప్రదర్శించెను అనుటచే **"కించిదారంభతోఽశక్యవస్త్వంతరకృతి శ్చ సః"** అని నిర్వచింపబడిన విశేషాలంకారము కలదు. **"మానుష్యకాచరిత మాచరితుమ్"** అను పాఠాంతరము కలదు.

**23.** **యో విక్రమేణ మనుజత్వవిభూషణేన**
**దేవం వరం వరుణరాజ మజ! వ్యజేష్ఠాః ।**
**కృత్వోపదాం దశరథం విధిరుద్రముఖ్యైః**
**దేవైః స్తుత శ్చ స కిలేంద్రజితా జితోఽసి ॥**

అజ = జన్మములేనివాడా!, యః (త్వం) = ఏ నీవు, మనుజత్వ = మానవభావనకు, విభూషణేన = అలంకారమనదగిన, విక్రమేణ = పరాక్రముతో, వరం = శ్రేష్ఠుడైన, దేవం = దేవతయగు, వరుణరాజం = వరుణుడను ప్రభువును, వ్యజేష్ఠాః = జయించితివో, విధి = బ్రహ్మ, రుద్ర = శివుడు, ముఖ్యైః = మొదలగు, దేవైః = దేవతలచే, దశరథం = దశరథుని, ఉపదాం కృత్వా = పురస్కరించుకొని, స్తుతః + చ = స్తుతింపబడితివో, సః= అట్టి నీవు, ఇంద్రజితా =



ఇంద్రజిత్తుచే, జితః అసి (కిమ్) = జయింపబడితివా! ఇది ఏమి! (ఆశ్చర్యము)

పూర్వశ్లోకములోవలెనే మనుష్యభావనకు అనుగుణమైన సౌలభ్యవృత్తాంతములను, దేవతలకును ఊహింపరాని పరత్వప్రదర్శకవృత్తాంతములను అనుసంధించుచు కూరేశులు ఇందు విస్మయపడుచున్నారు. ఒకప్పుడు ఆకించన్యము, అనన్యగతిత్వములను కలవానివలె సముద్రుని శరణాగతి చేయుట, వెంటనే ఆ సముద్రునిపైననే కోపించి **"సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః"** అని శరమును సంధించుట, ఒకప్పుడు బ్రహ్మరుద్రాది దేవతలందఱు నీ వద్దకువచ్చి, దశరథుని ముందుంచుకొని **"సీతా లక్ష్మీః భవాన్ విష్ణుః దేవః కృష్ణః ప్రజాపతిః, వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్" (యుద్ధ.120-27)** అనుచు నిన్ను స్తుతించు రీతిలోనుండుట, మరియొకప్పుడు ఇంద్రజిత్తు ప్రయోగించిన అస్త్రములకు బద్ధుడగుట – వీనినన్నిటిని చూడగా, స్వామీ! నీ స్థితి ఇట్టిదని తెలిసికొనుటకు వీలుకాకుండనున్నది సుమా! అని కూరేశులు ఆశ్చర్యపడుచున్నారు.

**(మనుజత్వవిభూషణేన విక్రమేణ)** – **"మనుజత్వ మేవ విభూషణం యస్య సః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానవివరణము అనగా – మనుజత్వము పరాక్రమమునకు విభాషణమని అర్థము. ఆ వ్యాఖ్యలోనే – **"విక్రమస్య మనుజత్వవిభూషణం నామ – సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతీత్యుక్తప్రకారేణ సముద్ర ముద్దిశ్య శరణాగతిపూర్వకత్వమ్"** అని వివరింపబడినది. ఇచట **"మనుజత్వస్య విభూషణం, తేన"** అని తత్పురుష సమాసమును కూడ చెప్పవచ్చును. మనుష్యత్వమునకు అలంకారమైన విక్రమ మేమి? అనగా, మొదట కాళ్లపైపడి శరణాగతిచేసి, పిమ్మట అతని తలనే తెగగొట్టుటకు ప్రయత్నించుట.

**(కృత్వోపదాం దశరథమ్)** – **"ఏష రాజా విమానస్థః పితా దశరథ స్తవ, కాకుత్స్థో మానుషే లోకే గురు స్తవ మహాయశాః"** అను శ్రీరామాయణసూక్తినిబట్టి కూరేశులు ఇట్లు ప్రయోగించిరి. **"ఉపదాం కృత్వా"** అనగా ఉపహారముగా సమర్పించి అని అర్థము పురస్కరించుకొని అని భావము.

**(విధిరుద్రముఖ్యైః దేవైః)** – **"తతో వైశ్రవణో రాజా యమ శ్చామిత్రకర్శనః, సహస్రాక్షో మహేంద్ర శ్చ వరుణ శ్చ పరంతపః, షడర్ధనయనః శ్రీమాన్ మహాదేవో వృషధ్వజః, కర్తా సర్వస్య లోకస్య బ్రహ్మా బ్రహ్మవిదాంవరః" (యుద్ధ.120-3)** అనునట్లు బ్రహ్మరుద్రాదులు రాముని వద్దకువచ్చి **"సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణుః"** ఇత్యాదిగా స్తుతించిరి.

**(స కిలేంద్రజితా జితోఽసి)** – ఇట్లు దేవతలచే పరాత్పరుడవుగా స్తుతింపబడిన నీవు ఇంద్రజిత్తుచే జయింపబడితివా! అది ఏమి? అని కూరేశుల ప్రశ్న. అనగా ఇంద్రజిత్తు అస్త్రమునకు బద్ధుడవగుట నీ మనుష్యభావనానుగుణమని తాత్పర్యము. **"సముద్రాధిదైవతవరుణరాజవిజేతుః, బ్రహ్మరుద్రాదిభిః దశరథప్రదానపూర్వకం పరత్వేన స్తుతస్య చ భవతః ఇంద్రజితా పరాజయో మనుష్యభావనానుగుణ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఏతత్ కేవలం విడంబనమ్"**

అని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య.

**24.** **అబ్ధిం న తేరిథ జిగేథ న రాక్షసేంద్రం**
**నైవాస్య జజ్ఞిథ యదా చ బలాబలం త్వమ్ ।**
**నిస్సంశయ స్సపది తస్య పదేఽభ్యషించః**
**తస్యానుజం కథ మిదం హి విభీషణం చ ॥**

స్వామీ, త్వం = నీవు, యదా = ఎప్పుడు, అబ్ధిం = సముద్రమును, న తేరిథ = దాటలేదో, రాక్షసేంద్రం = రాక్షసప్రభువగు రావణుని, న జిగేథ = జయింపలేదో, అస్య= ఈ రావణునియొక్క, బలాబలం = బలాబలములను, న జజ్ఞిథ ఏవ = తెలిసికొననే లేదో, తదా = అపుడే, సపది = వెంటనే, తస్య = ఆ రావణునియొక్క అనుజం = తమ్ముడగు, విభీషణం = విభీషణుని, తస్య = రావణునియొక్క, పదే = స్థానమందు, నిస్సంశయః = ఎట్టి సందేహములేనివాడవై, అభ్యషించః = అభిషేకించితివి, హి = ఇది ప్రసిద్ధము, ఇదం చ = ఇది, కథమ్ = ఎట్లు సంభవము?

మనుష్యభావనయందును పరత్వసూచకమైన సత్యసంకల్పత్వము వ్యక్తమైన వేరొక సందర్భమును ఇందు ప్రస్తుతించుచు, కూరేశులు ఆశ్చర్యపూర్వకముగా భగవానుని ప్రశ్నించుచున్నారు.

స్వామీ! నీవు ఇంకను సముద్రమును దాటనే లేదు; రావణుని నిర్జించలేదు, అతని బలాబలములను తెలిసికొనలేదు. అయినను నీవు ఎట్టి సంకోచము లేకుండ అతని తమ్ముడగు విభీషణుని లంకాధిపతిగా అభిషేకమును చేసితివే! ఇది ఎట్లు తగును? (దీనివలన నీవు తలచిన కార్యము తప్పక నెఱవేరుననెడి నీ సత్యసంకల్పత్వరూపపరత్వము వ్యక్తమైనది కదా! అని భావము)

**(అబ్ధిం న తేరిథ)** – ముందుగా శతయోజనవిస్తీర్ణమైన సముద్రమును దాటవలసియున్నది. అది దాటినను –

**(జిగేథ న రాక్షసేంద్రమ్) – "శదిరమామదిళ్ శూర్గ్ ఇలజ్గైక్కిఱవన్" (అమలనాది)** అని, **"లంకాం రావణపాలితామ్"** అనియు ప్రసిద్ధుడైన, అప్రధృష్యుడైన రావణుని జయింపవలసియున్నది. **"తస్య చ్ఛిద్రాణి మార్గస్వ స్వచ్ఛిద్రాణి చ గోపయ"** అని స్వపరబలాబలములు విమర్శింపనేలేదు.

**(తస్య పదే . . . అభ్యషించః)** అట్లయినను సముద్రమును దాటకనే, రావణుని వధింపగోరి అతని బలమును, బలహీనతను తెలియకనే ఎట్టి సంకోచములేక ఇతని తమ్ముడగు విభీషణుని **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ" (బాల.1-85)** అనునట్లు రావణుని స్థానమున పట్టాభిషిక్తుని చేసితివి." నాకు సముద్రము దాటుటకు వీలగునా! కాదా!" అను సంశయములేక, అన్నియు సుకరములేనని



నిశ్చయించి, రావణుని వధకు పిమ్మట చేయతగిన కార్యమును ముందుగా నీవు చేయుట నీ సత్యకామత్వ సత్యసంకల్పత్వములను ఆవిష్కరించుచున్నది కదా! అని భావము.

**"జి"** ధాతువు అనిట్ కావున **"జిగ్యిథ"** అనునది అపపాఠమని, **"జిగేథ"** అనునది సరి అయిన పాఠమని కొందఱు వ్యాఖ్యానించిరి. గార్గ్యరామానుజవ్యాఖ్యలోకూడ **"జిగ్యిథ – ఇత్యత్రగుణాభావో విచారణీయః"** అని కలదు. శిష్టప్రయోగసంగ్రహమను గ్రంథములో **"జిగేథ న రాక్షసేంద్రమ్ – ఇతి భావ్యమ్. లేఖకప్రమాదః"** అను పాఠశోధనచేసి, పిమ్మట **"అథవా, ఓరోత్ – ఇతి వక్తవ్యే, ఓర్గుణః – ఇతి గుణశబ్దప్రయోగాత్ సంజ్ఞాపూర్వకో విధి రనిత్యః ఇతి పరిభాషయా స్వాయంభువ ఇత్యాదివదత్రాపి గుణో న భవతీతి జ్ఞేయమ్"** అని సమర్థింపబడినది.

రావణుని గూఢచారియగు శుకుడు విభీషణుని రాముడు పట్టాభిషిక్తుని చేయుటను – **"రక్షోగణపరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః, శ్రీమతా రాజరాజేన లంకాయా మభిషేచితః" (యుద్ధ.28-27)** అని తెలిపెను. **"సాగరతరణరాక్షసేంద్రబలాబలపరీక్షణతజ్జయానాం పూర్వ మేవ విభీషణస్య రాక్షసేంద్రత్వేన పట్టాభిషేకః స్వకీయసత్యసంకల్పత్వావిష్కారం వినా కథం ఘటత ఇతి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య.

**25.** **త్వం దక్షిణస్య నివస న్నుదధే స్తటేఽపి**
**దూరాంతరోత్తరపయోధిమహాంతరీపే ।**
**దైత్యా న్నిజైకశరపారణయన్ కి మేతాం**
**లంకాం స్థితోఽత్ర కురుషే కిల స స్మ భస్మ ॥**

స్వామీ!, త్వం = నీవు, దక్షిణస్య ఉదధేః = దక్షిణసముద్రముయొక్క తటే = తీరమునందు, నివసన్ అపి = నివసించి ఉన్నవాడవు అయినను, దూరాంతర + ఉత్తరపయోధి= కదు దూరములోనున్న ఉత్తరసముద్రముయొక్క మహా + అంతరీపే = గొప్ప ద్వీపములోని, దైత్యాన్ = అసురులను, నిజ + ఏకశరపారణయన్ = నీయొక్క ఒకే ఒక బాణమునకు పారణగా (ఎరగా) చేయువాడవు, అత్ర స్థితః = ఇచటనున్నవాడవై, ఏతాం = ఈ (సమీపములోని), లంకామ్ = లంకానగరమును, భస్మ = భస్మముగా, న కురుషే స్మ కిల = చేయలేదు కదా!, కిమ్= ఏమి! (ఎందులకు?)

శ్రీరామచంద్రుడు సముద్రుని ఉద్దేశించి శరణాగతి చేసినను, అతడు ప్రత్యక్షము కాలేదు. అపుడు సముద్రునిపై కోపించిన స్వామి అతనిపై బ్రహ్మాస్త్రమును సంధించెను. అందులకు భీతిచెందిన వరుణుడు వణకుచు శ్రీరాముని ముందు సపత్నీకుడై ప్రత్యక్షమై **"పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతి శ్చ రాఘవ! స్వభావే సౌమ్య తిష్ఠంతి శాశ్వతం మార్గ మాశ్రితాః" (యుద్ధ.22-24,25)** అని స్తుతించి, తనను క్షమింపవేడెను. అపుడు శ్రీరాముడు – **"అమోఘోఽయం మహాబాణః కస్మిన్ దేశే నిపాత్యతామ్" (యుద్ధ.22-29).** ఈ బాణము విఫలము కాదు, దీనిని ఎచట ప్రయోగింపమందువు ? అనుచు ప్రశ్నింపగా, అచటికి దక్షిణదిశలోనున్న దైత్యులను

చూపి, వారిపై ప్రయోగింపుమని వరుణుడు కోరెను. స్వామియు అట్లే బాణప్రయోగమును చేసెనని శ్రీరామాయణము యుద్ధకాండలో కలదు. ఆ అతిమానుషవృత్తాంతమును ఇందు ప్రస్తావించుచు కూరేశులు స్వామిని చమత్కారముగా ప్రశ్నించుచున్నారు.

నీవు దక్షిణసముద్రతీరములోనుండియే అచటికి అతిదూరములో దక్షిణదిక్కులోనున్న ద్రుమకుల్యమను ద్వీపమునందలి దైత్యులను ఒకే బాణముతో దహించితివి. ఇట్లు చేయగల్గిన అద్భుతశక్తిని కల నీవు ఆ దక్షిణసాగరతీరముననుండియే అచటికి సమీపములోనున్న లంకను అనాయాసముగా దహింపగలవు. కదా! కాని, అట్లు చేయలేదేమి? దూరములోనున్న శత్రువులను సంహరింపగల నీ బాణము దగ్గరలోనున్న శత్రువులను చంపలేదనుటకు వీలులేదు. ఇట్లు లంకను అవలీలగా భస్మము చేయగల్గినవాడవైయుండగా, అసేవ్యసేవచేయుట (సముద్రశరణాగతి) మొదలగు శ్రమలను పొందుట ఏల ? అని ప్రశ్నించుచున్నారు.

ఈ సాభిప్రాయమైన ప్రశ్నకు మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో ఇట్లు సమాధానమును అనుగ్రహించిరి. "ఇందులకు సమాధానము ఉన్నదా? లేదా? అనినచో, ఉన్నది. వినుడు. రావణుని ఏ విధముగానైనను చంపితీరవలెనని శ్రీరాముని సంకల్పమైనచో సత్యసంకల్పుడగు అతడు అతనిని సులభముగా తానున్న చోటునుండియే బాణమును ప్రయోగింపవలసిన అవసరము లేకనే, సంకల్పమాత్రముచేతనే సంహరించియుండును. కాని, అట్టి ఉద్దేశ్యము రామునకు లేదు. అతనికి ఏ మాత్రమైనను ఆభిముఖ్యము కల్గినచో, అతనిని సంస్కరించి, అనుగ్రహింపవలెనను అభిప్రాయమునే రాముడు కల్గియుండెను. యుద్ధములో తన చేతిలో ఓడిన రావణుని చూచి **"గచ్ఛానుజానామి" (యుద్ధ.59-141)** అని, **"ఇన్రుపోయ్ నాళైవా"** అని విడచిపెట్టుటలో అభిప్రాయమిదియే కదా! అందుచే, ఏవిధముగానైనను అతనిని అనుగ్రహింపవీలగునా? అతడు అనుకూలుడగునా? అను ఆశతోనే శ్రీరాముడు లంకవరకు వెడలి, వేచిచూచెనని చెప్పనగును".

ఈ శ్లోకములో ప్రస్తుతించిన వృత్తాంతము శ్రీరాముని ధైర్యగుణమును సూచించుచున్నదని దేశికుల అభిప్రాయము. శరణాగతిగద్యభాష్యములో ధైర్యగుణమును వివరించుచు – **"జీవత్యపి మహాబలే రావణే సాగరేఽప్యలంఘితే విభీషణ మభిషించతా దర్శితోఽయం గుణః"** అని వివరించుట ఇందులకు నిదర్శనము. కూరేశులు ప్రస్తుతశ్లోకములో పేర్కొన్న వృత్తాంతమునే మరల సుందరబాహుస్తవములో **"కూలేఽబ్ధేః కిల దక్షిణస్య నివసన్" (105)** అను శ్లోకములో పేర్కొనుచు – **"తస్మాద్వనాద్రీశ్వర శ్రీమన్ సుందర సేతుబంధనముఖాః క్రీడాస్తవాడంబరమ్"** అని నుడువుట ఇచట స్మరణీయము. ప్రస్తుతవృత్తాంతమువలన **"స్వాతంత్ర్యమైశ్వర మపర్యనుయోజ్య మాహుః"** అను రీతిలో అపర్యనుయోజ్యమైన భగవానుని స్వాతంత్ర్యము వ్యక్తమగుచున్నదని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. **"తవైశ్వర్య మపర్యనుయోజ్య మితి భావః"** అని అచటి పంక్తి. **"అతిదూరోత్తరసాగరద్వీపస్థానేకబలవత్తరదైత్యాన్ ఏకేన సాయకేన సంహృతవతః తవ సన్నిహితలంకానిలయరాక్షససంహారోఽత్ర స్థిత్వైవ శక్య ఇతి భావః"** అని



శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఏతామ్"** అను సర్వనామము **"సమీపతరవర్తి చైతదో రూపమ్"** అను క్రమమును బట్టి ప్రయోగింపబడినది.

**26. ఏత త్కథం కథయ యన్మథిత స్త్వయాఽసౌ**
**హిత్వా స్వభావనియమం ప్రథితం త్రిలోక్యామ్ ।**
**అశ్వాప్సరోవిషసుధావిధుపారిజాత –**
**లక్ష్మ్యాత్మనా పరిణతో జలధి ర్బభూవ ॥**

స్వామీ!, త్వయా = నీచే, మథితః = చిలుకబడిన, అసౌ = ఈ, జలధిః = సముద్రము, త్రిలోక్యాం = ముల్లోకములలో, ప్రథితం = ప్రసిద్ధమైన, స్వభావనియమం = ఇది ఇట్లు మాఱును అను సహజనియమమును, హిత్వా = విడచి, అశ్వ = ఉచ్చైశ్శ్రవమను అశ్వము, అప్సరః = రంభాది అప్సరసలు, విష = హాలాహలమను విషము, సుధా = అమృతము, విధు = చంద్రుడు, పారిజాత = పారిజాతమను కల్పతరువు, లక్ష్మీ = లక్ష్మీదేవి, ఆత్మనా = రూపములో, పరిణతః= పరిణమించినదిగా, బభూవ = అయ్యెను, ఇతి యత్ = అనునది ఏది కలదో, ఏతత్ = ఇది, కథం = ఎట్లు, కథయ = చెప్పుము.

ఈ శ్లోకము రామావతారమునకు సంబంధించినది కాదు. మధ్యలో ప్రాసంగికముగా వచ్చినది. 22వ శ్లోకము మొదలు వరుసగా నాల్గు శ్లోకములలో సముద్రప్రస్తావన వచ్చుటచే, సముద్రమథనవృత్తాంతము కూరేశుల స్మృతిపథమునకు వచ్చినది. దానిని ఈ శ్లోకమున ప్రస్తుతించుచున్నారని సంస్కృతవ్యాఖ్యాత శ్లోకసంగతిని వివరించెను. **"సముద్రమథనకాలీనాశ్చర్యాణ్యపి ప్రసంగా దాహ"** అని అచటి వివరణము. కాంచీ శ్రీ అణ్ణాస్వామివారును ఇట్లే సాయించిరి. కాని, గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో మాత్రము ఈ శ్లోకము **"త్వన్నిర్మితా"** అను 16వ శ్లోకమునకు పిమ్మట 17వ శ్లోకముగా చూపబడి, వ్యాఖ్యానింపబడినది. ఈ శ్లోక వృత్తాంతము రామావతారమునకు సంబంధించినది కాదు, కావున ఇట్లు ఆ వ్యాఖ్యాత శ్లోక క్రమమును మార్చియుండవచ్చును.

స్వామీ! నీచే చిలుకబడిన సముద్రము ముల్లోకప్రసిద్ధమైన తన సహజస్వభావమును విడచి, అశ్వ–అప్సర–విష–అమృత–చంద్ర–పారిజాత–లక్ష్మ్యాదిరూపమున పరిణమించినదే! ఇది ఏమి ఆశ్చర్యము! దీనికి కారణమేమియో తెలుపుము అని భావము.

**(త్వయా మథితః జలధిః) – "నీలక్కడల్ కడైన్దాయ్" (తి.వా.10-10-7)** అని నమ్మాళ్వార్లు, **"వఙ్గక్కడల్ కడైన్ద"** అని ఆణ్డాళ్, ఈవిధముగా పలువురు దివ్యసూరులు భగవానుడే అమృతమథనమును చేసెనని పల్కుటచే, ఆక్రమములో కూరేశులు ఇట్లు పల్కిరి. దేవతలు, రాక్షసులును మందరపర్వతమును కవ్వముగా, వాసుకిని తాడుగా చేసికొని పాలసముద్రమును చిలికిరని ప్రసిద్ధియున్నను, అన్ని దశలలోను భగవానుడు అంతర్యామియైయుండుటవలననే

క్షీరాబ్ధి మథనము సాధ్యమయ్యెనని పురాణములందు స్పష్టముగా తెలుపబడినది. వేదముకూడ **"వాయురస్మా ఉపామంథత్ పినష్టిస్మాకునన్నమా, కేశీ విషస్య పాత్రేణ యద్ రుద్రేణాపిబత్ సహ"** అనుచు భగవానుడు సముద్రమథనము చేయుటను కొనియాడినది.

క్షీరాబ్ధిమథనసమయమున కవ్వముగా చేసికొనబడిన మందరము బరువువలన సముద్రములోనికి మునిగిపోజొచ్చెను. అపుడు **"క్షీరోదమధ్యే భగవాన్ కూర్మరూపీ స్వయం హరిః, మంథనాద్రే రధిష్ఠానం భ్రమతోఽభూ న్మహామునే" (విష్ణు.పు.1-9-88)** అను రీతిలో కూర్మరూపియై ఆ పర్వతమునకు అధిష్ఠానమై మునిగిపోకుండ ధరించెను. పిమ్మట చిలుకు వేగమునకు మందరము పైపైకిరాసాగెను. అంత స్వామి **"ఉపర్యాక్రాంతవాన్ శైలం బృహద్రూపేణ కేశవః తథాఽపరేణ మైత్రేయ యన్న దృష్టం సురాసురైః" (1-9-90)** అనునట్లు ఆ మందరపర్వతముపైన తానుండి అది పైకి రాకుండునట్లు కాపాడెను. అంతియే కాక దేవతల మధ్య, దైత్యులమధ్యను తానుండి వాసుకిని లాగుచు మథనము చేసెను. **"రూపేణాన్యేన దేవానాం మధ్యే చక్రగదాధరః, చకర్ష నాగరాజానం దైత్యమధ్యేఽ పరేణ చ" (1-9-89)** అను శ్లోక మీ విషయమును తెలుపుచున్నది. అంతటితో ఆగకుండ వాసుకియందును తన తేజస్సు అనుప్రవేశింపచేసి దానికి శక్తిని కల్గించెను. దేవతలలో అనుప్రవేశించి, వారికి చిలుకు శక్తిని ఇచ్చెను. **"తేజసా నాగరాజం తం తథాఽప్యాయితవాన్ హరిః, అన్యేన తేజసా దేవాన్ ఉపబృంహితవాన్ ప్రభుః" (1-9-91)** అనుచు పరాశరమహర్షి దీనిని తెలిపెను. ఈ విధముగా అన్నివిధములా భగవానుని సహాయముండుటచేతనే క్షీరాబ్ధిమథనము సాధ్యమయ్యెను. కావున కూరేశులు **"త్వయా మథితః"** అని పల్కిరి.

**(హిత్వా స్వభావనియమం ప్రథితం త్రిలోక్యామ్)** – లోకమున పాలు, పెఱుగుగా, నూలు వస్త్రముగా, మన్ను కుండగా పరిణమించును. ఇట్లు వస్తువుల పరిణామమునకొక నియమమున్నది. కాని, భగవానుడు క్షీరసముద్రమును చిలుకునపుడు పాలనుండి వేర్వేరు వస్తువులు పుట్టినవి. లోకన్యాయమునుబట్టి ఇది అసంఘటితము. జలద్రవ్యము అశ్వాదిరూపముగా పరిణమించు రీతిని ఎచటను చూడలేదు. ఇది ఏమి విచిత్రము? అతిమానుష కృత్యము? స్వామీ! పల్కుము.

దీనివలన భగవానుని అఘటితఘటనాసామర్థ్యరూపమైన అద్భుతఅతిమానుషశక్తి వ్యక్తమగుచున్నది. **"అతః త్వచ్ఛక్తి ర్విచిత్రేతి భావః"** అని గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్య. **"త్వయా మథితస్య సాగరసలిలస్యాశ్వాద్యాత్మనా పరిణామో జగత్త్రయనియతవస్తుస్వభావవిసదృశ స్త్వదీయాఘటితఘటనాశక్తిఘటిత ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అసౌ"** అను ప్రత్యక్ష నిర్దేశమువలన సముద్రమథన వృత్తాంతము కూరేశుల కంటిముందు సాక్షాత్కరమయ్యెనని ధ్వనించుచున్నది.



**27.** **యత్తాదృశాగస మరిం రఘువీర! వీక్ష్య**
**విశ్రమ్యతా మితి ముమోచిథ ముగ్ధ మాజౌ ।**
**కోఽయం గుణః కతరకోటిగతః కియా న్వా**
**కస్య స్తుతేః పద మహో బత కస్య భూమిః ॥**

రఘువీర = శ్రీరామా!, తాదృక్ + ఆగసమ్ = అట్టి (చెప్పుటకు వీలుకాని) అపరాధమును చేసిన రావణుని, ఆజౌ = యుద్ధరంగములో, ముగ్ధం = ఏమియు చేయుటకు తోచనివాడైయున్నవానినిగా, వీక్ష్య = చూచి, విశ్రమ్యతామ్ ఇతి = విశ్రాంతిని పొందుము (మరల రమ్ము) అని, ముమోచిథ = విడచిపెట్టితివి, అయమ్ = ఈ, గుణః = గుణము, కః = ఎట్టిది? కతరకోటిగతః = ఏ ప్రకారమునకు చెందినది? కియాన్ వా = ఎంతటిది?, కస్య = ఎవరియొక్క స్తుతేః = స్తోత్రమునకు, పదమ్ = వీలయినది ? కస్య భూమిః = ఎవరికి దర్శింప సాధ్యమైనది, అహో బత = ఆశ్చర్యము! ఆశ్చర్యము!

యుద్ధములో రావణుడు – **"యో వజ్రపాతాశనిసంనిపాతా న్న చుక్షుభే నాపి చ చాల రాజా, స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ ముమోచ వీరః" (యుద్ధ.59-137)** అనునట్లు రామబాణముల ధాటికి తాళలేక నిరుత్తరుడయ్యెను. అపుడు స్వామి **"గచ్ఛానుజానామి రణార్దిన స్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ లంకామ్, ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః" (యుద్ధ.59-141)** – ఇక నీవు ఇంటికి పోయి, సేదదీరి, మరల సర్వసన్నద్ధుడవై యుద్ధమునకు రమ్ము, అపుడు నా బలమెట్టిదో చూచెదవు అనుచు రావణుని విడచిపెట్టెను. ఈ అద్భుతసన్నివేశమును ప్రస్తావించుచు కూరేశులు "స్వామీ! వధించుటయే తప్ప క్షమించుటకు ఏమాత్రము అర్హుడుకాని, ఆర్ద్రాపరాధియైన రావణుని నీవు అట్లు విడచిపెట్టితివే! ఇది ఏమి గుణము!'' అనుచు విద్ధులై, ఈ శ్లోకమును సాయించుచున్నారు. **"అనవధికాపరాధవిధాయివిరోధిష్వపి నిర్నిరోధసంచారాం కరుణా మనుభవ న్నాహ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని అవతారిక.

**(తాదృశాగసమ్)** – నోటితోకూడ చెప్పుటకు వీలుకాని పాపమును చేసినవాడు. గోదాదేవియు **"పొల్లావరక్కన్"** అనిరి. తల్లిని తండ్రిని వేరుచేసిన నీచుడు కదా అతడు అని అచట పూర్వాచార్యుల వ్యాఖ్య. రాజాపరాధినామమునుకూడ చెప్పరాదనుటను కాళిదాసు మేఘసందేశప్రారంభములో **"కశ్చిత్ కాంతావిరహగురుణా"** అనుచు కశ్చిచ్ఛబ్దప్రయోగముచే సూచించెనను మల్లినాథసూరి వ్యాఖ్య ఇచట స్మరణీయము. **"కరికుఴల్ కనివాయ్ త్తిరువినైప్పిరిత్త క్కొడుమైయిల్ కడువిశైయరక్కన్" (కలియన్.5-7-7)** ఇత్యాది దివ్యసూరిసూక్తులు రావణుని పరమ పాపిష్ఠత్వమును తెల్పుచున్నవి.

**(ముగ్ధమ్)** – ఏమి చేయుటకు తోచనివానిని అని అర్థము. **"తం విహ్వలాంతం ప్రసమీక్ష్య రామః" (యుద్ధ.59-140), "తం నిర్విషాశీవిషసన్నికాశం, శాంతార్చిషం సూర్య**

మివాప్రకాశమ్, గతశ్రియం కృత్తకిరీటకూటమ్" (యుద్ధ.59-141) అని, "బ్రహ్మదండప్రకాశానాం విద్యుత్సన్నిభవర్చసామ్, స్మరన్ రాఘవ బాణానాం వివ్యథే రాక్షసేశ్వరః" (యుద్ధ.60-3) అనియుగల శ్రీరామాయణసూక్తులనుబట్టి ఇట్లు ప్రయోగింపబడినది.

**(విశ్రమ్యతా మితి ముమోచిథ)** – "ఈనాడు నీవు యుద్ధరంగమునుండి ఇంటికిపోయి, సేద దీరి, మరల పోరుకు రమ్ము" అని పల్కి, వధ్యుడగు శత్రువును విడచిపెట్టువారుకూడ ఉందురా!

**(కోఽయం గుణః)** – ఈ గుణస్వరూప మేమి? సౌశీల్యము, సౌహార్దము, సౌలభ్యము అనుచు కొన్ని గుణములకు పేరుపెట్టినట్లు ఈ గుణము ఏ పేరుపెట్టవలెను? ఆ పేరు ఏదియో స్వామీ! నీవే చెప్పుము. **"దయా వా, క్షమా వా, సర్వభూతసామ్యం వా, సర్వభూతసౌహార్దం వా, ఏతేషాం సముదాయో వా"** ఇతి రామానుజాచార్యవ్యాఖ్య.

**(కతరకోటిగతః)** – ఆశ్రయణసౌకర్యాపాదకములు అని, ఆశ్రితకార్యాపాదకములు అని రెండు విధములుగా పల్కు నీ కల్యాణగుణములలో ఏ ప్రకారమునకు చెందినది ఈ గుణము? **"దృఢమూలతయా తథాఽప్యప్రకంపతయా చ జాయమానత్వాత్ పరాం కాష్ఠాం గత ఇత్యర్థః, ఇతోఽపి త్వదసాధారణ ఇతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య.

**(కియా న్వా)** – ఈ గుణము పరిమితిని తెలిసినవారు కలరా? అప్రమేయము కదా! ఇది. **"కిం ప్రమాణకః, శత్రుమిత్రసాధారణ్యేన స్థిరాశ్రయతయా ప్రవృత్తే రంత ఇత్యర్థః"** అని రామానుజాచార్య వ్యాఖ్య.

**(కస్య స్తుతేః పదమ్)** – వెన్నను దొంగిలించి, రోలుకు కట్టబడి, వెక్కివెక్కి ఏడ్చిన గుణమును స్తుతింపబూని ఆళ్వార్లు ఆఱునెలలు మోహించియుండిరన్నచో ఈ గుణమును గూర్చి ఎవరికైన నోఱుతెఱచుటకైన సాధ్యమా? **"చతుర్ముఖాయు ర్యది కోటివక్త్రో భవే న్నరః క్వాపి విశుద్ధచేతాః, స తే గుణానా మయుతైక మంశం వదే న్న వా దేవవర ప్రసీద"** అను వరాహపురాణ (73-35) వచనము ఇచట అనుసంధేయము. **"విధిశివసనకాదీనా మపి స్తుత్యనర్హ ఇత్యర్థః"** అని రామానుజాచార్యవ్యాఖ్యానము. ఇట్టి సూక్తిని అనుసరించుచు భట్టరు శ్రీరంగరాజస్తవములో **"యది మే సహస్రవదనాదివైభవం నిజ మర్పయేత్ స కిల రంగచంద్రమాః, అథ శేషవ న్మమ చ తద్వ దేవ వా స్తుతిశక్త్యభావవిభవేఽపి భాగితా''** అని సాయించిరనదగును. **"అవాఙ్మానసగోచరవైభవ ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(కస్య భూమిః)** – ఈ గుణమును కనుగొనగల్గినవారు కలరా? ఎవరికిని వీలుకాదు **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (తైత్తి.ఆ.) అనునట్లు **"నెఞ్జాల్ నినైప్పరిదాల్" (తిరువిరు-98)** అనునట్లు వాక్కుతో స్తుతించుటకు అందకపోవుటయే కాదు, మనస్సుకుకూడ అందనిది. **"మనసోఽప్య భూమి రిత్యర్థః, కస్య శ్రేయసః స్థాన మితి వా, సర్వశ్రేయసాం స్థాన మిత్యర్థః"** అని రామానుజాచార్య వ్యాఖ్య.



**(అహో బత)** – ఈ రెండు సర్వనామములు ఆశ్చర్యమును, హర్షమును తెలియజేయుచున్నవి. **"అహో బత ఆశ్చర్యహర్షయోః, కృతాగసి క్రోధార్హేఽపి జాయామానత్వా దాశ్చర్యమ్, విముక్తః శత్రుః విభీషణవ న్మాం శరణ ముపగచ్ఛేదిత్యభిప్రాయేణ జాయమానత్వాత్ హర్షః, అయం గుణ స్త్వదసాధారణ ఇతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. అనగా – అపరాధి, క్రోధమునకు (దండనకు) అర్హుడు అయినను రావణుని విషయమున ఈ అద్భుతగుణము ప్రవర్తించినది కావున ఆశ్చర్యము, విడువబడిన శత్రువు విభీషణునివలె నన్ను శరణుపొందవచ్చునను అభిప్రాయముతో రావణునియందు ప్రవర్తించుటచే హర్షము, ఈ గుణము నీకు అసాధారణము అని అర్థము. **"అహో వద"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యాన పాఠము.

ఈ శ్లోకభావము గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్యలో **"మానుషవేషపరిగ్రహేఽపి ఏతాదృశగుణావిర్భావాత్ పరత్వం త్వయాఽపి దురపహ్నవ మితి హృదయమ్"** అని, శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో – **"దయాయాః పరదుఃఖాసహిష్ణుత్వరూపత్వేఽపి ఈ దృశమహాపరాధిష తస్యాః ప్రవృత్త్యసంభవాత్, అస్య గుణస్య స్వరూపస్వభావపరిమాణనిర్ణయః స్తుతిసాక్షాత్కారౌ చ స సంభవంతీతి భావః"** అనియు వివరింపబడినది. **"కోఽయం గుణః"** అనుటచే ఈ అద్భుతగుణముయొక్క స్వరూపము, **"కతరకోటిగతః"** అనుటచే స్వభావము, **"కియా న్వా"** అనుటచే పరిమాణము, **"కస్య స్తుతేః పదమ్"** అనుటచే స్తుతి, **"కస్య భూమిః"** అనుటచే సాక్షాత్కారమును ప్రస్తావింపబడినవి అని చెప్పనగును. గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో ఈ శ్లోకముయొక్క ఉత్తరార్ధము పూర్వార్ధముగా, పూర్వార్ధము ఉత్తరార్ధముగా కన్పడుచున్నది. ఇట్టి విపర్యాసము తరువాతి శ్లోకమునందును ఆ వ్యాఖ్యలో కలదు.

**28.** **య ల్లక్ష్మణ స్త్వదనుజో రిపుశక్తిముగ్ధః**
**శత్రో ర్గురు ర్హనుమత స్తు లఘు ర్బభూవ ।**
**ఏతేన వై సువిదితోఽభవ దింద్రశత్రోః**
**మాయాస్త్రబంధననిబంధనజో విమోహః ॥**

శ్రీరామా, రిపుశక్తి = శత్రువగు రావణుని శక్తి అను ఆయుధముచే, ముగ్ధః = మోహమును పొందిన, త్వత్ + అనుజః = నీ తమ్ముడగు, లక్ష్మణః = లక్ష్మణుడు, శత్రోః = శత్రువుకు, గురుః = కదపుటకు వీలుకానట్లు బరువైనవాడై, హనుమతః + తు = హనుమంతునకు మాత్రము, లఘుః = పూమాలను ఎత్తగల్గునట్లు తేలికయైనవాడై, బభూవ = అయ్యెను, ఇతి యత్ = అను ఏ విషయము కలదో, ఏతేన = ఈ విషయముచే, తే = నీకు, ఇంద్రశత్రోః = ఇంద్రజిత్తుయొక్క, మాయా + అస్త్రబంధనజ = మాయాస్త్రప్రయోగముచేకల్గిన, విమోహః = మూర్ఛ, (ఎట్టిదో, ఎంత నిజమో), స విదితః = అది తెలియబడినది (మనుష్యభావనార్థము అనుట సుస్పష్టము), అభవత్ = అయినది.

23వ శ్లోకములో ప్రస్తావించిన ప్రశ్నకు కూరేశులు ఈ శ్లోకముద్వారా సమాధానము

చెప్పుచున్నారు. రావణుని వధించుటచే నిరూపింపబడిన భుజబలమునుకల రామచంద్రుడు ఇంద్రజిత్తు అస్త్రములకు ఎట్లు మూర్ఛిల్లెనను ప్రశ్నకు ఇందు సమాధానమును చెప్పుచున్నారని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని అవతారిక. ఇంద్రజిత్తుతో జరిగిన యుద్ధములో రామలక్ష్మణులు రెండు మార్లు మూర్ఛిల్లిరి. మొదటి పర్యాయము నాగపాశముల ప్రభావమువలన, రెండవమారు బ్రహ్మాస్త్రప్రభావమువలన మూర్ఛను పొందిరి. ఈ రెండు మార్లు మూర్ఛిల్లుటయు సామాన్య మానవుల మూర్ఛవలె నిజము కాదు, కేవలము నటనమాత్రమే అని తెలుపబడుచున్నదని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. ఆ వ్యాఖ్యలో (పూర్వశ్లోకమువలె) పూర్వార్ధము ఉత్తరార్ధముగా, ఉత్తరార్ధము పూర్వార్ధముగానున్నది.

**(లక్ష్మణ స్త్వదనుజో . . . శత్రో ర్గురుః హనుమత స్తు లఘు ర్బభూవ)** – యుద్ధకాండము 59వసర్గలో ఈ వృత్తాంతము కలదు. **"స శక్తిమాన్ శక్తిసమాహత స్సన్ ముహుః ప్రజజ్వాల రఘుప్రవీరః, తం విహ్వలంతం సహసాఽభ్యుపేత్య జగ్రాహ రాజా తరసా భుజాభ్యాం, హిమవాన్మందరో మేరుః త్రైలోక్యం వా సహామరైః, శక్యం భుజాభ్యా ముద్ధర్తుమ్ న సంఖ్యే భరతాగ్రజః" (యుద్ధ. 59–110)** అని వర్ణింపబడినరీతిలో హిమవత్పర్వతమును, మందరమును, మేరువును, దేవతలతో కూడిన ముల్లోకములను సైతము భుజములతో అనాయాసముగా పైకెత్తగల్గిన రావణుడు యుద్ధరంగమున శక్తిచే కొట్టబడి, మూర్ఛిల్లిన లక్ష్మణుని మాత్రము ఎత్తలేకపోయెను. కాని, ఆ లక్ష్మణుడే స్నేహితుడు, భక్తుడును అగుటచే హనుమంతునకు తేలిక అయ్యెను. **"హనూమా నపి తేజస్వీ లక్ష్మణం రావణార్దితమ్, అనయ ద్రాఘవాభ్యాశం బాహుభ్యాం పరిగృహ్య తమ్, వాయుసూనోః సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః, శత్రూణా మప్రకంప్యోఽపి లఘుత్వ మగమత్ కపేః" (యుద్ధ. 59–118)** అని రామాయణ సూక్తి, **"లఘుత్వ మాప"** అను పాఠాంతరము ఈ ప్రమాణపాఠానుకూలము. ఇది రామానుజాచార్యవ్యాఖ్యలో కనుపించుచున్నది. **(ఏతేన వై సువిదితోఽభవత్ . . . విమోహః)** – లక్ష్మణుడు మూర్ఛపోవుట నిజమైనచో శత్రువులకు ఎత్తుటకు వీలుకానట్లు బరువై, భక్తులకు తేలికగా ఎత్తగల్గినవాడైయుండుట సంభవింపదు కదా! **"పత్తుడైయడైయవర్కెళియవన్ పిఱర్కట్కరియవిత్తకన్" (తి.వా. 1–3–1)** అని మనస్సున శాత్రవము కలవారికి చిక్కనివాడు, భక్తిని కలవారికి సులభుడును అయ్యెననగా, ఇంద్రజిత్తు మాయాస్త్రబంధనప్రయుక్తమైన మోహము మనుష్యభావనకు అనుగుణమైన అభినయమాత్రమేననుట వ్యక్తమగుచున్నది కదా! అని భావము. **"ఏతేన కారణేన ఇంద్రజితో మాయాస్త్రబంధనకారణజో విమోహో నటనమాత్ర మితి సుజ్ఞాతోఽభూదితి"** అని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్యలో, **"రిపుశక్తిముగ్ధత్వేఽపి లక్ష్మణస్య రక్షఃపతినోద్ధర్తు మశక్యత్వాత్ ఇంద్రజిదస్త్రబంధనం మనుష్యభావనేతి విదిత మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో తెలుపబడినది.

తృతీయపాదములో **"ఏతేన వై"** అని, **"ఏతేన వామ్"** అని, **"ఏతేన తే"** అని మూడు విధములైన పాఠములు కలవు. (మాయాస్త్రబంధనవ్యామోహము రామలక్ష్మణు లిద్దఱికిని కల్గినట్లు



చెప్పబడుటచే). **"వామ్"** అను పాఠమే సరి అయినదని కొందరి వ్యాఖ్యాతల అభిప్రాయము. భగవానునిగూర్చి మాత్రమే ఈ స్తుతి ప్రవర్తించుటచే **"తే"** అను పాఠమే సరి అయినదని మరికొందఱి ఉద్దేశ్యము. **"వై"** అనునది ప్రసిద్ధిద్యోతకమని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. నిబంధనమనగా నిమిత్తమని అర్థము.

**29.** **హా! హంత! హంత! భవత శ్చరణారవింద –**
**ద్వంద్వం కదా ను భవితా విషయో మమాక్ష్ణోః ।**
**యోఽహం నిరర్గళవినిర్గళదంధకారైః**
**వృక్షై స్తృణై శ్చ సులభం సమయం వ్యతీతః ॥**

యః అహం = ఏ నేను, నిరర్గళ = అడ్డులేకుండ, వినిర్గళత్ = విడువబడిన, అంధకారైః= అజ్ఞానాంధకారమునుకల, వృక్షైః = వృక్షములచే, తృణైః + చ = తృణములచేతను, సులభం = సులభముగా పొందతగిన, సమయం = (అవతార) కాలమును, వ్యతీతః = పోగొట్టుకొంటినో, తస్య మమ = అట్టి నాకు, భవతః = నీయొక్క, చరణ + అరవిందద్వంద్వం = పాదపద్మముల జంట, అక్ష్ణోః = కన్నులకు, విషయః = విషయముగా (కనుపించునదిగా) కదా ను భవితా = ఎపుడు అగునో కదా!, హా హంత హంత = అయ్యో! కష్టము ! కష్టము!

**"అన్ఱు శరాశరఙ్గళై వైకున్దత్తేర్ఱి"** (పెరుమాళ్. 10–1) అని, **"నఱ్పాలయోత్తియిల్ వాళుమ్ శరాశరమ్ ముఱ్ఱవుమ్ నఱ్పాలుక్కుయ్‌త్తనన్" (తి.వా. 7–5–1)** అనియు దివ్యసూరులు ప్రస్తుతించిన వృత్తాంతమును అనుసంధించుచు కూరేశులు "అయ్యో! పాపిష్ఠివాడను! ఆ కాలమున జన్మింపలేకపోయితినే" అని వాపోవుచున్నారు. **"మునివన్ వేణ్డ తిఱల్ విళఙ్గు మిలక్కుమనై ప్పిరిన్దాన్ తన్నై" (పెరుమాళ్. 10–8)** అను రీతిలో దుర్వాసముని మాటను అనుసరించి లక్ష్మణుడు తనను విడచిపోవుటచే, ఆ విశ్లేషమును తాళలేని శ్రీరాముడు మిక్కిలి దుఃఖించి, రాజ్యమును విడచి, తానుకూడ వైకుంఠమును చేరుటకు సిద్ధపడెను. అపుడు అయోధ్యానగరవాసులైన ప్రాణులన్నియు స్వామిని ప్రార్థించి, "నీవు ఎచటికి పోయెదవో, అచటికే మమ్ములనుకూడ తీసికొనిపోవలయును"అని వేడగా, శ్రీరాముడు వారి భక్తిప్రకర్షకు మెచ్చి, "అట్లే" అని పల్కి వానిని తనతో రమ్మని బయలుదేరెను. అపుడు చేతనాచేతన విభాగము లేక, అన్నియు శ్రీరాముని వెంబడించినవి. శ్రీరాముడు సరయూనదిలో మునిగి, వైకుంఠమును చేరినపుడు, తాము ను ఆ స్వామిని అనుసరించి ఆ నదిలో మునిగి, ప్రాణత్యాగమును చేసినవి. అపుడు శ్రీరాముని ఆజ్ఞానుసారము బ్రహ్మదేవుడు వానికి సత్యలోకమునకుపైన ఉన్నది, పరమపదమువలెనే తిరిగిరాని చోటును అగు సాంతానికమను లోకమును అనుగ్రహించెనను ఉత్తరరామాయణోదంత మిచట అనుసంధేయము. ఆ చేతనాచేతనములు వైకుంఠమును పొందినట్లే, నేను కూడ నీ కటాక్షమునకు పాత్రమై, వైకుంఠమును పొందలేకపోయితిని కదా!, ఆ సమయమున అయోధ్యలో నాకు జన్మ సంభవించునట్లు నీవు అనుగ్రహించియుండినచో సులభముగా నేను నీ పాదారవిందములను

చేరియుందునే! ఆ అదృష్టమును పొందలేకపోయితినే! నాకు ఆ అదృష్టమెప్పుడు కల్గునో కదా! అని కూరేశులు దుఃఖించుచున్నారు.

**(నిరర్గళవినిర్గళదంధకారైః)** – ఇచటి అంధకారశబ్దము ఆంతరతమస్సును – అనగా అజ్ఞానమును తెలుపును. అజ్ఞానము లేశమాత్రముగా ఉన్నను ఫలము సిద్ధింపదు. కావున భగవదనుగ్రహమువలన విశృంఖలముగా – అనగా పూర్తిగా అంతరించిన అజ్ఞానమును కల్గినవని అర్థము. జ్ఞానప్రసక్తియేలేని వృక్షాదులకు అజ్ఞానము అంతరించినదనుట ఎట్లు పొసగును? అనినచో, నామరూపవిశిష్టమైన సకలవస్తువులందును ఒక్కొక్క జీవాధిష్ఠానము కలదని శాస్త్రము చెప్పుచున్నది, కావున విరోధము లేదు అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వివరణము. ఇందులకు భట్టనాథసూక్తములోని **"పరుకు నీరుమ్ ఉడుక్కుమ్ కూఱైయుమ్ పావమ్ శెయ్దనదాన్కొలో!" (4-4-4)** అనునపుడు శ్రీమణవాళ మహామునుల వ్యాఖ్య అనుసంధేయము అని వారి సూక్తి. **"నిరర్గళవినిర్గళత్"** ఇత్యాదిసూక్తి భగవానుని నిర్హేతుకకృపావైభవమును సూచించుచున్నది.

భగవత్కృప సహేతుకమని తలచు వ్యాఖ్యాతలు – శ్రీరాముడు అయోధ్యను విడచి వనమునకు పోవునపుడు **"విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః, అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః, ఉపతప్తజలా నద్యః" (అయో.59-8)** అనునట్లు రామవిరహముచే వృక్షగుల్మతృణాదులు వాడినవని, నదులలోని నీరు తపింపబడినదని పల్కుటచే వాని ఆనుకూల్యసంకల్పము, రాముడు తిరిగి అయోధ్యకు వచ్చినపుడు **"అకాలఫలినో వృక్షాః" (యుద్ధ.120-19)** అని, **"సర్వర్తుఫలపుష్పాణి"** అని ఇత్యాదిగా ఆయా ఋతువులలో పూచి, ఫలింపని వృక్షములు మొదలగునవికూడ పూలు పూచి, ఫలించుటచే వాని ప్రాతికూల్యవర్జనమును వ్యక్తీకరింపబడినవని, దీనిని ఆధారముగాగొని భగవానుడు వానికి సద్గతి కల్గించెనని వివరించిరి. కాని, **"యే ధర్మ మాచరితు మభ్యసితుం చ యోగమ్ . . . పరగతిం గమితాః తృణాద్యాః"** ఇత్యాదిగానున్న 31వ శ్లోకములో తృణవృక్షాదులకు ఏ ధర్మమును ఆచరించుటకు, తెలియుటకు, అభ్యసించుటకును యోగ్యతలేదని తెలుపబడుటచే, నిర్హేతుకకృపాఫలముగానే వృక్షాదులు సద్గతిని పొందినవను పూర్వవివరణమే సరసతరమని సహృదయులు గమనింపగలరు.

**(వృక్షైః తృణై శ్చ)** – **"పుళ్ళాముదలా ప్పుల్లెఱుమ్బాది యొన్ఱిన్రియే" (తి.వా.7-5-1)** అను నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళ్రిసూక్తిని అనుసరించి ఈ ప్రయోగము చేయబడినది.

**(సులభమ్ సమయం వ్యతీతః)** – ఆ వృక్షతృణాదులలో నేను ఒకడనై జన్మింపలేకపోయితినే! అని భావము.

**(హా హంత హంత)** – భూరిదానకాలమున ఏమారిన వానికి పరీక్షించి దానముచేయుకాలములో ఏమి ప్రసక్తి? వృక్షాదులు ఏమి పుణ్యమును చేసినవని విచారింపకనే, వానికన్నిటికిని స్వామి సద్గతిని అనుగ్రహించినకాలమున అవకాశము పొందలేని నాకు పరీక్షించి,



మోక్షప్రాప్తిని అనుగ్రహించు ఈ కాలమున అట్టి అవకాశము లభించునా! అని తాత్పర్యము. **"భూరిదానేఽ ప్యలబ్ధధనస్య పరీక్షాదానే కా వా ప్రసక్తి రితి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. పూర్వశ్లోకమువరకు సౌలభ్యవాత్సల్య తరంగితమైన రామావతారమును అనుసంధించిన తరువాత, ఈ శ్లోకమున కూరేశులు ఆ అవతారకాలమున తాము జన్మించి, మనోరథమును పొందలేకపోయితినే! అని చింతించుచున్నారని రామానుజాచార్యవ్యాఖ్య. పూర్వార్ధమున పల్కిన తమకు భగవత్పాదపద్మములు అలభ్యములైనవనుటకు ఉపపత్తి ఉత్తరార్ధమున ఉత్ప్రేక్షింపబడుటచే, ఉత్ప్రేక్షవాచకము ఏదియు లేకుండుటచే ఆర్థికమైన ఉత్ప్రేక్ష.

**30. వంశం రఘో రనుజిఘృక్షు రిహావతీర్ణో**
**దివ్యై ర్వవర్షిథ తథాఽత్ర భవద్గుణౌఘైః ।**
**త్వత్సన్నిధిప్రభవశైత్యజుషో యథా హి**
**వృక్షా శ్చ తాంతి మలభంత భవద్వియోగే ।**

శ్రీరామా, రఘోః వంశం = రఘువంశమును, అనుజిఘృక్షుః = అనుగ్రహింప గోరినవాడవై, ఇహ = ఈ లోకములో, అవతీర్ణః = అవతరించిన, త్వం = నీవు, అత్ర = ఇచట, దివ్యైః = దివ్యములైన, భవద్గుణౌఘైః = నీగుణప్రవాహములతో, తథా = అట్లు, వవర్షిథ = వర్షించితివి, (ఎట్లనగా) – త్వత్సన్నిధి = నీ సన్నిధానము వలన ఏర్పడిన, శైత్యజుషః= చల్లదనమును పొందిన, వృక్షాః + చ = వృక్షములు కూడ, భవద్వియోగే = నీ విశ్లేషమునందు, తాంతిమ్ = మ్లానమును (వాడిపోవుటను), యథా = ఎట్లు, అలభంత = పొందినవో (అట్లు)

**"ప్రపన్నా దన్యేషాం న దిశతి ముకుందో నిజపదమ్"** అనునట్లు ప్రపన్నులు కానివారికి స్వామి మోక్షమివ్వడు కదా! ముఖ్యములైన మోక్షోపాయములు భక్తి ప్రపత్తులే కదా! అట్లయినపుడు వృక్షాదులకును శ్రీరాముడు ఎట్లు మోక్షమును అనుగ్రహించెను? అను ప్రశ్నను ఇందు కూరేశులు భగవద్విశ్లేషభీరుత్వరూపపరమభక్తిని వానికి కలుగజేసి, మోక్షమును అనుగ్రహించెననుచు సమాధానించుచున్నారు అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"పితృవచనపరిపాలనార్థమ్ అయోధ్యాం విహాయ రఘునాయకవనవాససమయే తత్రత్యాచేతనవృక్షాదిదశా మనుసంధత్తే"** – తండ్రిమాటను పాలించుటకై శ్రీరాముడు అయోధ్యను విడచి, వనవాసమునకు పోవునపుడు అచటి అచేతనములైన వృక్షాదులు పొందిన దశను అనుసంధించుచున్నారని రామానుజాచార్య వ్యాఖ్య.

రఘువంశమును అనుగ్రహింప నెంచి ఈ భూమిలో అవతరించిన నీవు నీ అప్రాకృత కల్యాణగుణములతో ఎట్లు వర్షించితివి? అనినచో – నీ వియోగము కల్గినపుడు ఎంతటి వర్షము కురిసినను అచటి వృక్షములు సైతము వాడిపోవు విధమున వర్షించితివి కదా! అని భావము.

శ్రీరాముడు వనమునకు వెడలిన పిమ్మట సుమంత్రుడు దశరథునితో – **"విషయే తే మహారాజ! రామవ్యసనకర్శితాః అపి వృక్షాః పరిమ్లానా స్సపుష్పాంకురకోరకాః, ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసి చ"** అనుచు శ్రీరాముని సన్నిధానమే ధారకముగా జీవించు వృక్షాదులు

ఆ స్వామి వియోగమువలన శుష్కించి, వాడిపోయినవనెను. **"నళ్వాలయోత్తియిల్ వాళ్గుమ్ శరాశరమ్ ముఱ్ఱవుమ్ నళ్వాలుక్కుయ్‌త్తనన్"** **(తి.వా.7-5-1)** అని ఆళ్వార్లును పల్కిరి. **"నళ్వాలుక్కు ఉయ్‌త్తనన్"** అనగా స్వసంశ్లేషసుఖమును కల్గించుటయే కదా!

ఇచట ఒక సందేహము. రామవధానంతరము శ్రీరాముడు అయోధ్యకు తిరిగివచ్చుచు దారిలో భరద్వాజాశ్రమమునకు వేంచేసెను. అపుడు భరద్వాజముని శ్రీరామునిచూచి, **"అహ మప్యత్ర తే దద్మి వరం శస్త్రభృతాం వర" (యుద్ధ.127-17)** అనుచు ఏదైన వరమును తనవలన పరిగ్రహింపవలసినదిగా వేడగా, శ్రీరాముడు **"బాఢ మిత్యేవ సంహృష్టో ధీమాన్ వర మయాచత, అకాలే ఫలినో వృక్షాః సర్వే చాపి మధుస్రవాః, ఫలాన్యమృతకల్పాని బహూని వివిధాని చ, భవంతు మార్గే భగవ న్నయోధ్యాం ప్రతిగచ్ఛతః" (యుద్ధ.120-19)** అనుచు తన విరహమువలన వాడిపోయిన వృక్షములు మరల చిగిర్చి పుష్పించి, ఫలింపవలెనని కోరెను. భరద్వాజముని **"తథాఽస్తు"** అని పలుకగా, అవి అట్లే అయ్యెను అని శ్రీరామాయణమున కలదు. తన సన్నిధానమువలననే సహజముగానే అట్టి ఫలము కలుగబోవుచుండగా, అందులకై రాముడు వరమును ప్రార్థించుట ఎందులకు? అనునది ఆ సందేహము. అవాప్తసమస్తకాముడైన, భగవానుడైన శ్రీరామునిచూచి ముని వరము వేడుమని పల్కెను. మహర్షిమాటను మన్నింపవలెనను ఉద్దేశ్యముతో ఏదో ఒక వరమును కోఱెను. **"మత్తః కి మపి కాంక్షధ్వమ్"** అని రుద్రుడు పల్కినపుడు **"తిరుమళ్ళిశైప్పిరాన్"** సూదిపోవు దారిలోనే దారముకూడ పోవునట్లు వరము నిమ్ము అని వేడినట్లుగానే శ్రీరాముడును తనకుతోచిన వరమును అడిగెనని సమాధానమును చెప్పనగును.

ఇక ఈ శ్లోకసారమేమనగా – **"పున ర్విశ్లేషభీరుత్వం పరమా భక్తి రుచ్యతే"** అని నిర్వచింపబడిన పరమభక్తిదశను వృక్షములకు కల్గించి స్వామి వానికి మోక్షప్రదానమొనర్చెనని. **"త్వత్సన్నిధిప్రభవశైత్యజుషః"** అని పల్కుటచే – **"జ్ఞానీ తు పరమైకాంతీ త్వదాయత్తాత్మజీవనః, త్వత్సంశ్లేషవియోగైకసుఖదుఃఖ స్తదేకధీః"** అని నిర్వచింపబడిన పరమైకాంతిలక్షణము వృక్షములకు కల్గెనని తెలుపబడినది. శ్రీరంగనాథుని పాదసంబంధమువలన సుఖము, ఆ సంబంధములేనిచో దుఃఖమును కల్గునని భక్తులు తలంతురనుచు – **"నిత్యం ముకుందపదసంగమవిప్రయోగౌ నిశ్చిన్వతే కృతధియః సుఖదుఃఖకాష్ఠామ్"** దేశికులు పల్కిన పాదుకాసహస్రసూక్తి స్మరణీయము. **"అభజంత"** ఇతి పాఠాంతరము కలదు. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో – **"రామవిరహకాలికయా గ్లాన్యా పరమా భక్తి స్సూచితా"** అని, **"వృక్షాణా మపి – పునర్విశ్లేషభీరుత్వం పరమాభక్తి రుచ్యత – ఇతి ఉక్తలక్షణాం పరమభక్తిం సంపాద్య, ముక్తిం ప్రాదాదితి సాంప్రదాయికో భావ స్సూచ్యతే"** అనియు వివరింపబడినది. **"దివ్యైః"** అనుటకు రామానుజాచార్యవ్యాఖ్యలో – **"సర్వప్రాణినా మాప్యాయకైః"** అని వివరింపబడినది. **"త్వత్సన్నిధిప్రభవశైత్య"** అనునపుడు **"త్వత్సన్నిధానేన ప్రభవం జాతం శైత్యమ్"** అని కర్మధారయముగాని, **"త్వత్సన్నిధేః ప్రభవః ఉత్పత్తిః యస్య తత్"** అని బహువ్రీహినిగాని చెప్పవచ్చునని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో చూపబడినది.



**31.** **యే ధర్మ మాచరితు మభ్యసితుం చ యోగం**
**బోద్ధుం చ కించన న జాత్వధికారభాజః ।**
**తేఽపి త్వదాచరితభూతలబంధగంధాత్**
**బంధాతిగాః పరగతిం గమితా స్తృణాద్యాః ॥**

యే తృణాద్యాః = ఏ తృణములు మొదలగునవి, ధర్మం = కర్మయోగరూప ధర్మమును, ఆచరితుం = అనుష్ఠించుటకు, యోగం = యోగమును, అభ్యసితుం చ = అభ్యసించుటకును, కించన = ఏదైన ఒక విషయమును, బోద్ధుం చ = తెలియుటకును, జాతు = ఏ సమయమునందైనను, అధికారభాజః = అధికారమును కల్గినవి, న = కావో, తే = ఆ తృణములు, అపి = కూడ, త్వత్ + ఆచరిత = నీవు సంచరించిన, భూతల = ప్రదేశములతో, బంధగంధాత్= సంబంధసంస్కారమువలన, బంధాతిగాః = కర్మబంధమును దాటినవై, పరగతిం = ఉత్కృష్టమైన గతిని, గమితాః = పొందింపబడినవి.

**"దేశోఽయం సర్వకామధుక్" (గారుడ)** అని, **"తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః" (రామా.ఆరణ్య.1-19)** అనియు చెప్పబడునట్లు భగవద్భాగవతులచే ఆదరింపబడిన దేశమునందు వాసముచేయుటకూడ భగవత్ప్రీతికరము కావున ప్రపత్తిలోకి చేరును. కావున అది సాధనకోటిలో అంతర్భవించును. అందుచే అదియే తృణాదుల ముక్తికి కారణమయ్యెనని కూరేశులు ఈ శ్లోకములో వచించుచున్నారు. కర్మజ్ఞానభక్త్యాదియోగములలో దేనినికూడ అనుష్ఠించు యోగ్యతలేని తృణాదులుకూడ నీవు సంచరించు దేశములో పుట్టుట అనుసంబంధమును కల్గినవగుటచే పరగతిని పొందినవని భావము.

**"పాఠక్రమా దర్థక్రమో బలీయాన్"** అను న్యాయమునుబట్టి శ్లోకములో జ్ఞానయోగమును తెలుపు **"బోద్ధుం చ కించన"** అను ప్రయోగమును ముందుగా, **"అభ్యసితుం చ యోగమ్"** అను భక్తియోగమును తెలుపు ప్రయోగమును పిమ్మటను అన్వయించి శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది. **"ధర్మ మాచరితుం . . . న జాత్వధికారభాజః"** అనుప్రయోగము ద్వారా **"ఉభయపరికర్మితస్వాంతస్య ఏకాంతికాత్యంతికపరభక్తియోగలభ్యః"** అనుచు తెలుపబడినరీతిలో కర్మయోగ, జ్ఞానయోగసహకృతమైన భగవల్లాభమునకు హేతువుగా చెప్పబడిన భక్తియోగము ఏమాత్రము తృణాదులకు లేదని, దేశవాసమువలననే పరగతి లభించెనని భావమనియు అందు వ్యాఖ్యానింపబడినది. రామానుజాచార్యవ్యాఖ్యలో – **"కించన ధర్మం బోద్ధుమ్, ఆచరితుమ్, అభ్యసితుం చ"** అని అన్వయించి, **"శ్రవణమననముఖేన ధర్మం బోద్ధుం నిర్ణేతుమ్, ధర్మ మితి బ్రహ్మతత్త్వస్యాప్యుపలక్షణమ్, పశ్చా దనుష్ఠాతుమ్, నిదిధ్యాసనాదిసిద్ధ్యర్థం చిత్తైకాగ్ర్యలక్షణం ప్రాణాయామాదిపరికరసహితం యోగం చాభ్యసితుమ్"** అని వ్యాఖ్యానింపబడినది. శ్లోకతాత్పర్యము **"పరంపరయాఽపి భగవదన్వయో చేతనానా మపి దుర్లభపదప్రాపక ఇతి భావః"** అనియు అందు వివరింపబడినది. (భగవానునితోగల పరంపరాసంబంధము అచేతనములకును దుర్లభమైన పరమపదమును పొందించునని భావము)

శ్లోకములో **"బోద్ధుమ్ చ"** అనునపుడు చకారమును అనుక్తసముచ్చాయకముగా గ్రహించి, శ్లోకములో చెప్పబడని ప్రపత్తిని చెప్పుచున్నదని భావింపవచ్చును. లేక, అధ్యవసాయ విశేషమైన శరణాగతి ప్రధానముగా మానసికమగుటచే బుద్ధ్యర్థకమైన **"బోద్ధుమ్"** అను పదముచే ఉపలక్షింపబడుచున్నదనియు చెప్పవచ్చును.

**(త్వదాచరితభూతలబంధగంధాత్)** – భగవానుడు అభిమానించి వసించిన దివ్యదేశములో నివసించుట ఉత్తమగతికి కారణమగుననుటను వాల్మీకిభగవానుడు చిత్రకూట **"సుభగశ్చిత్రకూటోఽసౌ . . . యస్మిన్ వసతి కాకుత్స్థః" (అయో. 98–12)** అనుచు, పర్వతములో శ్రీరాముడు నివసించిన సందర్భమును వర్ణించునపుడును, వేదవ్యాసమహర్షి భారతములో తీర్థయాత్రాపర్వమునందు గోమంతపర్వతమును వర్ణించునపుడు – **"యత్ర నారాయణో దేవః పరమాత్మా సనాతనః, తత్ పుణ్యం తత్ పరం బ్రహ్మ తత్ తీర్థం తత్ సనాతనమ్"** అనుచును తెలియజేసిరి అని వేరొక వ్యాఖ్య. **"త్వదాచరితభూతల"** అను ప్రయోగముద్వారా సదాచార్యులు నిర్దేశింపబడినట్లును చెప్పవచ్చునని ఇంకొక వ్యాఖ్య. **"పాపిష్ఠః క్షత్ర బంధుశ్చ ... ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్"** ఇత్యాదిప్రమాణములు ఇచట స్మరణీయములు.

**(బంధాతిగాః గమితాః)** – అనుటచే తృణాదులు తమ యత్నమేమియు లేకనే భగవద్భాగవతాభిమానమున ఒదిగియుండి, ముక్తిని పొందినవని తెలుపబడినది. ముదలియాణ్డాన్ "ఒక పర్వతమునుండి వేరొక పర్వతముపైకి లంఘించు సింహశరీరములో ఒదిగియున్న (మక్షికాది) అల్పప్రాణులవలె, శ్రీభాష్యకారులు సంసారసముద్రలంఘనము చేయగా వారితోకల సంబంధమువలన మనమును ఉత్తీర్ణులమైతిమి" అను పల్కిన వార్త ఇచట స్మరణీయము. **"బంధగంధాత్ బంధాతిగాః"** అనునపుడు అనుప్రాస కలదు.

**32.** **తాదృగ్గుణో నను బభూవిథ రాఘవత్వే**
**యస్తావకం చరిత మన్వహ మన్వభుంక్త ।**
**సోఽత్రైవ హంత! హనుమాన్ పరమాం విముక్తిం**
**బుద్ధ్యాఽవధూయ చరితం తవ సేవతేఽసౌ ॥**

స్వామీ!, రాఘవత్వే = శ్రీరామావతారములో, తాదృగ్గుణః నను బభూవిథ = అట్టి కల్యాణగుణములను కలవాడవు అయితివి కదా!, యః = ఏ, హనుమాన్ = హనుమంతుడు, తావకం = నీకు చెందిన, చరితం = చరిత్రను, అన్వహం = ప్రతిదినము, అన్వభుంక్త = అనుభవించెనో, సః అసౌ = ఆ ఈ హనుమంతుడు, అత్ర + ఏవ = ఇచటనుండియే, పరమాం = గొప్పదైన, విముక్తిం = మోక్షమునుకూడ, బుద్ధ్యా = తన మనస్సుతో, అవధూయ = తిరస్కరించి, తవ = నీ యొక్క చరితం = చరిత్రను, సేవతే = సేవించుచున్నాడు, హంత! = ఆహా! (ఆనందము!)

పలు మాటలేల ? పరమపదనాథునికంటె శ్రీరామునియందే కల్యాణగుణాధిక్యము



కలదనుచు, అందులకు కూరేశులు **"భావో నాన్యత్ర గచ్ఛతి"** అను హనుమద్వాక్యమును ఉపపత్తిగా సాయించుచున్నారు.

శ్రీరామచంద్రుడు అవతారసమాప్తి సమయమున తనతోపాటు పరమపదమునకు రావలసినదిగా హనుమంతుని పిలచెను. అందులకు అతడు **"స్నేహో మే పరమో రాజన్! త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తి శ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి" (ఉత్తర. 40–17)** అనుచు తాను ఈ లోకములోనే నిలచియుండి, శ్రీరాముని కల్యాణగుణానుభవమును చేయుదునేగాని తన మనస్సు పరమపదనాథునియందుకూడ ఆసక్తిలేదని పల్కి, తిరస్కరించెను. దీనివలన పరవాసుదేవునికంటె, **"పల్ వినైయేనై ఈర్‌కిన్ఱ గుణజ్ఞళ్" (తి.వా. 8–1–8)** అనునట్టి సౌలభ్య, సౌశీల్యకారుణ్యాదులగు ఆశ్రయణోపయోగి కల్యాణగుణములు రామావతారమున అధికముగా వ్యక్తమగుచున్నవని ఏర్పడుచున్నది. **"ఓవాత్తొయ్రిల్ శార్ఙ్గిన్ తొల్‌శీరై నన్నెఞ్జే ఓవాద వూణాక వుణ్" (పెరియతిరు–78)** అను నమ్మాళ్వార్లసూక్తి ఇచట స్మరణీయము.

**(రాఘవత్వే తాదృగ్గుణో నను బభూవిథ)** – పరమపదనాథునియందు సౌలభ్యాదిగుణసద్భావమాత్రమే తప్ప, అవి మిక్కిలిగా ప్రకాశించు అవకాశము లేదే! వాని కన్నిటికిని పూర్ణమైన భోజనము రామావతారములో కదా లభించినది. **"పరమపదనాథే గుణానాం సద్భావమాత్రమ్, విషయలాభనిబంధనవినియోగోఽత్రైవేత్యాధిక్యం ద్రష్టవ్యమ్"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. అందుచే **"తాదృగ్గుణః"** అనుటకు పరమపదనాథుని గుణములను మించిన గుణములను కలవాడవని తాత్పర్యము.

**(తావకమ్ చరితమ్)** – చరితశబ్దముచే గుణములనేకాక, స్వరూపరూపాదులను కూడ గ్రహింపనగును.

**(పరమాం విముక్తిం బుద్ధ్యాఽవధూయ)** – **"బహవో నృప కల్యాణగుణాః పుత్రస్య సంతి తే" (అయో. 2–26)** అనుచు అయోధ్యాపురజనులు శ్రీరాముని గుణకీర్తనలు చేయుట అట్లుండనిండు. హనుమానుని లోబరచుకొన్న స్వామి గుణముల మహిమ ఏమని వర్ణింపవలెను! **"కూడారై వెల్లుమ్‌శీర్"** అనునట్లు సౌలభ్యసౌశీల్యాదిగుణములతో అనుకూలురను, **"శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః" (యుద్ధ. 106–6)** అను రీతిలో వీర్యాది గుణములతో ప్రతికూలురను జయించు వీరుడగు శ్రీరామునియందున్న అత్యుత్కటమైన స్నేహభక్తుల కారణముగా, ఆ స్వామి గుణానుభవమును వీడి పరమపదమునకు పోవుటకు మనస్సు ఇష్టపడకుండుటను తెలుపునపుడు హనుమానుడు పరత్వముయొక్క పేరును కూడ ప్రస్తావించుట తనకు ఇష్టములేకుండుటచే **"అన్యత్ర"** అని పల్కెను. ఈ సందర్భములో తిరుప్పాణ్ ఆళ్వార్ల – **"ఎన్నరజ్ఞనై కణ్డకణ్‌గళ్ మఱ్ఱొన్ఱినైక్కాణావే" (అమలనాది)** అను సూక్తి స్మరణీయము. **"స్నేహో మే పరమః"** ఇత్యాది హనుమత్సూక్తిలో – **"పరమః స్నేహః"** అనుటచే పరభక్తి, **"నిత్యం ప్రతిష్ఠితః"** అనుటచే తదనువృత్తిరూప పరజ్ఞానము, **"నియతా భక్తిః"** అనుటచే పరమభక్తి అను భక్తియోగముయొక్క

మూడు విధములైన దశలును తెలుపబడినవి. **"అత్రస్నేహః పరమిత్యనేన పరభక్తిః, నిత్యం ప్రతిష్ఠిత ఇత్యనేన తదనువృత్తిరూపం పరజ్ఞానం, నియతా భక్తి రిత్యనేన పరభక్తి శ్చోక్తేతి రహస్యం. నాన్యత్ర గచ్ఛతి పరమపదనాథేఽపి న గచ్ఛతీత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఇరుళ్ తరుమాఞాలత్తుళ్ ఇనిప్పిఱవి యాన్ వేణ్డేన్" (తి.వా.10-6-1)** అని, **"ఉనైక్కాణ్బదోర్ అరుళ్ ఎనక్కరుళిదియేల్ వేణ్డేన్ మనైవాழ్క్కైయై"** అని, **"ఆదలాల్ పిఱవి వేణ్డేన్" (తిరుమాలై-3)** అనియు పల్కుచు మహనీయులు ప్రకృతిబంధమును వలదని, పరమపదమునకు పోవలెనని ఆశపడుచుండగా, హనుమానుడు ఇచటనే ఉండి నీ గుణానుభవమును చేయుదుననుట ఎంత ఆశ్చర్యము! అను భావము **"హంత"** అనుటచే ఏర్పడుచున్నది. ఈ పదము సంతోషమును వ్యక్తము చేయుచున్నదనియు చెప్పవచ్చును.

**(తవ చరితం సేవతే) –** అవతారకాలమునకు పిమ్మట కాయికకైంకర్యమును చేయవీలులేకుండుటచే మానసిక, వాచిక కైంకర్యమును చేయుచున్నాడని రామానుజాచార్యవ్యాఖ్య. **"వాఙ్మనసాభ్యాం సేవతే"** అని అచటి వివరణము. **"బుద్ధ్యా సేవతే"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్యలోని అన్వయము. మానసికానుభవమును చేయుచున్నాడని దీని భావము. దేశికులు సంకల్పసూర్యోదయములో **"స్వకల్పితరఘూద్వహప్రథనకేళిగాథాశతప్రయుక్తిపథశిక్షణ ప్రవణసిద్ధబృందాన్వితః"** అనుచు శ్రీరాముని వీరగాథలను కీర్తించుచు హనుమానుడు స్వామిని సేవించుచున్నాడనిరి.

**"రాఘవ! త్వం"** అను పాఠాంతరము మొదటి పాదము చివర కనుపించుచున్నది. **"రాఘవత్వే"** అను పాఠము **"రాఘవత్వేఽభవత్సీతా" (1-9-114)** అను విష్ణుపురాణ ప్రమాణానుసారియేకాక, 17వ శ్లోకములో కనుపించు **"రాఘవత్వే"** అను పాఠమునకు అనుకూలము. **"బహూ వో దుర్లభా శ్చైవ యే త్వయా కీర్తితా గుణాః, మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తై ర్యుక్త శ్రూయతాం నరః" (బాల.1-7)** అనుచు శ్రీరామాయణప్రారంభములో శ్రీరామునియొక్క మనుష్యత్వమునందలి పరత్వము శ్రీరామావతార ప్రమేయమని తెలుపబడినది. పరమపదములో దర్శించు పరత్వముతోపాటు, అచట దర్శించుటకు వీలుకాని సౌలభ్యాదులును శ్రీరామునియందు దర్శింపవీలగుటచే హనుమానుడు పరరూపమును త్రోసిరాజని, శ్రీరాముని మనుష్యత్వవిశిష్టపరత్వకల్యాణగుణానుభవమునే కోరుకొనెను.

**33.** **య స్త్వం కృతాగస మపి ప్రణతిప్రసక్తం**
**తం వాయసం పరమయా దయయా క్షమిష్ఠాః ।**
**తేనైవ మాదృశజనస్య మహాగసోఽపి**
**యుక్తం సమాశ్వసన మిత్యుపధారయామి ॥**

కృత + ఆగసమ్ + అపి = అపరాధియైయున్నను, ప్రణతిప్రసక్తమ్ = ప్రణామము చేయుటకు ఉద్యుక్తుడైన, తం = ఆ, వాయసం = కాకాసురుని, పరమయా = గొప్పదైన, దయయా = దయతో, త్వం = నీవు, యత్ క్షమిష్ఠాః = క్షమించితివి అనునది ఏది కలదో, తేన + ఏవ = దానిని గొనియే, మహాగసః = గొప్ప అపరాధియైన, మాదృశజనస్య + అపి = మావంటివారికిని, సమాశ్వసనమ్ = ఓదార్పు, యుక్తమ్ = తగును, ఇతి = అని, ఉపధారయామి = విశ్వసించుచున్నాను.

**"ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్" (కిష్కింధా.15-20)** అని వర్ణింపబడిన రీతిలో శ్రీరాముడు సకలకల్యాణగుణాకరుడైనను, **"వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్" (సుందర.38-34)** అని స్తుతింపబడిన కృపయే మహాపరాధము చేసినవారికిని రక్షకము అనుట ఇందలి ప్రధానాంశము.

చిత్రకూటపరిసరములో సీతాదేవి తానును కలసి జలక్రీడను సల్పిన పిమ్మట ముందు సీతాదేవి శ్రీరాముని ఒడిలో కొంతసమయము నిద్రించి సేదదీరెను. తరువాత స్వామి సీతాదేవి ఒడిలో నిద్రించెను. అపుడు ఇంద్రపుత్రుడగు జయంతుడు ఆసురప్రకృతి అగుటచే దేవరూపమును వీడి, కాకిరూపమును పొంది, సీతాదేవి జగజ్జనని అని తెలియక, ఆమె రూపసౌందర్యమునకు మోహితుడై, విపరీతబుద్ధితో ఆమెను సమీపించి, గాయపఱచెను. అంత శ్రీరాముడు కోపించి, కాకాసురునిపై బ్రహ్మాస్త్రప్రయోగమును చేసెను. ఎచటికి పోయినను ఆ అస్త్రము తనను వెంటాడుటచే, ఎచటను రక్షణపొందలేని కాకాసురుడు తన ప్రాణములను రక్షించుకొనుటకై రామునివద్దకే వచ్చి **"త మేవ శరణం గతః" (సుందర.38-33)** అనునట్లు శరణుజొచ్చెను. కాకాసురుని ఒకకన్ను బ్రహ్మాస్త్రమునకు ఎరగా అగునట్లుచేసి, అతని ప్రాణములను కాపాడిన స్వామియొక్క దయాళుత్వమును కూరేశులు ఇందు స్తుతించుచున్నారు. అంతఃపుర విషయమగు సీతాదేవిపట్ల అపచారపడి, ఆర్ద్రాపరాధియైన ఆ కాకాసురునికూడ క్షమించుటవలన మావంటివారి అపరాధములనుకూడ నీవు క్షమించుటలో కొఱతలేదు అని మేము నమ్ముటకొక ఆధారమును దర్శించితిమని భావము. **"అంతఃపురాపరాధవిధాయిని వాయసేఽపి నిర్నిరోధాం కృపావృత్తి మనుసంధాయ మహాపరాధినా మపి మహావిశ్వాసోఽభవతీతి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. **"తాదృశో వాయసస్య"** అను స్తోత్రములోని యామునసూక్తిని అనుసంధించుచు.

**(కృతాగసమ్ తమ్ వాయసమ్) – "తం వాయసమ్"** అను ప్రయోగము ఇచట చేయబడినది. ఇచటి **"తమ్"** సర్వనామపదము క్షమింపరాని నేరమును చేసినవాడు, **"స పిత్రా చ పరిత్యక్తః సురై శ్చ పరమర్షిభిః" (సుందర.38-33)** అనునట్లు అందఱిచే విడువబడినవాడు అను భావమును తెలుపును. కాకాసురవృత్తాంతము అరణ్యకాండ కథాసమయమున జరిగినదైనను, దీని ప్రస్తావన కిష్కింధాకాండలో రాముడు హనుమంతునకు సీతనుగూర్చి తన సందేశమును పల్కునపుడు, సుందరకాండలో సీత హనుమంతునితో పల్కునపుడును కనుపించుచున్నది. దివ్యసూరిప్రబంధములలో భట్టనాథులు తిరుమొழ்ழిలో మాత్రము – **"శిత్తిరకూటత్తిరుప్ప చ్చిఱుకాక్కై ములైతీణ్డ అత్తిరమే కొణ్డెఱియ అనైత్తులకమ్ తిరిన్దోడి, విత్తకనే! ఇరామా! ఓ! నిన్ అబయమ్"**

(3–10–6) అను సూక్తిలో, **"శిత్తిరకూడ పొరుప్పినిల్ ఉఱ్ఱవడివిల్ ఒరుకణ్ణుజ్కొణ్డ"** (2–6–7) అను సూక్తిలో ప్రస్తావింపబడినది.

ఈ కాకాసురుడు ఎవరు? అను విషయమున అభిప్రాయభేదములు కలవు. ఇంద్రపుత్రుడు జయంతుడు కాకిరూపమును పొందెనని కొందఱు వ్యాఖ్యానింపగా, శ్రీరామాయణములో ఈ విషయము లేనందున, మాంసలోలుపమైన ఏదో ఒక ఆసురమైన కాకి వచ్చి, సీతాదేవిని గాయపఱచెనని మాత్రమే అచట చెప్పబడినందున ఇది అంగీకార్యముకాదని దేశికుల భావము. **"నాత్ర జయంతః కాకతయా సమాగత ఇతి రామాయణోక్తమ్, న చాప్యపారమత్ మాంసాత్ భిక్షార్థీ బలిభోజనః, భక్షగృధ్నేన కాలేన దారితం తు స్తనాంతరమ్ – ఇత్యాది మాత్రవచనాత్. అతో వాలివదసౌ ఇంద్రజన్మా ప్రబలః కశ్చిత్ వాయసః"** అని వారి స్తోత్రరత్నభాష్యసూక్తి స్మరణీయము. అహల్యతో సంగమించుటకై ఇంద్రుడు కాకిరూపమును పొందినపుడు అతనికి కల్గిన సంతానమే ఈ కాకాసురుడని కొందరి అభిప్రాయము.

**(ప్రణతిప్రసక్తమ్) – "స తం నిపతితం భూమౌ" (సుందర.38–34)** అనురీతిలో శ్రీరాముని పాదసమీపమున పడుట ప్రణామము చేయుటకు ఉద్యమించుటవంటిదని భావము. **"త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త మేవ శరణం గతః" (సుందర.38–33)** అని చెప్పబడినరీతిలో ముల్లోకములను చుట్టి, తిరిగి రాముని వద్దకే వచ్చి శరణు వేడినవాడని భావమని సంస్కృతవ్యాఖ్య. ఋషి **"శరణం గతః"** అనుట శ్రీరామచంద్రుని అభిప్రాయానుసారమని ఆచార్యుల చమత్కారోక్తి. **"ప్రసక్తమ్"** అనునపుడు ఆదికర్మణి క్తప్రత్యయము వచ్చినదని, అందుచే కాకాసురుడు శరణాగతిని పూర్తిగా చేయలేదని అర్థమని వేరొక వ్యాఖ్య. **"ప్రణామోద్యోగ ఏవ కృత ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ప్రణత ఇతి దయాళుః" (స్తోత్రరత్న)** అను యామునసూక్తి ఇచట స్మరణీయము.

**(పరమయా దయయా క్షమిష్ఠాః) – "కృపయా పర్యపాలయత్" (సుందర.38–34)** అని, **"దేవ్యా కారుణ్య రూపయా"** అనియు గల సూక్తుల అర్థ మిచట అనుసంధేయము. స్వామి దయాగుణమే లక్ష్మీదేవిగా రూపుదిద్దుకొన్నదని, ఆ దయాస్వరూపిణియొక్క పురుషకారము కారణముగా కాకాసురుడు క్షమింపబడెననికదా సంప్రదాయార్థము. అయినచో స్వామి రక్షించినట్లు ఎట్లగును? అనినచో, స్వామికి విశేషణభూతయైన లక్ష్మీదేవివలన రక్షింపబడెననగా, స్వామిచే రక్షింపబడినట్లే కదా! కావున విప్రతిపత్తి లేదు. దేశికులును దయాశతకములో **"కృపే కాకస్యైకం హిత మితి హినస్తి స్మ నయనమ్"** అని పల్కుట, **"ఇవళ్ సన్నిధియాలే కాకమ్ తలైపెఱ్ఱతు"** అని ముముక్షుప్పడిలో శ్రీపిళ్లైలోకాచార్యులవారు సాయించుటయు స్మరణీయములు. **"పరమయా దయయా"** అనగా నిర్వ్యాజమైన, నిరవధికమైన కృపతో అని అర్థము. ఈ శ్లోకము **"రఘువర! యద భూ స్త్వం తాదృశో వాయసస్య ప్రణత ఇతి దయాళుః" (63)** అను యామునుల స్తోత్రరత్నసూక్తిని అనుసరించుచు రచింపబడినది అనుట స్పష్టము.



**34.** **సా పూతనా శకట మర్జునయో శ్చ యుగ్మం**
**బాల్యోచితాన్యపరచేష్టితవిష్ఫులింగే ।**
**యస్యాలభంత శలభత్వ మహో నిగూఢః**
**స త్వం వ్రజే వవృధిషే కిల కంసభీత్యా ॥**

యస్య (తవ) = ఎట్టి నీయొక్క, బాల్య + ఉచితాన్యపర = బాల్యమునకు తగినవి, ఇతరుల కొఱకైనవి అగు, చేష్టిత = లీలలు అను, విష్ఫులింగే = నిప్పుకణములయందు, సా = ఆ, పూతనా = పూతన అను రక్కసి, శకటమ్ = శకటాసురుడు, అర్జునయోః యుగ్మం చ = యమళార్జునమును, శలభత్వం = మిడతలగుటను, అలభంత = పొందిరో, సః త్వం = అట్టి విక్రమమునుకల నీవు, కంసభీత్యా = కంసునివలన భయముచే, నిగూఢః (సన్) = దాగినవాడవై, వ్రజే = రేపల్లెలో, వవృధిషే కిల = పెరిగితివి కదా!, అహో = ఆశ్చర్యము!

**"పృచ్ఛామి కించన"** అనుచు మొదలిడి ఇంతవరకు శ్రీరామావతార దివ్యలీలలను అనుభవించిన కూరేశులు ఇకపై ఇరువది అయిదు శ్లోకములో శ్రీకృష్ణావతారములోని అతిమానుషములైన దివ్యచరిత్రలను అనుసంధించుచున్నారు. కదలుటకుకూడ శక్తిలేని శైశవదశలోనే పూతనా శకటయమళార్జునములను నిర్జించిన నీవు కంసభయముతో రేపల్లెలో నందుని ఇంటిలో దాగియుండుట ఎట్లు సంభవము? అని ఆశ్చర్యపడుచు, మనసు నీరగునట్లు అభినివేశము పొందుట ఇందలి ప్రమేయము. **"పూతనాదినిరసనవత్ కంసనిరసనేఽపి బాల్యలీలయైవ కర్తుం శక్యే, తద్భయేనాన్యత్ర తిరోధాన మాశ్చర్యకర మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని వివరము.

**(సా పూతనా) – "సా"** అను సర్వనామమునకు **"తాయాల్ వన్ద పేయుయిరుమ్"** (1–5–6) అని, **"పేయ్త్తాయై ములైయుణ్డపిళ్లై తన్నై"** (2–5–4) అని తిరుమంగైయాళ్వార్ సాయించిన రీతిలో **"వ్రజం యశోదాకృతి రావివేశ"** అని దేశికులు పల్కినట్లును ఎవరును గుర్తింపని రీతిలో తల్లిరూపమున వచ్చిన పూతన అని భావము. లేక, తల్లిరూపమును దాల్చినను చంపుస్వభావము మాఱని క్రూరమైన మనస్సుకల పూతన అనియు అర్థము. లేక పిల్లలను చంపుటలో ప్రసిద్ధురాలైన అనియు అర్థము. **"సా శిశునిధనే ప్రసిద్ధా పూతనా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. తనను చంపుటకై అవతరించిన శ్రీకృష్ణుడు రేపల్లెలో రహస్యముగా పెరుగుచున్నాడని తెలిసిన కంసుడు ఆ శ్రీకృష్ణశిశువును వెదకి కనుగొని చంపుటకై పలువురు అసురులను ప్రయోగించెను. వారిలో పూతన అను రాక్షసి ఒకతె. అది చక్కని స్త్రీ రూపముతో రాత్రివేళ రేపల్లెకువచ్చి, అచట నిద్రించు చిన్ని కృష్ణుని ఎత్తుకొని, విషము పూసిన తన స్తన్యమును ఇచ్చి, చంపుటకు ప్రయత్నించెను. చిన్ని కృష్ణుడు ఆ రక్కసి స్తనములను చేతులతో బిగువుగాపట్టి, పాలు త్రాగురీతిలో దాని ఆయువును కూడ **"తస్యాః స్తనం పపౌ కృష్ణః ప్రాణైః సహ ననాద చ" (హరివంశ.53–3)** అను రీతిలో, **"పేయ్చ్చిపెరుములై యూడు ఉయిరైవఱ్ఱవాఙ్గి ఉణ్డవాయాన్"**

**(కలియన్.1-3-1)** అను రీతిలో పీల్చివేసెను.

**(శకటమ్)** – కావలిగా పెట్టిన శకటమునందు కంసుడు పంపిన ఒక అసురుడు ఆవేశించి, శ్రీకృష్ణునిపైకి వచ్చి, చంపబోయెను. స్తన్యము నిచ్చుటకు ఆలస్యమైనపుడు కోపించిన శిశువు కాళ్లను కదపు రీతిలో శ్రీకృష్ణుడు తన పాదములను మెల్లగాచాచి, ఆ శకటమును తన్ని భగ్నమొనర్చెను. **"కదాచిత్ శకటస్యాధః శయానో మధుసూదనః, చిక్షేప చరణావూర్ధ్వం స్తన్యార్థీ ప్రరురోద హ"** అని విష్ణుపురాణసూక్తి (5-6-1), **"కళ్ళచ్చకడుకలక్కళియ పక్షియన్న మెల్లడియాల్ పాయ్న్దపోదు"** అని భట్టనాథసూక్తి (2-2-4) స్మరణీయములు.

**(అర్జునయో శ్చ యుగ్మమ్)** – చిన్నికృష్ణుని ఆగడములకు వేగలేని యశోద అతని నడుముకు దారమునుకట్టి, రోలుకు బిగించి కట్టెను. కృష్ణుడు ఆ రోటిని లాగికొనుచు, దోగాడుచు, అచటికి సమీపములోనున్న రెండు మద్దిచెట్లనడుమ పోయినపుడు, రోలు ఆ రెండు చెట్లమధ్యలో అడ్డుపడెను. దానిని స్వామి బలముగా లాగగా, ఆ రెండు చెట్లు నేలకూలెను. నలకూబరుడు, మణిగ్రీవుడు అను కుబేరుని పుత్రులు నారదశాపవశముచే రెండు మద్దిచెట్లుగా మారెనని పురాణకథనమైనను, కంసునిచే ఆదేశింపబడిన ఇద్దఱు అసురులు వానియందు ఆవేశించియుండిరని దివ్యసూరుల సూక్తి. **"పాయ్మ్మామరుదాన అశురరైప్పొన్రువిత్తిన్ల నీవన్దాయ్"** (3-1-3) అని కదా పెరియాళ్వార్ల సూక్తి. భగవద్రామానుజులును గీతాభాష్యారంభమున – **"పూతనాశకటయమళార్జునారిష్టప్రలంబధేనుకకాళియ . . . కంసాదీన్ నిహత్య"** అని సాయించిరి.

పూర్వము తెలుపబడిన పూతనాశకటయమళార్జునములను సంహరించుట కొఱకుగా భగవానుడు చేసిన ప్రయత్నమేమియు లేదు. పాలుతాగు భావనతో పూతనను, పాలకొఱకు ఏడ్చెడి భావనలో శకటాసురుని, ప్రాకి పోయెడి భావనలో మద్దిచెట్లను సంహరించెనేగాని, ప్రత్యేకముగా ప్రయత్నమేమియు చేయలేదు. కాని, ఈ అన్యపరచేష్టలను విస్ఫులింగములుగా ఇచట కూరేశులు పల్కుట – పిమ్మటనున్న శలభత్వరూపణమునకు అనుగుణమని తెలియనగును. పూతనాదులు దీపములో మిడుతపడిన చందమున నశించిరని తాత్పర్యము.

**(స త్వం కంస భీత్యా వ్రజే వ్యవృధిషే కిల)** – **"ఒళిత్తువళర"** అను తిరుప్పావై ప్రబంధములోని సూక్తిని అనుసరించి ఇట్లు కూరేశులు పల్కిరి. పూతనాదినిరసనమువలెనే కంస నిరసనమునుకూడ శైశవదశలోనే అవలీలగా చేయగల్గిన నీవు అతనికి భయపడి, రహస్యముగా పెరుగుట ఆశ్చర్యకరముగానున్నది అని భావము. **"విస్ఫులింగే"** అను ప్రయోగము **"శకడముమ్ కాలినాల్ తుఞ్జ వెన్ద శుడరాళియాన్" (కలియన్.5-4-6)** ఇత్యాది సూక్తుల అనుగుణమని చెప్పనగును. శ్లోకములోని చకారము ఇచట ప్రస్తావింపబడని పలు శ్రీకృష్ణుని అద్భుత అతిమానుషబాల్యక్రీడలను ఉపలక్షించును. **"కిల"** అనునది పారమార్థ్యమును తెలుపును. నందవ్రజములో పెరుగుట భయమువలన కాదు, అచటి వారిని అనుగ్రహించుట కొఱకే అని భావమని గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్య. **"కిలశబ్దః పారమార్థ్యే, తస్మాద్వ్రజే వాసో న భీతిప్రయుక్తః,**



**తత్రత్యానా మనుగ్రహార్థ మితి భావః"** అని అందలి వివరణ వాక్యము.

35. **పశ్యత్సు సూరిషు సదా పరమం పదం తే**
**దేవ్యా శ్రియా సహ వసన్ పరయా విభూత్యా ।**
**యోగేన యోగనిరతైః పరిమృగ్యమాణః**
**కిం త్వం వ్రజేషు నవనీత మహో వ్యముష్ణాః ॥**

స్వామీ!, తే = నీ యొక్క, పరమం పదం = పరమపదమును, సూరిషు = నిత్యసూరులు, సదా పశ్యత్సు = ఎల్లప్పుడు దర్శించువారుకాగా, పరయా = గొప్పదైన, విభూత్యా = విభూతితో (కూడినవాడవు), శ్రియా దేవ్యా సహ = లక్ష్మీదేవితో పాటు, వసన్ = నివసించువాడవు, యోగనిరతైః= యోగాభ్యాసనిష్ఠులైన వారిచే, యోగేన = ధ్యానమార్గముచే, పరిమృగ్యమాణః = వెదుకబడుచున్నవాడవైన, త్వం = నీవు, వ్రజేషు = రేపల్లెలోని ఇండ్లలో, నవనీతం = వెన్నను, కిం వ్యముష్ణాః = ఏల దొంగిలించితివి, అహో = ఆశ్చర్యము!

శ్రియఃపతివై, నిత్యసూరిసేవ్యుడవై, యోగిధ్యేయుడవైన నీవు రేపల్లెలో వెన్నను దొంగిలించుట ఎంత ఆశ్చర్యకరము! ఇది ఏమి అద్భుతలీల! అని కూరేశులు విస్మయపడుట ఇందలి విషయము.

**(పశ్యత్సు . . . పరమం పదం)** – **"తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః" (విష్ణు.సూక్తం.)** అను వేదవాక్యమిచట స్మరణీయము. అందలి పదములు యథాతథముగ ప్రయోగింపబడిన సొబగు గమనింపతగినది. ఇట్టి ప్రయోగవైచిత్రి వైకుంఠస్తవాదులలో పలుచోట్ల కాననగును.

**(దేవ్యా శ్రియా సహ వసన్)** – **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే"** అని, **"ఒణ్డొళియాళ్ తిరుమకళుమ్ నీయుమేనిలానిఱ్ప" (తి.వా.4-9-10)** అనియు గల సూక్తుల అర్థమిచట అనుసంధింపనగును. శేషపర్యంకములోనుండి అను అర్థమిచట ఆక్షిప్తము.

**(పరయా విభూత్యా)** – ఉభయవిభూతులతోకూడినవాడవై అని అర్థము. **"పాఙ్గోదమ్ శూళ్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ద వెమ్బెరుమాన్" (నాచ్చియార్.11-3))** అను గోదాసూక్తసూక్తిని స్మరింపనగును. నీవు దొంగిలించుటను చూచినచో నీ దేవేరి **"నప్పిన్నై కాణిల్ శిరిక్కుమ్" (పెరియా.2-4-9)** అనునట్లు నవ్వదా? కోపింపదా? అనియు హార్దభావము.

**(యోగేన యోగనిరతైః పరిమృగ్యమాణః)** – యోగులచే యోగాభ్యాసముద్వారా వెదుకబడుచున్నవాడను అర్థమిచ్చు **"పరిమృగ్యమాణః"** అను వర్తమానకాలికపదప్రయోగమువలన వెదకుచున్నను, సాక్షాత్కారమును పొందలేదని వ్యక్తమగుచున్నది. **"పరిమృగ్యమాణః న తు సాక్షాత్కృత ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. **"న తే విష్ణో! జాయమానో న జాతో దేవ! మహిమ్నః పర మంత మాప"** (విష్ణుదేవా! నీ మహిమయొక్క అంతమును చూచినవాడెవ్వడు

లేదు. అట్టివాడు పుట్టలేదు, పుట్టబోడు) అను మొదలగు ప్రమాణములు ఇచట గుర్తుకు తెచ్చుకొననగును. పరమాత్మవైభవము **"పెణ్ణులామ్ శడైయినానుమ్ పిరమనుమ్ ఉన్నైక్కాణ్బాన్" (తిరుమాలై-44)** అను భక్తాంఘ్రిరేణుసూక్తి, **"అలరెడుత్త వణ్ణత్తాన్ మామలరాన్ వార్శడైయాన్ ఎన్నివర్క్కు ఎణ్ణత్తానామో"** అను పేయాళ్వార్ల సూక్తి. **"న యస్య రూపం న బలప్రభావౌ న చ స్వభావః పరమస్య పుంసః, విజ్ఞాయతే శర్వపితామహాద్యైః"** అను విష్ణుధర్మసూక్తి మొదలగునవి భగవానుని గొప్పతనమును బ్రహ్మరుద్రాదులకును తెలియవీలుకానిదని చెప్పుచున్నవి కదా!

**(కిం త్వం వ్రజేషు నవనీత మహో వ్యముష్ణాః)** – **"నవనీతమ్"** అనగా కొత్తగా తీయబడినదని అర్థము. గోవునుండి పాలను తీయుట మొదలు, వెన్నను తీయువరకు తొమ్మిది దశలుండుటచే దీని కట్టి పేరు కల్గినదట. నిత్యసూరులచే సేవింపబడువాడవు, యోగులకును సాక్షాత్కరింప చేసికొనుటకు వీలుకానివాడవగుట, రేపల్లెలోని జనుల కంటికి కన్పించువాడవగుట పరస్పరవిరుద్ధములు, ఉభయవిభూతి నాయకుడవగుట, లక్ష్మీనాథుడవైన నీవు రేపల్లెలో వెన్నను దొంగిలించుటయు పరస్పరము విరుద్ధములని భావమని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. దాగియున్నవానికి, ఒంటరిగానున్నవానికి, దరిద్రునకు, ఎవరు చూచువారు (సాక్షి) లేనివానికిని దొంగతనము చేయుట తగును. నీవు అట్టివాడవు కావు. **"పశ్యత్సు సూరిషు"** అనుటచే ఒంటరిగా లేవు. ఏకాకిని కావు, నిన్ను చూచు సాక్షులు పలువురు కలరు. **"దేవ్యా శ్రియా  సహ వసన్"** అనుటచే లక్ష్మీయుక్తుడవు కావున దరిద్రుడవు కావు, కావున నీవు వెన్నను దొంగిలించుట తగదని ధ్వని, నీ సౌశీల్యము, సౌహార్దమును పరత్వమును మించినవై, నిన్ను కూడ వ్యామోహము కల్గునట్లు చేయుచున్నవని భావము. అని గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్య **"ప్రచ్ఛన్నస్యైకాకినో, దరిద్రస్య, పరామర్శశూన్యస్య చౌర్య ముచితమ్, తద్విసదృశస్య తవ తు నోచితమితి ధ్వనిః, త్వదీయం సౌశీల్యం, సౌహార్దం చ పరత్వ మతిక్రమ్య త్వా మపి విమోహయతీతి హృదయమ్"** అని అచటి వివరణము. ఈ వ్యాఖ్యలో శ్లోకము చివర – **"అహో అముష్ణాః"** అను పాఠము కలదు. కూరేశులు ఈ శ్లోకమును – **"శూట్టునన్మాలైకళ్ తూయనవేన్ది . . ." (తిరువిరు–21)** ఇత్యాది పాశురభావమును దృష్టిలోనుంచుకొని సాయించి యుండవచ్చునని కొందఱి వ్యాఖ్యానము. రేపల్లెలోని వారికి కన్పించుటచే సౌశీల్యము, వారితో కలసియుండి, వారి మనస్సుకు సంతోషమును కల్గించుటచే సౌహార్దమును ఇందు వ్యక్తములగుచున్నవి. **"సూరిసేవ్యత్వం యోగిధ్యేయత్వం చ వ్రజజన సాక్షాత్కార్యత్వేన విరుద్ధమ్, ఉభయవిభూతినాయకత్వశ్రియఃపతిత్వే నవనీతచౌర్యేణ విరుద్ధే ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**36.** **యం దుర్గ్రహం సుమనసో మనసాఽపి నిత్యం**
**బంధచ్ఛిదం పరమ మీశ ముదాహరంతి ।**
**దామ్నా నిబద్ధ ఇతి శుశ్రుమ తం భవంతం**
**నాలం బభూవిథ బత! శ్లథనాయ తస్య ॥**

యం (భవంతమ్) = ఎట్టి నిన్ను, సుమనసః = పరిశుద్ధమైన అంతఃకరణమును



కలవానియొక్క, మనసా + అపి = మనస్సుచేతకూడ, నిత్యం = ఎల్లప్పుడు, దుర్గ్రహం = గ్రహింప సాధ్యము కానివాడవుగా, బంధచ్ఛిదం = (సాంసారిక కర్మ) బంధమును పోగొట్టువాడవుగా, పరమమ్ ఈశమ్ = పరమేశ్వరునిగా, ఉదాహరంతి (వైదికులు) పల్కుచున్నారో, తమ్ భవంతమ్= అట్టి నిన్ను, దామ్నా = తాడుతో, నిబద్ధః = కట్టబడినవాడవు, ఇతి = అని, శుశ్రుమ = వింటిమి, తస్య = ఆ బంధము యొక్క, శ్లథనాయ = విడిపించుకొనుటకు, అలం న బభూవిథ = అసమర్థుడవైతివా!, బత = ఆశ్చర్యము!

**"దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే, యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచల చేష్టిత" (విష్ణు.5–6–14)** ఇత్యాదిగా పురాణములలో, **"కణ్ణినున్ శిఱుత్తాம்బినాల్ కట్టుణ్ణపణ్ణియ పెరుమాయన్"** ఇత్యాది దివ్యసూరిసూక్తులలో ప్రస్తుతింపబడిన దామోదరబంధనవృత్తాంతమందు తమకు గల అభినివేశాతిశయమును కూరేశులు ఇందు వ్యక్తీకరించుచున్నారు.

నీవు పరిశుద్ధాంతఃకరణులైన మహాత్ములకును మనస్సుతోనైనను ఏనాడును పొందుటకు శక్యము కానివాడవు, సంసారబంధమును ఛేదించువాడవు, పరమేశ్వరుడవు అని వేదవిదులు పల్కుచున్నారు. అట్టి నీవు యశోదచే దారముతో కట్టబడితివి అని వింటిమి. నీవా బంధమును తొలగించుకొనలేనివాడవైతివా! ఏమి ఆశ్చర్యము! నీ సౌలభ్య, సౌశీల్యము లెంత గొప్పవో కదా! స్వామీ! అని భావము.

ఎట్టి మనస్సుకు అయినను అందనివాడవు అని పలు ప్రమాణములచే తెలుపబడువాడవగు నీవు ఒక అబలచేతిలో కట్టుబడియుండుట, అందఱి కర్మబంధమును ఛేదింపగల నీవు చిన్న దారమునకు బద్ధుడవగుట, సర్వశక్తుడగు నీవు ఆ బంధమును తెంచుకొనలేక అశక్తునివలె వెక్కివెక్కి ఏడ్చుటయును ఆశ్చర్యతమములని కూరేశుల హృదయము.

**(సుమనసః)** – ఇచట మంచిమనస్సు అనగా **"ఉభయపరికర్మితస్వాంతస్య"** అనునట్లు కర్మయోగజ్ఞానయోగములచే పరిష్కృతమైన మనస్సు అని భావము. **"అమరర్క్కరియవిత్తకన్" (తి.వా.1–3–1)** అను మొదలగు దివ్యసూరిసూక్తులనుబట్టి దేవతలు అను అర్థమునను అనుసంధేయము.

**(మనసాఽపి దుర్గ్రహమ్)** – **''ఇదమిత్థంత్వప్రసంఖ్యానపరాఙ్ముఖమ్'' (శ్రీరంగరాజపూర్వ.)** అనునట్లు మనస్సుతోకూడ ఇతడు, ఇట్టివాడని స్వరూపస్వభావములను పరిచ్ఛేదించి తెలిసికొనుటకు వీలుకానివాడు అని అర్థము. **"పరిచ్ఛిద్య జ్ఞాతు మశక్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"మాం తు వేద న కశ్చన" (భ.గీ.7–26)** అని కదా భగవానుని సీతావచనము.

**(బంధచ్ఛిదమ్)** – **"యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః" (కేన.2–3)** అను శ్రుతి ప్రకారము భగవానుడు అపరిచ్ఛిన్నస్వరూపమును, స్వభావమును కలవాడని తెలిసి,

ఆ విధముగా ఉపాసించువారి కర్మబంధమును తొలగించువానిని అని భావము. **"పఱ్రిత్తిట్ట ఇన్బప్పయన్ పఱ్ఱఱుత్తు ప్పణితేత్తవల్లార్ తుయరాయవెల్లామ్ ఒఱ్రిత్తిట్టు అవరై త్తనక్కాక్కవల్ల పెరుమాన్"** అను పరకాలసూరి సూక్తి (10-6-6) ఇచట అనుసంధేయము. **"దామోదరం బంధగతః స్మరేత్"** అను సూక్తిభావముకూడ భావింపతగినది.

**(పరమమ్ ఈశమ్) – "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" (శ్వేతా.6-7)** అని, **"సర్వలోకమహేశ్వరమ్" (భ.గీ.5-29)** అనియుగల పలు ప్రమాణముల అర్థము ఇచట అనుసంధింపబడినది. తాము ఈశ్వరులమను ఈశ్వరత్వదురభిమానము కలవారికిని ఈశ్వరుడని భావము. గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో **"నిత్యమ్"** అను పదము వేరొక విశేషణముగా గ్రహింపబడి, దానికి **"శాశ్వతమ్"** అను అర్థము చూపబడినది. అట్లే, **"శుశ్రుమ"** అను క్రియాపదము చివరలో, అనగా, **"శ్లథనాయ నాలం బభూవిథ ఇతి శుశ్రుమ"** అని అన్వయింపబడినది. తాము ఈ వృత్తాంతమును సాక్షాత్తుగా విన్నను, నేరుగా దర్శించినవారిచే వివరింపబడుటను ఉద్దేశించి **"పరోక్షే లిట్"** అను రీతిలో **"శుశ్రుమ"** అని లిట్ప్రయోగమును చేసిరి. ఇది **"ఇతి శుశ్రుమ పూర్వేభ్యోఽయే న స్తద్ వ్యాచక్షిరే"** అను ఉపనిషద్వాక్యమును అనుసరించి చేయబడినది అని వ్యాఖ్యానాంతరము. **"సుమనసః"** అనుటకు బదులు **"ప్రమనసః"** అను పాఠాంతరము కలదు. **"దుర్గ్రహస్య సమర్థస్య బంధమోచకస్య గ్రహణం, బంధనం తదమోచనం చాయుక్త మితి భావః, తవ సౌహార్ద మేతాదృశ మితి హృదయమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"యోగిమనో దుర్గ్రహస్య, సంసారబంధమోచకస్య దామబంధనమోచనాసామర్థ్యం చాశ్చర్యకర మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము. శ్లోకములోని ఉత్తరార్ధమున **"ఉరవిడైయాప్పుణ్డు ఎత్తిఱమ్ ఉరలినోడు ఇణైన్దిరున్దేఙ్గియ వెళివే" (తి.వా.1-3-1)** ఇత్యాది దివ్యసూక్తుల భావము ప్రస్తుతింపబడినది. తాను పుట్టిన రాత్రియందే **"తన్దైకాలిల్ పెరువిలఙ్గు తాళవిఙ్గ నళ్ళిరుట్కణ్ వన్ద" (కలియన్.7-5-1)** అనునట్లు పుట్టినవెంటనే తండ్రి బంధములను తొలగించిన వాడైనను, **"స హి బంధు రిత్థా" (విష్ణుసూక్తం.)** అనునట్లు అతడే బంధించువాడు, బంధవిముక్తిని కల్గించువాడైనను, చిన్నతాటితో రోటికి కట్టిన బంధమునుకూడ ఇతడు తొలగించుకొనలేక వెక్కి వెక్కి ఏడ్చెనా ? ఏమి స్వామి సౌలభ్యము అని అచ్చెరువొందుచున్నారు.

**37.** **ఐశం హి శైశవ మపి వ్యతివేలఖేలం**
**యత్పూతనా శకట మర్జునయో శ్చ యుగ్మమ్ ।**
**బాల్యోచితాన్యపరసాచివిచేష్టితేన**
**హంతాలభంత శలభాయిత మోజస స్తే ॥**

యత్ = ఏ కారణముచే, పూతనా = పూతన, శకటమ్ = శకటాసురుడు, అర్జునయోః యుగ్మం చ = యమళార్జునములును, (నీ యొక్క), బాల్య + ఉచిత + అన్యపరసాచివిచేష్టితేన= బాల్యమునకు తగినదిగా, అన్యపరత్వమైనదిగా, యాదృచ్ఛికముగానున్న ఏ లీలచే, తే = నీ



యొక్క, ఓజసః = ప్రతాపమునకు, శలభాయితమ్ = మిడతగా అగుటను, అలభంత = పొందిరో, (అందుచే) ఐశమ్ = సర్వేశ్వరునకుచెందిన, శైశవమ్ = బాల్యము, అపి = కూడ, వ్యతివేల = అవధిలేని, ఖేలం = లీలలను కల్గినది, హి = కదా!, హంత = ఆశ్చర్యము.

**"సా పూతనా శకటమ్"** ఇత్యాదిగా 34వ శ్లోకములో తెలిపిన అర్థమే ఈ శ్లోకమునుండి అయిదు శ్లోకములలో వివరింపబడుచున్నది. స్వామి పూతనాశకటయమళార్జునములను నిరసించినది యౌవనప్రాదుర్భావదశలో కాక, శైశవదశలో అగుటచే పరమపురుషుని శైశవము కూడ పరమభోగ్యమనుచు కూరేశులు ఆశ్చర్యపడుచున్నారు.

భగవానుని బాల్యలీలచేతనే పూతన, శకటాసురుడు, యమళార్జునములు మొదలగు దుష్టప్రకృతులు అగ్నిలోపడిన మిడతలవలె నశించినవి. దీనినిబట్టియే ఇతడు సర్వేశ్వరుడని వ్యక్తమగుచున్నది. భగవానుని అతివేలములైన, యాదృచ్ఛికములైన బాల్యలీలలుకూడ పరమాత్మ సర్వేశ్వరత్వమును స్పష్టీకరించునవి అని భావము.

**"సాచి"** అను పదము అడ్డముగా అని అర్థము, **"తిర్యక్ సాచి రపి స్త్రియామ్"** అని ముకుటవచనమునుబట్టి ఈ పదము స్త్రీలింగములోకూడ కలదు. యాదృచ్ఛికముగా కొంచెముగా, వక్రముగా అనియు గల మూడు అర్థములు ఇచట అన్వయింపతగినవి. **"శలభాయిత"**మనగా, శలభత్వము – మిడతగా అగుట అని భావము. **"హంత"** అనునది హర్షమును తెలుపుననియు చెప్పవచ్చును.

**38.** **సత్యేవ గవ్యనివహే నిజధామ్ని భూమ్నా**
**పర్యంతసద్మసు కి మర్థ మచూచుర స్త్వమ్ ।**
**ముష్ణం శ్చ కిం వ్యజఘటో ఘటశేష మగ్రే**
**గోపీజనస్య పరిహాసపదం కి మాసీః ॥**

నిజధామ్ని = స్వగృహములో, గవ్యనివహే = పాలు, పెఱుగు, వెన్న వంటి ద్రవ్యరాసులు, భూమ్నా = అధికముగా, సతి + ఏవ = ఉండగానే, పర్యంతసద్మసు = దగ్గరలోని ఇండ్లలో, త్వం= నీవు, కి మర్థం = ఎందులకు, అచూచురః = నవనీతాదులను దొంగిలించితివి?, ముష్ణన్+ చ = దొంగిలించువాడవు అయినను, ఘటశేషమ్ = భుక్తశేషమైన పాత్రను, అగ్రే = అందఱి ఎదురుగా, కిం వ్యజఘటః = ఎందులకు పగులగొట్టితివి?, గోపీజనస్య = గోపవనితల, పరిహాసపదం = వేళాకోళమునకు విషయము, కిమ్ ఆసీః = ఎందులకు అయితివి?

నీ ఇంటిలో సమృద్ధిగా నవనీతాదులు ఉండగా, ఇరుగుపొరుగుఇండ్లలో ఏల దొంగిలించితివి? దొంగిలించితివిపో, వానిని, ఆరగించిన పిమ్మట రిక్త భాండములను ఏల అందఱి కన్నులముందు పగులగొట్టితివి? గోపికలు వేళాకోళము చేయునట్టి స్థితి నీకు ఏలనయ్యా! స్వామీ! ఇది అంతయు నీ విచిత్ర, అతిమానుషలీలావ్యాపారమే కదా అని తాత్పర్యము. **"కృత్స్నస్యాపి లీలైవ ప్రయోజన మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

(సత్యేవ . . . భూమ్నా) – **"అమ్బరమే తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్ ఎమ్బెరుమాన్ నన్దగోపాలా" (తిరుప్పావై-17)** అను రీతిలో ధారకపోషకభోగ్యములను అన్నిటిని సమృద్ధిగా అనుగ్రహించు సంపదను పూర్ణముగాకల నందుని పుత్రుడవై పుట్టిన నీవు అచట పాలు, పెఱుగు, వెన్న మొదలగు వానికి కొఱతఉండినకదా దొంగతనము చేయవలెను! **"ఏఱ్ఱకలఙ్గళ్ ఎదిర్పొఙ్గి మీదళిప్ప మాఱ్ఱాదే పాల్ శొరియుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్ ఆఱ్ఱప్పడైత్తాన్ మకన్" (తిరుప్పావై-21)** కదా నీవు.

(పర్యంతసద్మసు కి మర్థ మచూచరః) – **"వైత్తనెయ్యుమ్ కాయ్న్దపాలుమ్ వడితయిరుమ్ నఱువెణ్ణెయుమ్ ఇత్తనైయుమ్ పెఱ్ఱఱిలే నెమ్బిరాన్ నీపిఱన్దపిన్నై" (పెరియా.2-2-2)** అని యశోద పల్కునట్లు నీ ఇంటిలోని గవ్యములను అన్నిటిని పూర్తిగా ఆరగించినను, అందఱితో తనివి తీరలేదా!, పక్క ఇండ్లలో దూరి, దొంగిలించితివా? ఇది ఏమి? **"ఉరువవైత్త కుడత్తొడు వెణ్ణెయ్ ఉఱిచ్చి ఉడైత్తిట్టు పోన్దునిన్ఱాన్" (పెరియ.2-9-3)** అని, **"పిన్నుమ్ అకమ్ పుక్కు ఉఱియై నోక్కిప్పిఱఙ్గొళి వెణ్ణెయుమ్ శోదిక్కిన్ఱాన్" (పెరియా.2-9-9)** అనియును పల్కునట్లు, పలుమార్లు ఇరుగు పొరుగుఇండ్లవారు **"ఉన్ మకనైక్కూవిక్కొళ్ళాయ్" (పెరియా.2-9-9)** అనుచు యశోదవద్ద మొఱపెట్టునట్లు నీవు చేయు ఈ గవ్యచౌర్యమేమి?

(ఘటశేష మగ్రే కిం వ్యజఘటః) – దొంగిలించుటతో ఊరుకొనకుండ, **"వెణ్ణెయ్ విఙ్గి వెఱుఙ్కలత్తై వెప్పిడై ఇట్టు అదనోశై కేట్కుమ్" (పెరియా.2-9-1)** అని, **"తారార్ తడన్దోళ్కళ్ ఉళ్ళళవుమ్ కైనీట్టు ఆరాదవెణ్ణెయ్ విఙ్గి అరుకిరున్ద మోరార్ కుడమురుట్టి" (శిఱియ తిరుమడల్)** అనియు కీర్తించురీతిలో ఘటశేషమును అందఱిముందు పగుటగొట్టుట ఏమి? ఘటశేష మనగా ఘటమాత్రశేషము, మొత్తము వెన్న ఆరగింపగా మిగిలిన ఖాళీకుండను అని అర్థము.

(గోపీజనస్య పరిహాసపదం కి మాసీః) – **"పానైయిల్ పాలైప్పరుకి పఱ్ఱాదార్ ఎల్లామ్ శిరిప్ప" (పెరియా.2-7-1)** అని, **"నాణిత్తనైయు మిలాదాయ్! నప్పిన్నైకాణిల్ శిరిక్కుమ్"** అని, **"వేయినన్నతోళ్మడవార్ వెణ్ణెయుణ్డా నివనెన్ఱు ఏశనిన్ఱ వెమ్బెరుమాన్" (కలియన్.2-2-1)** ఇత్యాదిగా కల ఆళ్వార్ల సూక్తులనుబట్టి కూరేశులు ఇట్లు అనుగ్రహించిరి.

స్వామి ఇట్లు చేసినదంతయు కేవలము లీలావ్యాపారము కొఱకే. పరమభక్తులగు గోపజనుల హస్తస్పర్శనుకల్గిన గవ్యములను తనకు ధారకభోగ్యములుగా తలచుననుటను తెలుపుట కొఱకే చుట్టుప్రక్కల ఇండ్లలో దొంగిలించుట. **"వెఱుఙ్కలత్తై వెప్పిడై ఇట్టు అదనోశైకేట్కుమ్" (పెరియా.2-9-1)** అనునట్లు రిక్తపాత్రను పగులగొట్టుట, అది పగిలినపుడు వచ్చు ధ్వనిని విని సంతోషించు బాలలీలావ్యాపారము వంటిది అని భావము. **"ఏతత్ సర్వం తవోత్తరోత్తరం లజ్జాకరం, భక్తానాం చిత్తాకర్షకమ్ ఇతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. నీ ఇంటిలో నవనీతాదులు సమృద్ధిగా ఉండగా దొంగిలించుట, అదియు ప్రక్క ఇండ్లలో దొంగిలించుట, అందఱి ముందు రిక్తభాండమును పగులగొట్టుట, గోపికల వేళాకోళమునకు పాత్రమగుట ఇవి అన్నియు ఒకదానికంటే



వేరొకటి లోకదృష్టిలో నీకు లజ్జాకరములు, కాని, భక్తుల దృష్టిలో మిక్కిలి చిత్తాకర్షకములు అని భావము. **"గవ్యవిభవే"** అనియు పాఠాంతరము.

**39.** **యన్నామ నాథ! నవనీత మచూచర స్త్వం**
**తచ్ఛాదనాయ యది తే మతిరావిరాసీత్ ।**
**కిం ముగ్ధ! దిగ్ధ మమునా కరపల్లవం తే**
**గాత్రే ప్రమృజ్య నిరగాః కిల నిర్విశంకః ॥**

(హే) నాథ = స్వామీ!, త్వం = నీవు, యత్ నవనీతం = ఏ వెన్నను, అచూచరః = దొంగిలించితివో, తత్ + ఛాదనాయ = దానిని కప్పిపుచ్చుటకొఱకు, తే = నీకు, మతిః = తలపు, ఆవిరాసీత్ యది = కల్గినదైనచో, (హే) = ముగ్ధ = ఆ విధముగా మఱుగుపఱచుటను తెలియని అమాయకుడా! అమునా = ఈ దొంగిలించిన వెన్నతో, దిగ్ధం = పూయబడిన, కరపల్లవం = చిగురువంటి (నీ) చేతిని, తే = నీ యొక్క, గాత్రే = ఒంటిలో, ప్రమృజ్య = తుడుచుకొని, నిర్విశంకః (సన్) = నిర్భయుడవై, నిరగాః కిల = బయటకు పోయితివట కదా!, కిమ్ = ఇది ఏమి (ఆశ్చర్యము!)

ఒకనాడు శ్రీకృష్ణుడు ఒక ఇంటిలో వెన్నను భుజించునపుడు ఆ ఇంటివారు వచ్చిరట. అపుడు తన చేతికి అంటుకొనిన వెన్న కనపడరాదను తలపుతో కృష్ణుడు "నోటిలోగాని, చేతికిగాని వెన్న ఉన్నచో కదా నా దొంగతనము బయటపడును. నోటిలో, చేతిలో వెన్నలేకుండ జాగ్రత్త పడెదను" అని తలచి నోటిలోని వెన్నను మింగి, చేతికి అంటుకొనిన వెన్నను ఒంటికి పూసికొని, "ఇక నేను ఎవరికిని భయపడవలసిన పని లేదు" అని నిర్భయముగా బయటకు పోయెనట. ఈ అమాయకపు, బాల్యచేష్టను మానసికముగా దర్శించి, ఆనందించిన కూరేశులు, "స్వామీ! ఈ విధముగా కూడ ఒక అమాయకపుపని ఉండునా! వెన్నదొంగతనమును మఱుగుపఱచవలెనని తలచి, అది మిక్కిలి స్పష్టమగునట్టి పనిని చేసితివే! ఇది నిజముగా మౌగ్ధ్యము (తెలివితక్కువతనము) వలన చేసితివా! లేక మౌగ్ధ్యభావనతోనా! తెలుపుము" అని మనస్సున ద్రవించుచున్నారు. **"ఇదం నవనీతచౌర్యచ్ఛాదనానుగుణం వా స్వాంగే నవనీతదిగ్ధకరపల్లవమార్జనమ్ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

ఈ శ్లోకము **''ముఴుందువ్ వెణ్ణెయ్ అళైన్దు తొట్టుణ్ణుమ్ ముకిఴ్ ఇళఞ్జీరుత్తామరైక్కైయుమ్"** ఇత్యాది కులశేఖరుల (7-8) పాశురమును, **"ఉఱిమేలై త్తడానిఱైన్ద వెళ్ళిమలైయిరున్దాలొత్త వెణ్ణెయై వారి విఙ్గియిట్టు కళ్వన్ ఉఱఙ్గుకిన్ఱాన్ వన్దు కాణ్మిన్! కైయెల్లామ్ నెయ్" (కలియన్.10-7-3)** అను పరకాలసూరిసూక్తిని అనుసరించి రచింపబడినది. అట్లే, **"అభినవనవనీతస్నిగ్ధ మాపీతదుగ్ధం దధికరపరిదిగ్ధం ముగ్ధ మంగం మురారేః, దిశతు భువన కృచ్ఛ్రచ్ఛేదితాపింఛగుచ్ఛచ్ఛవినవశిఖిపింఛాలాంఛితం వాంఛితం నః"** అను శ్లోకరత్నము ప్రకృతమున భావనీయము.

**40.** **త్వా మన్యగోపగృహగవ్యముషం యశోదా**
**గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా ।**
**ప్రేమ్ణాఽథ దామపరిణామజుషా బబన్ధ**
**తాదృ జ్ఞ తే చరిత మార్యజనా స్సహంతే ॥**

గుర్వీ = గొప్పఅభిమానవతియైన, యశోదా = యశోదాదేవి, త్వదీయం = నీకు చెందిన, అవమానమ్ = పరిభవమును, అమృష్యమాణా = సహింపలేనిది అగుచు, అన్యగోపగృహ= ఇతరగోపాలుర ఇండ్లలోని, గవ్యముషం = వెన్న మొదలగువానిని దొంగిలించిన, త్వాం = నిన్ను, అథ = ఆ దొంగతనమునకు పిమ్మట, దామపరిణామజుషా = తాడుగా పరిణమించిన, ప్రేమ్ణా = ప్రేమపాశముతో, బబన్ధ = కట్టివైచెను, తే = నీ యొక్క, తాదృక్ = అట్టి, చరితం = చౌర్యవార్తను, ఆర్యజనాః = (పెద్దలు) ఆళ్వార్లు మొదలగువారు, న సహంతే = (విని) సహింపలేరు.

స్వామీ! నీ తల్లి యశోదాదేవి గొప్ప అభిమానవతి. నవనీతచౌర్యసందర్భమున నీకు కల్గిన అవమానమును చూచి సహింపలేకపోయినది. పొరుగు ఇండ్లలో వెన్న మొదలగువానిని దొంగిలించిన నిన్ను తాటితో రోలుకు కట్టినది. నిజమునకు ఆ తాడు ఆమెకు నీ విషయమున గల ప్రేమయొక్క ప్రతిరూపమే. ఆ విధముగా నిన్ను యశోద తాటితో కట్టిన వృత్తాంతమును విని ఆళ్వార్లవంటి మహనీయులు తట్టుకొనలేక మూర్ఛపోయిరి. నీ సౌలభ్యసౌశీల్యగుణములకు వారి మనస్సు నీరై, మోహమును పొందిరి.

**(త్వా మన్యగోపగృహ . . . అమృష్యమాణా) – "మేలైయకత్తు నజ్గాయ్ వన్దుకాణ్ మిన్‌గళ్! వెణ్ణెయే యన్రు ఇరున్దపాలుమ్ పదిన్‌కుడమ్ కణ్డిలేన్"** అని పరకాలసూరిసూక్తి (10-7-2), **"పాలైక్కఱన్దు అడుప్పేఱవైత్తు ప్పల్‌వళైయాళ్ ఎన్ మకళిరుప్ప మేలైయకత్తే నెరుప్పు వేణ్డిచ్చెన్రు ఇఱైప్పొళ్దు అజ్గే పేశి నిన్ఱేన్, శాలక్కిరామముడైయ నమ్బి శాయ్‌త్తు ప్పరుకిట్టుప్పోన్దు నిన్ఱాన్, ఆలైక్కరుమ్బిన్ మొళ్రియనైయ అశోదైనజ్గాయ్! ఉన్‌మకనై క్కూవాయ్** (2-9-5) ఇత్యాది భట్టనాథసూక్తుల ప్రకారము, ఇరుగుపొరుగు వారందఱు వచ్చి శ్రీకృష్ణుని నవనీతచౌర్యమునుగూర్చి యశోదవద్ద మొఱపెట్టుకొనిరి. అపుడు అభిమానవతియైన ఆమె **"అశలకత్తార్ పరిబవమ్ పేశ త్తరిక్కకిల్లేన్"** (2-9-6) అని, **"ఏదేనుమ్ శొల్లి అశలకత్తార్ ఏదేనుమ్ పేశ నాన్ కేట్కమాట్టేన్"** (2-9-6) అని, **"నేశమిలాదార్ అకత్తిరున్దు నీవిళైయాదాదే"** (2-9-7) అని ఇత్యాదిగా పల్కి అవమానమును తాళలేకపోయినది. **"యశోదానందనేన అస్మద్గృహే క్షీర మపహృతమ్, అస్మద్గృహే నవనీత మపహృతమ్ ఇత్యేవంరూపం పరివాదమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"త్వదీయమ్ అవమానమ్"** అనుటకు నీకారణముగా కల్గిన అవమానమును అను అర్థము గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో తెలుపబడినది.

**(ప్రేమ్ణా దామపరిణామజుషా బబన్ధ)** – అవమానమును సహింపలేని యశోదాదేవి ప్రేమతో నిన్ను కట్టివేసెనే గాని, ఆమె మనస్సులో నీపట్ల మాత్సర్యము లేదు కదా! **"అన్బుఱ్ఱునోక్కి యడిత్తుమ్ పిడిక్కుమ్"** అని కదా భగవానుని వాక్యము. ఆమె ప్రేమ దామముగా రూపొందినదంతియే. దామబంధము ప్రేమకార్యమని భావము. **"దామబంధస్య ప్రేమబంధనకార్యత్వాత్"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య.



**(తాదృ జ్ఞ తే చరిత మార్యజనాః సహంతే)** – ఆర్యులనగా గొప్పవారు. ఈ పదము ఇచట తల్లిదండ్రులు మొదలగు పెద్దలను తెల్పునని సామాన్యార్థము. లోకములో తల్లిదండ్రులు తమ సంతానమునకు ఏర్పడిన అవమానమును విని, చూచి సహింపలేరు కదా! **"తథా హి, లోకే ఆర్యజనాః పిత్రాదయః స్వపుత్రాదీనాం తాదృక్ చౌర్యాత్మకం చరితం న సహంతే"** అని రామానుజాచార్య వ్యాఖ్య. ఇంతకంటే స్వరసమైన అర్థము ఏమనగా ఆర్యశబ్దముతో భగవానుని సౌలభ్యసౌశీల్యాది అతిమానుష–అద్భుతకల్యాణగుణములకు వ్యామోహముచెందిన శుకపరాశరాదిమహర్షుల, నమ్మాళ్వార్లవంటి దివ్యసూరులను మహనీయులనే కూరేశులు ఇచట పల్కిరని చెప్పుట. **"మఱ్ఱుఱుకడై వెణ్ణెయ్ కళవినిల్ ఉరైవిడై యాప్పుణ్డు ఎత్తిఱ మురలినోడు ఇణైన్దిరున్దు ఏజ్గియవెళివే"** అనుచు శ్రీకృష్ణుడు నవనీతచౌర్యము కారణముగా యశోదచే **"కణినుణ్ శిఱుత్తామ్బినాల్ కట్టుణ్ణప్పణ్ణియ పెరుమాయన్"** అనునట్లు చిన్నతాటితో బంధింపబడిన వృత్తాంతమును అనుసంధించి నమ్మాళ్వార్లు ఆఱునెలలు మూర్ఛను పొందిరను ఐతిహ్య మిచట స్మరణీయము. **"దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే, యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచల చేష్టిత"** **(విష్ణు.5-6-14,15)** అనుచు సర్వశక్తియగు భగవానుని ఉద్దేశించి యశోద **"యది శక్నోషి గచ్ఛ త్వమ్"** – "ఇచటినుండి వెళ్లగల్గిన వాడవైనచో వెళ్ళుము, చూచెదను" అని పల్కుట శుకపరాశర, శఠకోప, భట్టనాథాది ఆర్యులు సహింపలేకపోయిరని భావమని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"యది శక్నోషి గచ్ఛ త్వమ్ – ఇతి సర్వశక్తిం ప్రత్యుక్తి రసహనసూచికేతి భావః"** అని అచటి వివరణము. **"త్వత్ప్రేమభరాక్రాంతాః ఆత్మీయజనాః తాదృక్‌బంధనం న సహంతే ఇతి వా"** అని రామానుజాచార్య వ్యాఖ్యానము. ఆర్య శబ్దమునకు విపరీతలక్షణయా అనార్యులను అర్థమును, గ్రహించి, నవనీతచౌర్యాది వృత్తాంతములు భగవానునకు అవద్యకరములని వాదించి, నిందించు నాలూరాన్ వంటి అనార్యులిచట సూచింపబడినారనియు కొందఱు వ్యాఖ్యానించిరి. మొదటి మూడుపాదములలో ప్రస్తావింపబడిన దామోదరబంధరూపవిశేషవృత్తాంతము నాల్గవపాదములోని సామాన్యరూపమగు అర్థాంతరముచే సమర్థింపబడుటచే అర్థాంతరన్యాసము.

**41.** **మాత్రా యది త్వ మసి దామని సంనిబద్ధః**
**తచ్ఛ్రావిణా ముదితచాక్షుషనిర్ఝరాణామ్ ।**
**బధ్నాసి హంత! హృదయం భగవన్! కుత స్తత్**
**సర్వోఽహి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్ ॥**

భగవన్ = స్వామీ!, త్వం = నీవు, మాత్రా = తల్లియగు యశోదచే, దామని =

త్రాటియందు, సంనిబద్ధః యది = కట్టబడినవాడవు అయినచో, తత్ + శ్రావిణామ్ = ఆ చరిత్రను వినినవారు (కావుననే) ఉదిత = జనించిన, చాక్షుష = కంటికి సంబంధించిన, నిర్ఘరాణామ్= ప్రవాహములను కలవారు (కన్నీరు ప్రవాహముగా విడచువారును) అగు జనులయొక్క, హృదయం = మనస్సును, బధ్నాసి = బంధించుచున్నావు, హంత = ఆశ్చర్యము!, తత్ = అది, కుతః = ఎందులకు?, (లేక, ఇది యుక్తమే), సర్వః = ప్రతివాడు, వశ్యవిషయే = తన అధీనములోనున్న వానియందు, వీర్యమ్ = తన వీర్యమును, వివృణోతి = ప్రకటించును, హి = కదా!

పూర్వశ్లోకమున ప్రస్తావించిన **"తాదృ జ్న తే చరితమార్యజనా స్సహంతే"** అను అర్థమునే అత్యంతచమత్కారసరణిలో కూరేశులు ప్రకారాంతరమున ప్రస్తుతించుచు, సమర్థించుచున్నారు.

స్వామీ! **"కృతే చ ప్రతికర్తవ్యమ్"** అని, **"కృత ప్రతికృతమ్ సర్వేఽపి తత్ కుర్వతే"** అనియు పల్కునట్లు, చేసిన పనికి ప్రతిక్రియ చేయవలెనను లోకన్యాయమొకటి కలదు కదా!. మంచి చేసినవారికి మంచిని, కీడు చేసినవారికి కీడును చేయుట కృతప్రతికృతమనబడును. నిన్ను తాటితో కట్టినది నీ తల్లి యశోద. దానికి నీవు ప్రతిక్రియ చేయగోరినచో ఆమెనుకదా తాటితో కట్టవలెను! నీవట్లు చేయలేదే! ఇక ఏమిచేసితివి ? అనినచో, ఆ అద్భుతదామోదరబంధన వృత్తాంతమును విని, అభినివేశమును పొంది, కన్నీరు మున్నీరుగా అగునట్లు, ప్రేమ పరవశులగు భక్తుల హృదయమును బంధించుచున్నావంతియే. ఎవరిపట్ల చేయవలసిన పని ఎవరి విషయమున చేయుచున్నావు? అయ్యో! **"తవ సౌలభ్యం సౌశీల్యం చ సర్వచిత్తాకర్షక మితి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"మాతుః భవాన్ వశ్యః, భవత స్త్వార్యజనా వశ్యా ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**(తచ్ఛ్రావిణామ్ ఉదితచాక్షుషనిర్ఘరాణామ్)** – ఇచట విశేష్యపదమేమియు ప్రయోగింపబడకున్నను, పూర్వశ్లోకములోని **"ఆర్యజనాః"** అను పదమును **"ఆర్యజనానామ్"** అని లింగవ్యత్యయము చేసికొని విశేష్యముగా అనువర్తనము చేసికొననగును. తాటిచే కట్టబడినవాడు కదా కన్నీరు విడువవలెను. నీ దామబంధనవృత్తాంతమును వినినవారు కన్నీరు విడుచుటయు వేరొక ఆశ్చర్యము? అని భావము. ఇచట **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్ సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః"** అనుచు విష్ణుతత్త్వములో కీర్తింపబడిన మహనీయులు ఇచట తెలుపబడినారు. **"పిఱన్దవాఱుమ్ వళర్న్దవాఱుమ్ . . . నిఱన్ద నూడుపుక్కు ఎనదావియై నిన్రునిన్రు ఉరుక్కియుణ్గిన్ర"** **(తి.వా.5-10-1)** అని, **"ఎత్తిఱమ్ ఉరలినోడు ఇణైన్దిరున్దు ఏఙ్గియవెళివే"** **(తి.వా.1-3-1)** అనియు ఈ వృత్తాంతమును అనుసంధించి ఆళ్వార్లు నెలలతరబడి మూర్ఛిల్లుటను ఉద్దేశించి కదా కూరేశులు ఇట్లు పల్కినది. **"ఎల్లిల్‌కొళ్ తామ్బుకొణ్డు అడిప్పదఱ్కు ఎళ్‌కునిలై"** **(7-8)** అని కులశేఖరాళ్వార్లు స్తుతించిన సన్నివేశము వీరి మనస్సున



ప్రకృతముననున్నది.

**(కుత స్తత్)** – ప్రతిక్రియను చేయగోరినచో నిన్ను కట్టిన నీ తల్లిని కట్టవలెను. అది చేయక, నిరపరాధులు, ఆర్తులును అయినవారి కట్టివేయుట ఏమి వీర్యము! చాల బాగున్నది!

**(బధ్నాసి హంత హృదయమ్)** – **"తాదృశసౌశీల్యాసక్తచిత్తాన్ కరోషీ త్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము. **"హంత"** అనునది ఆశ్చర్యార్థకము. దేనినిబట్టి భక్తుల హృదయములను బంధించినట్లు కూరేశులు పల్కిరి? అనినచో, స్వామి సౌశీల్యగుణములో అభినివిష్టచిత్తులై, **"ఎత్తిఱమ్"** అని, **"పిఱన్దవాఱుమ్ వళర్న్దవాఱుమ్"** **(తి.వా.5-10-1)** అని, **"ఎల్లిల్ కొళ్ తామ్బుకొణ్డు అడిప్పదఱ్కు ఎళ్‌కునిలైయుమ్"** **(పెరుమాళ్.7-8)** అను రీతిలో మనస్సున ఆర్తులై ఆళ్వార్లు సాయించు రీతినిబట్టి ఇట్లు పల్కిరని చెప్పనగును.

**(సర్వో హి . . . వీర్యమ్)** – **"కుత స్తత్"** అని ప్రశ్నించిన కూరేశులే, తమకు తామే సమాధానమును పొందుచున్నారు. లోకమున ఇది సహజమే కదా! తనకు లోబడియున్న వారిపట్ల కదా తన వీర్యమును ప్రదర్శింతురు. యశోద తనకు లోబడియున్న నీ పట్ల తన వీర్యమును ప్రదర్శించినది. నీవు నీకు లోబడియున్న నీదాసులపట్ల నీ వీర్యమును చూపితివి. లోకరీతి ఇంతియే కదా! అనుచు అర్థాంతరన్యాసప్రక్రియలో సమాధానమును పల్కిరి. **"మాతు ర్భవాన్ వశ్యః, భవత స్త్వార్యజనా వశ్యా ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"తవ చేత్ అపరాధనిమిత్తబంధన ముచితం, నిరపరాధినాం తేషాం బంధన మనుచిత మితి ధ్వనిః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. తనను బంధించినవారిని విడచి, వేరొకరిని బంధించినట్లు వర్ణించుటచే విషమాలంకారము కలదని వేరొక వ్యాఖ్య. కృష్ణుడు బంధింపబడగా, తద్భక్తులు కన్నీరు విడచిరని పల్కుటచే ఆర్థికమైన అసంగత్యలంకారము కలదని ఇంకొక వ్యాఖ్య. **"కుత స్తత్"** అనుటకు బదులు **"కుత స్త్వమ్"** అని పాఠాంతరము.

**42.** **కాంతాలకాంత మమలం కమలాయతాక్షమ్**
**ఉద్భ్రూవిలాస ముదితస్మిత మున్నసం చ ।**
**వక్త్రం వహన్ పరమ! గోపగృహేషు కిం త్వం**
**గోపీమనాంసి నవనీత ముతాభ్యమోషీః ॥**

పరమ = పరమపురుషా! కాంత = అందమైన, అలక + అంతమ్ = ముంగురుల చివరలను కల్గినది, అమలం = ఎట్టి దోషములేనిది, కమల + ఆయతాక్షమ్ = తామరవలె పెద్ద కన్నులను కల్గినది, ఉత్ + భ్రూవిలాసమ్ = ఎత్తైన కనుబొమ్మల విలాసమును కల్గినది, ఉదితస్మితమ్= ఉదయించిన మందస్మితమును కల్గినది, ఉన్నసం చ = ఎత్తైన నాసికను కల్గినదియును అగు, వక్త్రం = ముఖమును, వహన్ = కలవాడవైన, త్వం = నీవు, గోపగృహేషు= గోపాలుర ఇండ్లలోని, గోపీమనాంసి = గోపికల మనస్సులను, అభ్యమోషీః = దొంగిలించితివా?,

ఉత = లేక, నవనీతమ్ = వెన్ననా? (తెలుపుము)

నవనీతచౌర్యసమయములోని స్వామి దివ్యమంగళవిగ్రహశోభను తమ భావనాతిశయముద్వారా ప్రత్యక్షసమానాకారముగా దర్శించి, ఆనందమగ్నులైన కూరేశులు ఆ రూపమును అద్భుతపదప్రయోగముద్వారా మన కంటిముందు భావికాలంకారప్రక్రియలో సాక్షాత్కరింపచేయుచున్నారు. ఆ స్వామిని సైతము ఉక్కిరిబిక్కిరిచేయు ప్రశ్నను సంధించుచున్నారు.

**(పరమ) – "పరో మా యస్మాత్ ఇతి పరమః"** అని, **"పరా మా యస్య సః"** అని రెండువిధములైన వ్యుత్పత్తులు ఈ నామమునకు చెప్పనగును. మొదటివ్యుత్పత్తికి నిస్సమాభ్యధికుడని (పరాత్పరుడని), రెండవ వ్యుత్పత్తికి శ్రియఃపతి అనియు అర్థము. మొదటి వ్యుత్పత్తికి అనుగుణముగా **"న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే" (శ్వేతా.6-8)** అని, **"తన్నొప్పారిల్లప్పన్" (తి.వా.13-9)** అనియుగల అనేక ప్రమాణములను, రెండవ వ్యుత్పత్తికి అనుగుణముగా **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే''** అనియు గల పలు ప్రమాణములను అనుసంధించవలెను. **"వణ్ణక్కరుజ్జుళ్ళులాయ్చ్చియారాల్ మొత్తుణ్ణ కణ్ణి క్కుఱుఙ్కయిఱ్ఱాల్ కట్టుణ్డానాకిలుమ్ ఎణ్ణఱ్కరియ నిమైయోర్క్కుమ్ శాఱ్ఱలే" (కలియన్.11-5-5)** అనునట్టి పారమ్యమునకు కొఱతలేదు కదా! అని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారిసూక్తి. అనగా నల్లని, అందమైన కురులనుకల యశోదచే కవ్వముతో కొట్టబడినను, దారముతో కట్టబడినను నిత్యసూరులకుకూడ అందనివాడు అని భావము. కావున అంతటి సౌలభ్యములోను పరత్వమును ప్రకాశింపచేయువాడు స్వామి. **"ప్రకృతి ర్హి బలీయసీ"** కదా!

**(కాంతాలకాంతమ్) –** పూర్వార్ధములోని విశేషణములు ఆఱును వక్త్రమను విశేషణముతో అన్వయించును. **"శెఙ్గమలప్పూవిల్ తేనుణ్ణుమ్ వణ్డేపోల్ పజ్జికళ్వన్దు ఉన్ పవళవాయ్ మొయ్ప్ప" (పెరియా.1-8-2)** అను భట్టనాథసూక్తి ఇచట స్వామి ముంగురుల విషయమున స్మరణీయము. ముఖపద్మమునందలి తేనెను ఆస్వాదించుటకై వచ్చిన తుమ్మెదలవలె మనోహరముగానున్నవి స్వామి ముంగురులు.

**(అమలమ్) –** మచ్చలేని చంద్రమండలమువలెనున్నది అగుటచే స్వామి ముఖము నిష్కళంకము. స్వామి హేయప్రతిభటత్వమును ముఖమే ఆవిష్కరించుచున్నది.

**(కమలాయతాక్షమ్) –** స్వామి అరవిందమువంటి దీర్ఘములైన కన్నులను కలవాడు. **"దృగ్భ్యా మేవ హి పుండరీకనయనం వేదో విదామాస తే" (శ్రీగుణ-40)** అని భట్టరు స్వామి పుండరీకాక్షత్వము కీర్తించిరి. **"కరియవాకి పుడైపరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్" (అమలనాది)** అను తిరుప్పాణ్ సూక్తి ఇంకను ఇట్టి దివ్యసూరి సూక్తులు అనేకములు ఇచట అనుసంధేయములు.



**(ఉద్భ్రూవిలాసమ్ ఉన్నసమ్)** ఎత్తైన కనుబొమ్మల విలాసమును కల్గినది స్వామి మోము. **"కక్షః కుక్షి శ్చ వక్ష శ్చ ఘ్రాణస్కంధౌ లలాటికా, సర్వభూతేషు నిర్దిష్టా ఉన్నతా స్తు సుఖప్రదా"** అను సాముద్రికశాస్త్రోక్తి ప్రకారము ఎత్తైన కనుబొమ్మలు, నాసికయు మహాపురుషలక్షణములు. వెన్నను దొంగిలించు తనను ఎవరైనను చూచుచున్నారేమో! అను సందేహముతో గమనించుటచే శ్రీకృష్ణుని కనుబొమ్మలు ఎత్తుగానున్నవి. కావున ఈవిధముగాకూడ విశేషణము సాభిప్రాయకము. **"మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో! కొళ్ళున్దో!" (తి.వా.7-7-2)** అనునట్లు నిత్యసందేహజనకమై కదా! స్వామి నాసికయుండును.

**(ఉదితస్మితమ్) –** ఇదియు సాభిప్రాయవిశేషణమే. వెన్నను దొంగిలించుటకై శ్రీకృష్ణుడు **"పడలడైత్త శిఱుకుఱుమ్బై నుழైన్దుపుక్కు పశువెణ్ణెయ్ పతమార"** (4-4-3) అను రీతిలో తడకలు కట్టిన గుడిసెలో వెన్నను ఆరగింపగోరి ప్రవేశించెను. ఆ గుడిసెలోని చీకటి వలన, తన నల్లని దేహకాంతివలన అచట ఏమున్నదో తెలియక తడుమసాగెను. ఇంతలో స్వామి చేతికి వెన్నభాండము తగులగా, వెంటనే సంతోషముతో చిఱునవ్వు నవ్వెను. ఆదంతకాంతి దీపపు కాంతికాగా ఆ వెలుగులో వెన్నను ఆరగించెను– అను ప్రసిద్ధినిబట్టి కూరేశులు ఈ విశేషణమును ప్రయోగించిరని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"నాళిళమ్ తిఙ్గళై క్కోళ్ విడుత్తు వైయకమ్బాల్ వెణ్ణెయ్ తొడువుణ్డ ఆనాయర్ తానవనే" (తి.వా.3-8-3)** అను దివ్యసూరి సూక్త్యర్థము ఇచట భావనీయము అనియు అచటి వివరణము. "ఇంతగానున్న కావలిని దాటి, ఎవరునుచూడకుండ నవనీతాదులను దొంగిలించి భుజింపగల్గితిని కదా" అను సంతోషమువలన కల్గిన చిఱునవ్వు అనియు చెప్పవచ్చునని వేరొక వ్యాఖ్య. పౌష్కర సంహితలో భగవానుని చిఱునవ్వు – **"పూర్వకర్మానలార్తానాం ధ్యాయినాం ఖేదశాంతయే, స్వదతేందుచయోత్థేన హ్లాదయన్ గోగణేన తు"** అనుచు పూర్వకర్మలచే ఆర్తిని పొందిన యోగులకు ఊఱటను కల్గించునని చెప్పబడినది.

**(గోపీమనాంసి అభ్యమోషీః ఉత నవనీతమ్ అభ్యమోషీః) –** రేపల్లెలోని గోపాలుర ఇండ్లలో దూరి గోపికల మనస్సును దొంగిలించితివా? లేక వెన్నను దొంగిలించితివా? రెండిటిని అపహరించితివి కదా అని హార్దభావము. **"ఉభయ మప్యపహృతవా నసీత్యర్థః, నవనీతహరో మనోహర శ్చాభవదిత్యర్థః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. **"కోవలనాయ్ వెణ్ణెయుణ్డవాయన్ ఎన్నుళ్ళమ్ కవర్న్దానై" (అమలనాది)** అను పాణ్పెరుమాళ్సూక్తిని ఇచట గమనింపనగును. రామావతారములోని స్వామిరూపమును **"దదృశుః విస్మితాకారాః రామస్య వనవాసినః"** అనునట్లు ఆశ్చర్యముతో దర్శించిన మహర్షులే శ్రీకృష్ణావతారమున రేపల్లెలోని గోపికలుగా, వేదములే పశువులుగా అయ్యెనని పురాణములు తెలుపుటచే, స్వామి గోపికల మనస్సును అపహరించుటలో ఏమి వింత? ఈ శ్లోకభావమునే కూరేశులు సుందరబాహుస్తవములోని **"సుందరోరుభుజ! నందనందన స్త్వం భవన్ భ్రమరవిభ్రమాలకః, మందిరేషు నవనీతతల్లజం వల్లవీధియ ముత వ్యచూచురః"** అను (110) శ్లోకముద్వారా మరల అనుసంధించుట ఆదరాతిశయమును తెలుపును.

43. సర్వం గుణాయ గుణినా మితి సత్య మేతత్
యత్ఖల్విహేతరజనే మలినత్వహేతుః ।
తద్గోపవేషవినిషేవణ ముత్తమం తే
గోపాలనం చ గణయంతి గుణం గుణేషు

ఇహ = ఈ లోకమునందు, యత్ ఖలు = ఏ వ్యాపారము, ఇతరజనే = (గుణములులేని) సామాన్యజనులయందు, మలినత్వహేతుః = దోషము అగుటకు కారణమో, తత్ = అది, సర్వం= అంతయు, గుణినామ్ = గుణములనుకలవారికి, గుణాయ = గుణముగా అగుచున్నది, ఇతి+ ఏతత్ = అను ఈ లోకములోని మాట, సత్యం = నిజమే, యత్ = ఎందువలన అనగా, తే = నీ యొక్క, గోపవేషవినిషేవణం = గోపాలుని వేషమును పరిగ్రహించుట, గోపాలనం చ = గోవులను కాయుటను, గుణేషు = సద్గుణములయందు, ఉత్తమం = గొప్పదైన, గుణం = గుణముగా, గణయంతి = (విజ్ఞులు) లెక్కపెట్టుచున్నారు (కదా!)

గోపాలవేషధారణము, గోపాలనమును లోకములో తక్కువ దనమును సూచించునవి అయినను, భగవానుని విషయమున అవి గుణములుగా పరిణమించుటను, సామాన్యజనులకు మాలిన్యహేతువైన కృత్యమే గొప్పగుణములను కలవారి విషయమున గుణముగా పరిణమించునను లోకోక్తి పురస్సరముగా కూరేశులు ఇందు సమర్థించుచున్నారు.

స్వామీ! సాధారణజనులకు దోషావహములగు కృత్యములే ప్రసిద్ధగుణశాలురపట్ల గుణావహములగునను లోకోక్తి నిజమే! ఏల అనగా, నీవు గోపాలురకులములో పుట్టుట, గోవులను మేపుటయు నీ ఉత్తమగుణములుగా జ్ఞానాధికులు పేర్కొనుచున్నారు కదా!

**"కర్రినమ్ మేయ్కలుమ్ మేయ్క్కిపెర్రాన్ కాడువాఝ్ శాదియుమాకపెర్రాన్" (నాచ్చియార్.12-7)** అని లోకులు నిందించుటకు తగిన నీ కృత్యములే జ్ఞానాగ్రేసరులకు గుణకోటిలో లెక్కించునవి అయినవి కదా! **"కంసముఖ్యనృపకీటశాసనం సుందరాల్పకమ్" (115)** అని, **"యా కంసముఖ్యనృపకీటనిబర్హణోత్థా . . . నైవ కీర్తిః" (54)** అనియు కీర్తించు రీతిలో కంసనిరసనాదులు జ్ఞానాదికుల దృష్టిలో అల్పములైనవి. వానికంటే గోపవేషపరిగ్రహము, గోరక్షణమును ప్రధానములైనవి. శ్లోకములోని **'చ'** కారమును అనుక్తసముచ్చాయకముగా అన్వయించి, ఇందు పేర్కొనబడని దామోదరబంధన, నవనీత చౌర్యాది పలు వృత్తాంతములు ఉపలక్షితములని చెప్పనగును. **"చకారా దిహ సహక్రీడనమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. అనగా గోపాలురతో ఆటలాడుట అని అర్థము. **"గుణం గుణజ్ఞాః"** అను పాఠాంతరము కలదు.

**(ఉత్తమమ్ గోపవేషవినిషేవణమ్)** – దేశికులు గోపాలవింశతిలో శ్రీకృష్ణుని గోపవేషమును – **"చిత్రాకల్పః శ్రవసి కలయన్ లాంగలీకర్ణపూరం బర్హోత్తంసస్ఫురితచికురో బంధుజీవం దధానః, గుంజాబద్ధా మురసి లలితాం ధారయన్ హారయష్టిమ్"** అనుచు స్తుతించుట, **"కారోక్కోడల్ పూచ్చూడి"** అని, (3-3-3) **"వలజ్మాదిల్ మేల్ తోన్రి ప్పూవణిన్దు"** (3-4-9) అనియుగల దివ్యసూరిప్రయోగములును ఇచట అనుసంధేయములు. **"ఉత్తమమ్"** అను విశేషణమును కాకాక్షిన్యాయమున గోపవేషవినిషేవణముతో, గోపాలనముతో అన్వయించి అర్థమును చెప్పుటలోకూడ స్వారస్యమున్నది.



**(ఉత్తమమ్ గోపాలనమ్) "గావః సర్వా దేవతాః"** అను సూక్తిని బట్టి గోపాలనము సకలదేవతారాధనము. **"గవా మంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ"** అను సూక్తి దీనిని బలపఱచుచున్నది. కావున గోరక్షణము ఉత్తమకృత్యమనునది అట్లుండనిండు. ఇచటి గోశబ్దమునకు వేదమను అర్థమును చెప్పి, వేదప్రతిపాద్యుడగు భగవానుడు వేదములను రక్షించుట ఈ పదముద్వారా ధ్వనించుచున్నదని వేరొక వ్యాఖ్య. యాదవాభ్యుదయములో దేశికులు సాయించిన– **"గోపాయమానే పురుషే పరస్మిన్ గోరూపతాం వేదగిరో భజంత్యః, భవ్యై రసేవంత పదం తదీయం స్తోభప్రతిచ్ఛందనిభైః స్వశబ్దైః"** అను శ్లోకార్థ మిచట అనుసంధింపనగును. పశువుల హుంభారవములు సామవేదములో ఉచ్చరించు **"హావు హావు"** అను స్తోభాక్షరములవంటివని అర్థము. ఇట్లు ఈ వేదరూపపశువులనే కాదు; **"పశవః పాశితాః పూర్వం పరమేణ బలీయసా, తేనైవ మోచనీయా స్తే నాన్యై ర్మో చయితుం క్షమాః"** అను రీతిలో పశుప్రాయులై, కర్మబంధములలో తగులుకొని, పరిభ్రమించు క్షేత్రజ్ఞులగు భక్తులను ఆ బంధమునుండి విడిపించుటకై కదా! స్వామి గోపాలుడై అవతరించెను. ఇదియే నిజమైన గోపాలనము. భక్తులకు ఐశ్వర్యాది ఐహిక పురుషార్థములను ఇచ్చుట మాత్రమే కాక, వారిని కర్మబంధవిముక్తులను చేయుట వంటిదియే– గోవులకు తృణజలాదులను ఇచ్చుటమాత్రమేకాక, వాని కంఠమునకు కట్టబడిన గుదికఱ్ఱవంటి బంధములను విప్పి, కట్టునుండి విడిపించుట. దేశికులీ భావమును **"న్యదర్శయత్ విశ్వపతిః పశూనాం బంధే చ మోక్షే చ నిజం ప్రభుత్వమ్"** అనుచు వ్యక్తీకరించిరి కదా! అని వ్యాఖ్యానాంతరము.

**(గణయంతి ఉత్తమమ్ గుణమ్)** విశేషజ్ఞులగు వ్యాసపరాశరులవంటి మహర్షులు, శఠకోపభట్టనాథులవంటి దివ్యసూరులును వీనిని ఉత్తమగుణముగా లెక్కించిరి. **"సర్వస్మాత్ పరస్య తవ సౌలభ్య మత్యతిశయావహ మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

44. గోపాలపోతకతయా నిభృతం ధరిత్రీ
మావస్తుకామ ఇవ సన్నపి బాల్యలౌల్యాత్ ।
ఐంద్రం నిహత్య మహ మద్రి మథో దధానః
కిం తస్థిషే సురగణాయ సవాసవాయ ॥

గోపాలపోతకతయా = గోపకుమారుడవై, నిభృతం = రహస్యముగా, ధరిత్రీమ్ = భూమియందు, ఆవస్తుకామః ఇవ సన్ అపి = నివసింపగోరినవాడవలె నీవు తలచియున్నను, బాల్యలౌల్యాత్ = బాల్యమునకుతగిన చాపల్యమువలన, ఐంద్రం = ఇంద్రునకు సంబంధించిన,

మహం = ఉత్సవమును, నిహత్య = అడ్డుకొని, అధో = పిమ్మట, అద్రిం = గోవర్ధన పర్వతమును, దధానః = ధరించువాడవై, సవాసవాయ = ఇంద్రునితో కూడిన, సురగణాయ = దేవసమూహమునకు, కిం తస్థిషే = ఎందులకు ఎదురొడ్డితివి?

నీ సౌలభ్యసౌశీల్యములను మాత్రమే ప్రదర్శించి, పరత్వమును మఱుగుపఱచుకొని, మనుష్యభావనతో వర్తింపవలెననివచ్చిన నీవు ఈ లోకములో పరత్వమే వ్యక్తమగునట్లు అతిమానుషలీలలను ప్రదర్శించుట ఎందులకు స్వామీ! అనుచున్నారు.

గోపబాలుడవై ఈ లోకమున అవతరించిన నీవు దానికి తగినట్లు ప్రవర్తింపకుండ బాల్యచాపల్యమువలన ఇంద్రునికొఱకు సాంప్రదాయికముగా రేపల్లెలోని గోపజనులచే ఆచరింపబడు ఉత్సవమునకు విఘ్నము కల్గించుటతోపాటు, ఆ ఇంద్రుడు కోపించి పుష్కలావర్తకమేఘములనెడి ఎనిమిది మేఘములను గొని గొప్ప వర్షమును రేపల్లెలో కురిపింపగా, ఏడు రాత్రులపాటు గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తి, గోగోపాల రక్షణమును చేసి, నీవే అతిమానుషరూపుడవు, పరమపురుషుడవు అనుటను ఇంద్రునితోపాటు దేవతలందఱకును తెలియజేసితివా!. ఇది ఏమి ఆశ్చర్యము!

**(గోపాలపోతకతయా . . . సన్నపి) – "ఒరుత్తిమకనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్ ఒరుత్తి మకనాయ్ ఒళిత్తువళర" (తిరుప్పావై-25)** అను రీతిలో రహస్యముగా జన్మించి రహస్యముగా పెరుగుట అంతయు నీ శక్తివిశేషములను మఱచియే కదా! అట్లుండగా, **"ఇన్దిరనుక్కెన్ఱాయర్కళెడుత్త ఎழిల్ విழవిల్ పழనడైశెయ్ మన్దిరవిదియిల్ పూశనై" (కలియన్.2-3-4)** అనునట్లు గోపజనులుచేయు ఇంద్రసమారాధనను ఆటంకపఱచి, **"మారిప్పకై పుణర్త్తు అమ్మైత్తడఙ్కణ్ మడవాయ్చ్చియరుమ్ ఆనాయరుమ్ ఆనిరైయుమ్"** అనునట్లు గోగోపికాగోపజనులందఱు ఇంద్రుడు కురిపించిన వర్షముచే బాధింపబడినపుడు గోవర్ధనమును గొడుగుగా నీవు ఎత్తిపట్టుట ఏమి స్వామీ! **"ఆవస్తుకామ ఇవ"** అనుటచే ఇతడు నిజమునకు గోపాలుడు కాడు అని స్ఫురించును. **"క్రీడావల్లవుడు", "మిథ్యాగోపుడు"** కదా ఇతడు.

**(ఇంద్రం నిహత్య . . . సవాసవాయ)** – దేవేంద్రుడును, దేవతలందఱును ఒక పక్షముగానుండి ఎదిరించిరి. కాని ఏమయినది, నీవొక్కడవే కార్యమును సాధించితివి అని భావము. "దేవతలారా! మిమ్ములను అందఱను నేను ఎదురొడ్డుచున్నాను" అని నీ అభిప్రాయమును తెలుపుచు, వారిని ఏల ఎదిర్చితివి? అని ప్రశ్నించుచున్నారు – అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య.

**"విష్ణుః పర్వతానా మధిపతిః"** అని వేదము పల్కిన రీతిలో భగవానుడు పర్వతాధిపతి, "భగవద్విభూతియైన ఈ గోవర్ధనపర్వతము మనకు, మన గోగణమునకు ఆవశ్యకములైనవి అన్నింటిని ఇచ్చుచున్నది. కావున దీనినే పూజించెదమని" కృష్ణుడు ఇంద్రపూజను చేయు రేపల్లెలోని



జనులతో పల్కెను. దీనిని కూరేశులు బాల్యచాపల్యమనిరి. కృష్ణుని మాటలను ఆలకించిన నందగోపాలాదులు గోవర్ధనాద్రి శిఖరముపై శ్రీకృష్ణుని రూపమును **"శరణ మశరణానాం శాద్వలశ్యామలాంగం పులకితవనమాలం పుష్పకింజల్కజాలైః, పురుష మచలశృంగే పుండరీకాయతాక్షమ్"** అను రీతిలో దర్శించి, ఇంద్రపూజ నిలిపివేసి, గోవర్ధనపూజను నిర్వహించిరి. పరమాత్మ గోవర్ధనరూపియై, గోపాలురు సమర్పించిన నైవేద్యములను **"గోవర్ధనోఽస్మి"** అనుచు ఆరగించెను. అపుడు కోపించిన ఇంద్రుడు కురిపించిన ధారావర్షము బారినుండి రేపల్లెలోని అందఱను రక్షించుటకై స్వామి గోవర్ధనమును **"కున్ఱుకుడైయా ఎడుత్తాయ్"** అనునట్లు గొడుగుగా **"విహారపద్మస్పృహయైవ"** అనురీతిలో అవలీలగా తామరపూవును వలె ఎత్తెను. అన్నిటిని తన స్వరూపముతోను, దివ్యమంగళ విగ్రహమునందు అస్త్రభూషణరూపముగను ధరించు స్వామికి ఈ గోవర్ధనము ఏపాటిది? ఈ అర్థము **"అథో"** అను పదము ద్వారా వ్యక్తము. **"స్వరూపతో విగ్రహతశ్చ విశ్వం నిత్యం త్వయైకేన ధృతం యదేతత్, తదేకదేశోద్వహనాద ముష్మాత్ న విస్మయం తత్త్వవిదో భజంతి"** అను దేశికసూక్తి ఇచట స్మరణీయము. **"మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ"** అను కోశవచనమునుబట్టి **'అథో'** అనగా మంగళకరముగా అనియు అర్థము చెప్పవచ్చునని వేరొక వ్యాఖ్య. **"మహమ్"** అనుటకు బదులు **"మఖమ్"** అను పాఠాంతరము కలదు. మఖమనగా దేవపూజారూపమైన యజ్ఞము. **"గోపశిశుభావ మనుభవితుమనాః భవాన్ కథ మిత్థ మనుష్ఠితవా మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**45.** **వేణుక్వణప్రణయిని త్వయి లోకనాథ**
**బృందావనం చరణసంచరణైః పునానే ।**
**భావా స్తదా వనభువః కీల కీదృశ స్తే**
**త్వద్గీతసిక్తసికతాసు వసుంధరాసు ॥**

లోకనాథ = జగత్పతీ! త్వయి = నీవు, వేణుక్వణ ప్రణయిని = వేణుగానప్రియుడవై, చరణసంచరణైః = పాదసంచారములతో, బృందావనం = బృందావనమును, పునానే (సతి) = పావనము చేయువాడవుకాగా, తదా = అపుడు, త్వద్గీత = నీ వేణుగానమనెడి అమృతముచే, సిక్త = తడుపబడిన, సికతాసు = ఇసుకతిన్నెలను కల, వసుంధరాసు = భూప్రదేశములందలి, వనభువః = అరణ్యములో పుట్టిన వస్తువుల, తే = ఆ, భావాః = పదార్థములు, కీదృశః = ఎట్టివి అయ్యెను ?

శ్రీకృష్ణుని వేణుగాన వైభవమును అనిర్వచనీయమైన రీతిలో ఇందు ప్రస్తుతించుచున్నారు.

లోకనాథా! నీవు త్రిభంగీలలితాంగుడవై, వేణుగానమును చేయుచు బృందావనములో సంచరించునపుడు ఆ కాంతారములోని చల్లని ఆ అరణ్యభూములలో పుట్టిన సకలచరాచరములు నీగానామృతమును ఆస్వాదించి పడిన పాట్లు ఎట్టివో కదా! అని భావము.

**(వేణుక్వణప్రణయిని)** – **"ఇడవణరై ఇడత్తోళొడు శాయ్త్తు ఇరుకైకూడ ప్పురువమ్ నెఱినేడ, కుడవయిఱు పడవాయ్ కడై కూడక్కోవిన్దన్ కుழలూదినపోదు"** అను పెరియాழ்వార్ల (3–6–2) సూక్తి స్మరణీయము. వేణువు గోపికలను ఆకర్షించుటలో శ్రీకృష్ణునకు సాధనము. ఇది ఏడు రంధ్రములను కల్గినది. ఈ ఏడు రంధ్రములనుండి వెలువడు ధ్వనులు సామవేదముయొక్క సప్తస్వరములేనని **"సామోపపన్నాన్ క్రమశః స్వరంధ్రైః సప్తస్వరాన్ సప్తభి రుద్గమంతమ్, ప్రచక్రమే వాదయితుం వనాంతే వంశం ప్రియో వల్లవవంశజానామ్"** అను దేశికుల యాదవాభ్యుదయసూక్తి తెలుపుచున్నది.

**(బృందావనమ్ చరణసంచరణైః పునానే)** – **"బృందావనం భగవతా కృష్ణేనాక్లిష్టకర్మణా, శుభేన మనసా ధ్యాతమ్" (విష్ణు.5–6–29)** అను రీతిలో భగవానుడు బృందావనసీమనుగూర్చి తన మనస్సున తలపగానే **"ఉత్పన్ననవశష్పాఢ్యా"** అనునట్లు దానికి సర్వసమృద్ధి కల్గెను. ఇక చరణసంచారములతో పావనమయ్యెననుట చెప్పవలెనా! **"సంచరణైః"** అన్నంతమాత్రముననే సరిపోవుచుండగా, చరణశబ్దమును అధికముగా ప్రయోగించుట, **"కానకమెల్లామ్ తిరిన్దు ఉన్కరియ తిరుమేని వాడ"** అనుచు భట్టనాథులు మనస్సున ఆర్తిని పొంది పల్కినట్లే, కూరేశులును స్వామి చరణసంచారములందు అభినివేశమును పొంది పల్కుటను తెలుపుచున్నది.

**(తదా వనభువః భావాః కీదృశః)** – భట్టనాథులు **"నావలమ్ పెరియతీవు"** (3–6) అను దశకములో **"కఱవైయిన్ కణఙ్గళ్ కాల్ పరప్పిట్టు క్కవిழ்న్దిఱఙ్గిచ్చెవి యాట్టకిల్లావే"** అనియు, **"మరుణ్డు మాన్ కణఙ్గళ్ మేయ్కై మఱన్దు మేయ్న్దపుల్లుమ్ కడైవాయ్ వழிశోర, ఇరణ్డుపాడుమ్ తులుఙ్గా పుడైపెయరా ఎழுదుశిత్తిరఙ్గళ్ పోల నిన్డనవే"** అనియు, **"మరఙ్గళ్నిన్డు మదుదారైగళ్ పాయుమ్ మలర్కళ్ వీழுమ్ వళర్ కొమ్బుకళ్ తాழுమ్ ఇరఙ్గుమ్ కూమ్బుమ్ తిరుమాల్ నిన్ద నిన్డపక్కమ్ నోక్కి అవైశెయ్యుమ్ కుణమే"** అనియు పలు రీతులలో అద్భుతముగా పల్కిన సూక్తులను మనస్సున నుంచుకొని, వానిని తాము అట్లు చెప్పలేనంత అభినివేశమును పొందినవారగుటచే **"కీదృశః"** అనుచు ఆ స్వామినే కూరేశులు ప్రశ్నించుచున్నారు.

శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవోత్తరశతకములో **"శైలోఽగ్నిశ్చ జలాంబభూవ మునయో మూఢాంబభూవు ర్జడాః ప్రాజ్ఞా మాసుః"** ఇత్యాదిగా ప్రారంభించి, **"త్వం తేష్వన్య – తమాం బభూవిథ భవద్వేణుక్వణోన్మాథనే"** అనుచు భగవానుని ప్రశ్నింపకనే తమను తాము తమాయించుకొని ముగింప శక్తులైరి. కాని, అత్యంతమృదుహృదయులగు కూరేశులు ఆమాత్రముకూడ పలుక శక్తిలేనివారై **"కీదృశః"** అను ప్రశ్నతోనే ముగించిరి అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్యాసూక్తి.

**"భావాః"** అను పదము **"భావః సత్తాస్వభావాభిప్రాయచేష్టాత్మజంతుషు"** అను కోశవచనమును బట్టి అనేకార్థకము. ప్రాణిసామాన్యవాచకముగా గ్రహించి దేశికులు



యాదవాభ్యుదయములో బ్రహ్మ మొదలు ప్రాణులన్నియు స్వామి వేణుగానము విని, యోగులవలె సమాధిస్థితిని పొందినవనుటను – **"తద్వంశనాదః సుభగోఽనుగచ్ఛన్ అగ్రేసరం సౌరభమామమానామ్, అయత్ననిష్పన్నమనస్సమాధీన్ ఆబ్రహ్మకాన్ ఆతనుతేవ జంతూన్"** అను శ్లోకములో తెల్పిరి. అట్లే, జంతువులన్నియు అరమోడ్పు కన్నులతో ఒక దానితో వేరొకటి కలసి బృందములై, ఆనందము పొందినవనుటను – **"శ్రుణ్వద్భి రుద్వాంతమధుప్రవాహం వంశస్వనం తస్య సుధైకవంశమ్, సయూథ్యతాం నూన మవాప్య సర్వైః సత్త్వైః స్థితం సామినిమీలితాక్షైః"** అనుచు పల్కిరి. అట్లే, **"వనభువః"** అను పదము లక్షణయా వృక్షశాఖలను కూడ తెల్పును. అపుడు భట్టనాథుల **"మరఙ్గళ్ నిన్డు మదుదారైకళ్ పాయుమ్, మలర్కళ్వీழுమ్, వళర్కొమ్బుకళ్ తాழுమ్, ఇరఙ్గుమ్ కూమ్బుమ్.. . "** ఇత్యాది భట్టనాథసూక్తిని వృక్షములు పొందిన స్థితికి ఉదాహరణముగా గ్రహింపనగును. ఈ అర్థమును దేశికులు **"మధుద్రవైరుల్బణసంమదాశ్రూణ్యాలేఖ్యనిస్స్పందమృగద్విజాని, ఉదగ్రకోశోత్పులకాని కృష్ణో వంశీనినాదేన వనాన్యకార్షీత్"** అను శ్లోకమున నుడివిరి.

**(తే వనభువః)** – ఇచటి **"తే"** అను సర్వనామము అట్టి గొప్ప భాగ్యమునుకల్గిన అను అర్థమునిచ్చును.

**(త్వద్గీతసిక్తసికతాసు వసుంధరాసు)** – ఇసుకతో నిండిన తీరప్రదేశములు పలు సంపదలను కురియు వనములైనవి అను అర్థమిచట **"వసుంధరతీతి వసుంధరా"** అను యోగవ్యుత్పత్తి ద్వారా ధ్వనించుచున్నది. గానప్రభావముచే వృక్షములు, లతలు వృద్ధిపొందుట శాస్త్రజ్ఞులు, వేదాంతులును అంగీకరించిన విషయమే కదా!. పరాశరభట్టర్ **"అజస్రసహస్రగీతిసేకోత్థదివ్యనిజసౌరభమ్" (శ్రీరంగరాజ.పూర్వ.)** అనుచు సహస్రగీతిగానమువలన పున్నాగవృక్షమునకు దివ్యసౌరభము కల్గెనని పల్కుట ఇందులకొక నిదర్శనము. **"సిక్త"** అను పదప్రయోగముచే దానముయొక్క అమృతధారాసామ్యము ధ్వనించుచున్నది.

**46.** **ధన్యైః శ్రుతం తదిహ తావకరాసకాలే**
**గీతేన యేన హి శిలాః సలిలాంబభూవుః ।**
**పంచాపి కించ పరివృత్తగుణాని భూతా–**
**న్యుర్వీకృశానుమరుదంబరశంబరాణి ॥**

ఇహ = ఈ లోకములో, తావక = నీ యొక్క, రాసకాలే = రాసక్రీడసమయమున, యేన = ఏ, గీతేన = వేణుగానముచే, శిలాః = శిలలు, సలిలాంబభూవుః = నీటిబుగ్గలైనవో, కించ = మఱియు, ఉర్వీ = భూమి, కృశాను = అగ్ని, మరుత్ = గాలి. అంబర = ఆకాశము, శంబరాణి = నీరు అను, పంచ = అయిదు, భూతాని అపి = భూతములును, పరివృత్తగుణాని= మాఱిన గుణములను కల్గినవి, బభూవుః = అయినవో, తత్ = ఆ, గీతం = వేణుగానము, ధన్యైః=

పుణ్యాత్ములచే, శ్రుతమ్ = వినబడినది.

శ్రీకృష్ణుని వేణుగానమును వినిన అదృష్టమును పొందిన వారిని శ్లాఘించుచున్నారు.

స్వామీ! నీవు రాసక్రీడను చేయుసమయమున ఆలపించిన వేణుగానమునకు రాళ్ళు సైతము కఱిగి నీరైనవి. పంచభూతములగు భూమి, అగ్ని, వాయువు, ఆకాశము, నీరును తమ తమ సహజగుణములను వీడి, వేరు గుణములను పొందినవి. ఇట్టి అద్భుతమైన నీ వేణుగానమును ధన్యాత్ములు మాత్రమే వినగల్గిరి కదా!.

**(తావకరాసకాలే)** – రాసక్రీడ ఒక నృత్తవిశేషము. దీనిని భగవానుడు గోపికలతో కలసి ఆడెను. **"అంగనా మంగనా మంతరే మాధవో, మాధవం మాధవం చాంతరేణాంగనా"** అను రీతిలో పలురూపములనుపొందిన భగవానుడు, గోపికలును పర్యాయముగా వృత్తాకారమున నిలచి, లయబద్ధముగా, గానపూర్వకముగా ఆడు నృత్తవిశేషమే రాసక్రీడ. దీనిని ఆళ్వార్లు **"కురవై కోర్త్తు"** గా పల్కిరి. దీని లక్షణమును **"లబ్ధ్వా దుగ్ధ మహోదధౌ సురగణైః పీత్వాఽమృతం య స్తదా పిండీశృంఖలికావిశేషసహితో యుక్తో లతాభేద్యకైః, చిత్రాతోద్యపదక్రమై ర్లయయుతో భేదద్వయాలంకృతః చారీఖండసుమండలై రనుగతః సోఽయం మతో రాసకః"** అని లక్షణశాస్త్రములో తెలుపబడినది. ఈ రాసక్రీడప్రస్తావన ఋగ్వేదములోనే కలదనుచు హరివంశవ్యాఖ్యాత నీలకంఠుడు (విష్ణుపర్వము – 20వ అధ్యాయము) అందులకు **"పద్యావస్తే పురురూపా వపూంషి ఊర్ధ్వా తస్థౌ త్ర్యవిం రేరిహాణా, ఋతస్య సద్మ విచరామి విద్వాన్ మహద్దేవానా మసురత్వ మేకమ్" (ఋగ్వే.3–55–14)** అను మంత్రమును ఉదాహరించెనట. **"రాసో నామానేక తాళప్రబంధోఽనేకపాత్రో మండలాకారో నృత్తవిశేషః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"అన్యోన్యసంవలితకరానేకపాత్రోఽనేక తాళప్రబద్ధో మండలాకారనృత్తవిశేషో రాసః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య (51వ శ్లోక వ్యాఖ్య)

**(గీతేన యేన)** – ఇచట గీతమనగా శ్రీరాగమని. ఇది గోపికలను వశీకరించు రాగమని వేరొక వ్యాఖ్య. ఈ రాగమును స్వామి వేణువుపై ఆలపించెనట.

**(శిలాః సలిలాంబభూవుః)** – శిలలనగా రాళ్ళు అని మాత్రమే కాక, శిలలవలె కఠిన పదార్థములనియు చెప్పవచ్చును. అవి అన్నియు ద్రవించినవి. **"శైలోఽగ్ని శ్చజలాం బభూవ"** అని పరాశరభట్టర్ సూక్తి.

**(పంచాపి పరివృత్తగుణాని భూతాని)** – పూర్వార్ధములోని **"యేన"** అను పదమును ఇచటను అన్వయించుకొనవలెను. కృశానుశబ్దము తేజోరూపియగు సూర్యునికూడ తెలుపును. పంచభూతముల గుణములు మాఱిపోవుట అనగా–పృథివి తనయొక్క గుణము అగు కాఠిన్యమును పోయి మృదుత్వమును పొందుట, తేజఃపదార్థములు దాహకత్వమును కోల్పోయి చల్లగానుండుట, వ్యాపించుగుణమునుకల జలము ఆ వేగగుణమును పోగొట్టుకొనుట, కంటికి కానరాని ఆకాశము



స్పష్టముగా కంటికి కన్పించుట, సదాగతియైన వాయువు స్థిరముగా నిలచియుండుట – అని ఇత్యాదిగా భావింపనగును. ఇట్లు సహజమైన స్వభావము మారిపోవునా? అనినచో మణిమంత్రాదిప్రభావముచే అగ్న్యాదుల దాహకత్వశక్తి లేకుండపోవుననుట శాస్త్రసిద్ధమేకదా! మఱియు, **"శీతో భవ హనూమతః" (సుందర.53–28)** అను సీతాదేవి సంకల్పానుసారము అగ్ని చల్లనివాడై, హనుమంతుని దహింపనట్లే, ఇదియును సంభవమేనని తలపనగును. **"వ్యత్యస్తగుణానీతి వా"** అని రామానుజాచార్యవ్యాఖ్య. అనగా ఒకదాని గుణము వేరొకదానికి కల్గెనని భావము. ఇది **"శైలోఽగ్నిశ్చ జలాంబభూవ" (శ్రీరంగరాజ.ఉత్తర)** అను సూక్తికి అనుగుణము.

**(తత్ తవ గీతం ధన్యైః శ్రుతమ్)** – అచేతనవస్తువులుసైతము వికారము పొందునట్లు చేయగల్గు అట్టి నీ వేణుగానమును అపుడు జన్మించిన భాగ్యశాలురు మాత్రమే ఆలకింపగల్గిరి. **"కరువిలే తిరువిలాదీర్"** అనునట్లు భాగ్యహీనులగు నావంటివారు ఈ గీతమును విను అవకాశమెక్కడిది? **"నన్దన్ పెఱ్ఱవన్ నల్విళైయిల్లా నజ్గళ్ కోన్ వశుదేవన్ పెఱ్ఱిలనే" (పెరుమాళ్.7–3)** అనునట్లు ఇపుడు జన్మించి, మనస్సున క్లేశపడు ప్రాప్తిని మాత్రమే పొందితిమి. అంతియే – అని భావమని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య. ఇది స్వరవిశేషముచే వ్యక్తమగు ధ్వని. **"సనాద్యంతా ధాతవః"** అను పాణినిసూత్రప్రకారము సలిల శబ్దమునకు ధాతుసంజ్ఞ కల్గి, **"కాన్ ప్రత్యయా దామమంత్రే లిటి"** అను సూత్రముచే **"అను"** ప్రయోగమువచ్చి, **"సలిలాం బభూవుః"** అను రూపము సిద్ధించినది.

**47.** **తేభ్యః కృతీ న కిల కశ్చి దిహాస్తి యే వై**
**రాసోత్సవోత్సుకధియ స్తవ కాననాంతే ।**
**వేణుస్వనస్రుతరసౌఘపరిప్లుతాం తే**
**స్వే సృక్విణీ రసనయా లిలిహు ర్భుజంగాః ॥**

యే = ఏ, భుజంగాః = సర్పములు, కానన + అంతే = బృందావనప్రదేశములో, రాస + ఉత్సవ = రాస క్రీడలో, ఉత్సుకధియః = ఉత్కంఠితమైన మనస్సునుకల, తవ = నీ యొక్క, వేణుస్వన = వేణుగానముచే, స్రుత = ప్రవహించిన, రస + ఓఘ = రస ప్రవాహముచే, పరిప్లుతాం = తడుపబడిన, స్వే = తమయొక్క, సృక్విణీ = పెదవుల మూలమును, రసనయా = నాలుకచే, లిలిహుః = ఆస్వాదించినవో, తేభ్యః = ఆ సర్పములకంటే, కృతీ = కృతార్థుడు, కశ్చిత్= ఎవడును, ఇహ = ఈ లోకములో, నాస్తి కిల = లేడు కదా!

వేణుగానసమయమున సర్పములు పడిన పాట్లను ఇందు వర్ణించుచున్నారు. **"శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణీ"** అనునట్లు సర్పములకును గానాస్వాదనశక్తి కలదని కదా సూక్తి. పూర్వశ్లోకమున తెలిపిన స్వాభావికగుణవ్యత్యాసము సర్పముల విషయమున అన్వయించుచున్నారని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

నీ వేణుధ్వనిని చెవులార విని, అనుభవించిన సర్పముల ఓష్ఠప్రాంతభాగములందు అమృతరసము స్రవింపగా, ఆ రసమును అవి తమ నాలుకలతో ఆస్వాదించి తృప్తిని పొందినవి. ఆ భుజంగములకంటె ధన్యాత్ముడు వేఱొకడు కలదా! సర్పముల విషము కూడ అమృతమై పరిణమించుట ఆశ్చర్యము. అందుచే వానికి మించిన అదృష్టవంతులు లేరని భావము. **"వేణుగానశ్రవణేన విషధరస్యాంతర్గతం విష మేవామృతతయా పరిణతమ్, అత స్తేభ్యో భాగ్యాధికా భువనే న భవంతీతి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య.

ఇట్లు సర్పవిషముకూడ వేణుగానప్రభావమువలన అమృతమయ్యెననుటను శ్రీపరాశరభట్టర్ – **"అమృతా మాసుః మహాశివిషాః . . . భవద్వేణుక్వణోన్మాథనే" (శ్రీరంగరాజ.ఉత్తర)** అనుచు తెల్పిరి. భగవత్సంకల్పమువలన విషముకూడ అమృతమగునని **"విష మప్యమృతం క్వచిత్ భవేత్"** అనుచు కాళిదాసమహాకవి రఘువంశములో (8–46) పల్కెను కదా! సముద్రమథన సందర్భమున పుట్టిన హాలాహలమును పరమశివుడు **"అచ్యుతానంతగోవింద"** నామోచ్చారణమును చేయుచు త్రాగగా, అది అమృతమయ్యెనని పాద్మోత్తరములోని నామత్రయవిధానమునగల **"అచ్యుతానంతగోవిందమంత్ర మానుష్టుభం పరమ్, ఓన్నమస్సంపుటీకృత్య జపత్ విషధరో హరః"** ఇత్యాదిగానున్న సూక్తి తెలుపుచున్నదని వేరొక వ్యాఖ్య. క్రూరములైన సర్పములును అమృతమును స్రవించినవనుటచే, కావ్యార్థాపత్తిమర్యాదద్వారా కైముతికన్యాయమున సకలజీవులు వేణుగానమునకు ఆకర్షితులై, భగవానుని దివ్యావయవసౌందర్యగుణాదులకు కట్టుబడి, పరస్పర వైరుధ్యమును వీడి, అందఱు మంచి స్వభావమును కల్గినవారైరి అను భావము స్ఫురించుచున్నది. ఈ అర్థస్ఫురణకు అనుగుణముగా ఇచట **'భుజంగ'** శబ్దప్రయోగము చేయబడినది **"భుజంగ శబ్దము" ("భుజంగః సర్పవిటయోః"** అను కోశసూక్తివలన) విటుని కూడ తెల్పును. ధూర్తులు తమ విటస్వభావమును వీడి అమృతమయమైన వాక్కును పొందిరనియు భావము. అని వ్యాఖ్యానాంతరము.

**"రాసోత్సవోత్సుకధియః"** అనువిశేషణమును **"భుజంగాః"** అను పదమునకు అన్వయించి, కొందఱు అర్థము చెప్పిరి. కాని అది స్వరసము కాదు. **"తేభ్యః కృతీ న కిల కశ్చి దిహాస్తి"** అనుచు మొదటిపాదములో తెలుపబడిన అర్థము మిగిలిన మూడు పాదములచే సమర్థింపబడుటచే వాక్యార్థసమర్థనరూపకావ్యలింగాలంకారము. **"బహిః నిస్సృతామృతరస ప్రవాహగ్రహణార్థ మంత రిలిహాః ఇత్యర్థః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. అనగా తమ నోటినుండి బయటకు స్రవించు అమృతరసమును గ్రహించుటకై సర్పములు నాలుకతో ఆ రసమును లోనికి నాకినవి అని అర్థము.

48. **అంభోదనీల మరవిందదళాయతాక్షం**
**పింఛావతంస మురరీకృతవేణుపాణిమ్ ।**
**త్వాం గోపవేషపరికర్మితకాయకాంతిం**



**ధన్యా స్తదా దదృశు రున్మథితాన్యభావాః ॥**

తదా = ఆ రాసక్రీడసమయమున, అంభోదనీలం = మేఘమువలె నల్లనివాడవు, అరవిందదళ = పద్మపత్రములవలె, ఆయత = వెడల్పైన, అక్షం = కన్నులను కలవాడవు, పింఛ+అవతంసం = నెమలిపింఛమును శిరోభూషణముగా కలవాడవు, ఉరరీకృతవేణుపాణిమ్ = చేతియందు వేణువును కలవాడవు, గోపవేష = గోపాలవేషముతో, పరికర్మిత = అలంకరింపబడిన (సంస్కరింపబడిన), కాయకాంతిమ్ = శరీరకాంతిని కలవాడవు అగు, త్వాం = నిన్ను, ధన్యాః = పుణ్యాత్ములు, ఉన్మథిత + అన్యభావాః = అనన్యమనస్కులై, దదృశుః = సేవింపగల్గిరి.

పెరియాళ్వార్ తిరుమొழிలోని **"తழைయుమ్ తొఙ్గలుమ్"** అను దశకప్రక్రియలో కూరేశులు ఈ శ్లోకమును సాయించిరి అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య. ఆ దశకములోని **"శాలపన్నిరైప్పిన్నే తழைక్కావిన్ కీழ்త్తన్ తిరుమేని నిన్ఱు ఒళి తికழ நీల నన్నఱుఙ్కుఞ్జి నేత్తిరత్తాలణిన్దు, పల్లాయర్ కుழாమ్ నడువే కోలచ్చెన్దామరైక్కణ్ మిళిరక్కుழలూది ఇశైపాడి క్కునిన్దు ఆయరోడు ఆయత్తు వరుకిన్ఱ ఆయప్పిళ్లై అழకుకణ్డు ఎన్మకళ్ అయర్క్కిన్ఱదే" (పెరియా.3–4–7)** అను పాశురము ఈ శ్లోకముగా పరిణమించిన తీరు అత్యంతము హృద్యము.

నీటితోనిండిన మేఘమువలె నల్లని వర్ణమును కలవాడవు, పద్మపత్రములవంటి విశాలమైన కన్నులను కలవాడవు, నెమలి పింఛమును శిరోభూషణముగా కలవాడవు, చేతిలో పిల్లనగ్రోవిని కలవాడవు, గోపాలవేషముతో బహుగుణీకృతమైన దేహకాంతిని కలవాడవు అగు నిన్ను వేరొక భావమేమియు మనస్సున లేనివారై, దర్శించినవారు ఎంత పుణ్యాత్ములో కదా!

**(అంభోదనీలమ్) – "మழைక్కాలో వరుకిన్ఱదు"** అని, **"పుయల్ మழைవణ్ణన్" (తి.వా.2–10–2)** అని మొదలైన దివ్యసూరి సూక్తుల అర్థమును అనుసరించి ఈ విశేషణము ప్రయోగింపబడినది. చాతకపక్షులు మేఘములు కుఱియు వర్షముకొఱకు ఎదురుచూచునట్లే, పరమైకాంతులు అమృతత్వప్రాప్తి కొఱకు భగవానుడను మేఘముకొఱకై ఎదురుచూచెదరు. **"అమృతస్యందినం కించిత్ కృష్ణమేఘ మనుస్మరన్, ఉదన్యయా న వేశంత ముదన్వంతం చ వీక్షతే"** అను దేశికుల సుభాషితనీవి శ్లోక మిచట ప్రస్తావనార్హము.

**(అరవిందదళాయతాక్షమ్) – "ఇలఙ్గొళిశేర్ అరవిన్దమ్ పోన్ఱు నీణ్డ కణ్ణానై" (కలియన్.2–5–8)** అను ఆళ్వార్లసూక్తికి ప్రతిరూపము ఈ ప్రయోగము. ఇది సర్వేశ్వరత్వసూచకము. వేదమును **"తస్య తథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" (ఛాందో.1–6–6)** అనుచు సహస్రాక్ష, విరూపాక్ష, మదిరేక్షణులకంటె పుండరీకాక్షుడగు పరమాత్మ భిన్నుడని, అతడే ఉపాస్యుడని అన్నది.

**(పింఛావతంసమ్) – "నీల నన్నఱుఙ్కుఞ్జి నేత్తిరత్తా లణిన్దు" (పెరియా.3–4–7)** అను భట్టనాథసూక్తి ఇచట భావనీయము. **"కరుఙ్కణ్ తోకైమయిత్పీలణిన్దు"** ఇత్యాది

ప్రయోగములును స్మరణీయములు.

**(ఉరరీకృతవేణుపాణిమ్)** – **"ఇడవణరై ఇడత్తోళోడు శాయ్త్తు ఇరుకైకూడ పురువమ్ నెఱిన్దేఱ క్కుడవయిఱు పడవాయ్కడైకూడ క్కోవిన్దన్ కుழలూదినపోదు"** **(పెరియా. 3-6-2)** అని, **"శిఱువిరల్కళ్ తడవి ప్పరిమాఱ"** అనియు గల పెరియాழ్వార్ల సూక్తిని భావించుచు ఈ ప్రయోగము చేయబడినది. స్వామి వేణువు నూదునపుడు అతని వ్రేళ్ల కదలికలు, చేతులున్న భంగిమ ఇత్యాదులన్నియు ఈ విశేషణమువలన వ్యక్తమగుచున్నవి.

**(గోపాలవేషపరికర్మితకాయకాంతిమ్)** – **"శీలక్కుదమ్బై యొరుకాదు యొరుకాదు శెన్నిఱమేల్ తోన్ఱి ప్పూకోలప్పణైక్కచ్చుమ్ కూఱైయుడైయుమ్ కుళిర్ ముఱ్ఱిన్ కోడాలముమ్ కాలిప్పిన్నే వరుకిన్ఱ కడల్ వణ్ణన్ వేడమ్"** అని, అట్లే **"వలజ్కాదిల్ మేల్ తోన్ఱియ పూవణిన్దు"** **(పెరియా. 3-3-1)** అనియు గల దివ్యసూరిసూక్తులు భావ్యములు. **"శిన్దూరప్పొడికొణ్డు శెన్నియప్పి త్తిరునామమిట్టు అజ్గోర్ ఇలైయన్దన్నాల్ అన్దరమిన్ఱి త్తన్నేఱి పజ్గియ అழకియ నేత్తిరత్తాలణిన్దు"** అని, **"శిన్దూరమిలజ్గ త్తన్ నెఱ్ఱిమేల్ తిరున్దియ కోఱమ్బుమ్ తిరుక్కుழలుమ్"** అని, **"కారోక్కోడల్ పూచ్చూడి వరుకిన్ఱ"** అనియుగల పలు సూక్తుల భావము అనుసంధేయము.

**(త్వామ్)** – **"శాల పన్నిరైప్పిన్నే" (3-4-7)** ఇత్యాది భట్టనాథోక్తపాశురార్థమిచట స్మృతికి తెచ్చుకొననగును అని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(ధన్యా స్తదా దదృశుః)** – **"ధన్యాః పశ్యంతి మే నాథమ్" (సుందర. 25-16)** అనుచు సీతాదేవి పల్కిన రీతిలో కూరేశులు పల్కుచున్నారు. **"కాలిప్పిన్నే వరుకిన్ఱ కడల్ వణ్ణన్వేడత్తై వన్దుకాణీర్"** అని యశోద, **"ఎన్దు మివనై యొప్పారైనజ్గాయ్ కణ్డఱియే నేణివన్దు కాణాయ్"** అని గోపికలును పిలచి చూపింపగా దర్శించినవారు భాగ్యాతిశయమువలన కృతార్థులయ్యిరి. భాగ్యలోపముచే మనము ఈనాడు ఆ అదృష్టమునకు నోచుకొనలేదు కదా అని కవి వాపోవుచున్నారు.

**(ఉన్మదితాన్యభావాః)** – **"ఎజ్గుమ్ కావలుమ్ కడన్దు" (3-5-1)** అను భట్టనాథుల సూక్త్యర్థము స్మరణీయము. అట్టి రూపమునుకల స్వామిని దర్శించిన పిమ్మట వేరొక విషయమందు మనస్సు పోవునా? **''అనన్యా శ్చింతయంతో మామ్'' (భ.గీ. 9-22)** అనునట్లు ఇతరదేవతాసంబంధములేనివారై అని కొందఱు వ్యాఖ్యానించిరి గాని అది అంత స్వరసము కాదు. **"అరజ్గనైక్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే" (అమలనాది)** అను రీతిలో ఉక్తసన్నివేశములోని గోపాలరూపమును తప్ప భగవానుని వేరొకరూపమును కూడ తలంపనివారై అనియే అర్థము. **"ఇనిప్పోయ్ ఒరువన్ తనక్కు పణిన్దు కడైత్తలైనిఱ్కై నిన్ శాయై యழివు కణ్డాయ్"** అను భట్టనాథ (5-3-3) సూక్తివలె అన్యార్థాభిగమనము లేనివారై అని, **"కూఱైశోఱు ఇవై వేణ్డువతిల్లై"** (5-1-4) అనునట్లు అన్యార్థప్రవృత్తిలేనివారై అని, **"ఉన్నిత్తు మఱ్ఱొరుదెయ్వమ్ తొழాళ్**



**అవనైయల్లాల్" (తి.వా. 4-6-10)** అనునట్లు అన్యయజనభావనలేనివారై అని అర్థమని, ఇవి అన్నియు ఇచట ప్రసన్న గంభీరమైన కూరేశుల సూక్తిచే ధ్వనించుచున్నవని వ్యాఖ్యానాంతరములలో కలదు. ఇందలి ఔచిత్యమును సహృదయులే గ్రహింపగలరు. **"ధన్యాః ... భావాః"** అనుటచే అనన్యభావనతో కూడిన భగవద్విగ్రహ సౌందర్యానుభవము అదృష్టవంతులకుమాత్రమే లభించునని ఈ శ్లోకము ధ్వనించుచున్నది. **"విషయాంతరవిముఖతయా భగవద్విగ్రహసౌందర్యానుభవో భాగ్యాధికానా మేవ భవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**49.** **గోవర్ధనో గిరివరో యమునా నదీ సా**
**బృందావనం చ మధురా చ పురీ పురాణీ ।**
**అద్యాఽపి హంత సులభాః కృతినాం జనానాం**
**ఏతే భవచ్చరణచారజుషః ప్రదేశాః ॥**

గిరివరః = గొప్ప పర్వతమగు, గోవర్ధనః = గోవర్ధనము, సా = ఆ, యమునానదీ = యమున అనునది, బృందావనం చ = బృందావనమును, పురాణీ = పురాతనమైన, మధురాపురీ= మధురానగరము – అను, భవచ్చరణ = నీ పాదముల, చార = సంచారములను, జుషః = అనుభవించిన, ప్రదేశాః = స్థలములు, కృతినాం = కృతార్థులైన, జనానామ్ = జనులకు, అద్య+ అపి = ఈనాడుకూడ, సులభాః = సులభములైయున్నవి.

ఆనాడు జన్మింపక, నష్టపోయిన వారుకూడ ఒకవిధముగా సమాధానము పొందుటకు మార్గము కలదు కదా! అని కూరేశులు ఇందు సంతోషించుచున్నారని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి అవతారక పర్వతశ్రేష్ఠమైన గోవర్ధనము, అనిర్వచనీయవైభవమునుకల ఆ యమునానది, బృందావనము, పురాతనమైన ఆ మధురానగము అను ఇవి అన్నియు నీపాదసంచారములను పొందిన ప్రదేశములు. వానిని అదృష్టవంతులు ఈనాడును దర్శింపగల్గుచున్నారు కదా!

**(గోవర్ధనః గిరివరః)** – **"కాలికళుయ్య మలైతడుత్తు కొఱ్ఱైక్కుడైయాక ఏన్దనిన్ఱ గోవర్దనత్తు ఎన్నై ఉయ్త్తుడుమిన్"** అనుచు గోదాదేవి (12-8) పల్కినట్లు గోవర్ధనగిరిని ఇపుడును దర్శింపగల్గుచున్నాము కదా!. **"విష్ణుః పర్వతానా మధిపతిః"** అని వేదము పల్కురీతిలో పర్వతములన్నిటికిని భగవానుడే అధిపతియైనను, శ్రీకృష్ణావతారములో స్వామి తన చేతితో గొడుగు ఎత్తినట్టి వైశిష్ట్యము ఈ గోవర్ధన పర్వతమునకు కలదు. మఱియు ఇది భగవదాత్మకమనుటను **"త మద్రిశృంగే సముదీక్షమాణాః గోపం సతాం గోపగణాః ప్రణేముః"** నందగోపాలాదులు, గోపాలురు ప్రత్యక్షముగా దర్శించిరి కదా! గోవర్ధనమను పదము **"గాం వర్ధయతీతి గోవర్ధనః"** అను యోగవ్యుత్పత్తి ద్వారా గోవర్ధన పర్వతమును, భగవానుని ఇద్దఱిని తెల్పుటను గమనింపనగును. ఈ పర్వతములోని వానరములు తమ పిల్లలను నిద్రపుచ్చునపుడు హనుమానుని కీర్తిని పాడుచు, "నీవు అతనియందు భక్తిని కలవాడవైనచో, ఆ హనుమానునివలెనే

భగవత్కైంకర్యమును చేయగలవని" పల్కుచున్నావనుటను భట్టనాథులు **"అడఙ్గచ్చెన్ఱు ఇలఙ్గైయై ఈడళిత్త అనుమన్ పుకళ్ప్పాడి త్తమ్ కుట్టన్కళై కుడఙ్గైక్కొణ్డు మన్దికళ్ కణ్వళర్త్తుమ్ గోవర్త్తనమెన్నుమ్ కొత్తుక్కుడైయే"** (3-5-7) అను పాశురములో పల్కిరి కదా! ఇట్లు ఈ పర్వతములోని తిర్యక్కులుకూడ ఇప్పుడును సాత్త్విక ప్రకృతిని కల్గినవై, ఇతరులకు ఉపదేశము చేయుస్థితిలోనున్నవి అనగా – ఈ పర్వతము ఎంత గొప్పదో తెలియుచున్నది. **"సుభగః చిత్రకూటోఽసౌ . . . యస్మిన్ వసతి కాకుత్స్థః" (అయో. 98-27)** అని చిత్రకూటమునుగూర్చి వాల్మికి, **"గోమంతః పర్వతో రాజన్ సుమహాన్ సర్వధాతుమాన్, వసతే భగవాన్ యత్ర"** అని భీష్ముడును (వ్యాసమహర్షి), **"పుణ్యా ద్వారవతీ యత్ర తత్రాస్తే మధుసూధనః"** అనియు స్తుతించినట్లే కూరేశులును భగవానుని హస్తపాదస్పర్శను పొందిన గోవర్ధన గిరిని **"గిరివరః"** అనిరి.

**(యమునానదీ సా)** – **"తూయపెరునీర్ యమునై"** అనునట్లు శ్రీకృష్ణుడు, గోపికలును స్నానము చేయుటచే యమునానది స్నానపుణ్యోదక అయినది. **'సా'** అను సర్వనామము ఇట్టి అనిర్వచనీయ వైలక్షణ్యమును కల్గినదనుటను తెల్పును. గంగాదినదులకు భగవానుని పాదసంబంధము మాత్రమే కలదు. యమునానదికి స్వామి తన దివ్యదేహముతో అందు స్నానము చేయుటవలన, అందు కాళియుని మదమణచుటచేత జలక్రీడలు సల్పుటచేత, గోవులకు ఉపకరించుటచేత, అక్రూరాదిపరమభాగవతులందు స్నానముచేయుటచేత, ఇంకను ఇట్టి కారణము లనేకములచేత విశిష్టమైనదగుటచే **'సా'** అని నిర్దేశింపబడినది.

**(బృందావనం చ)** – పూర్వమున్న **'సా'** అను విశేషమును లింగవ్యత్యయముతో ఇచటను అన్వయింపనగును. **"ఇట్టమాన పశుక్కళై ఇనిదు మఱిత్తు నీరూట్టి విట్టిక్కొణ్డు విళైయాడ విరున్దావనమ్" (నాచ్చియార్. 14-1)** అనునట్లు భగవానుడు తనకు అత్యంతము ప్రీతికరమైన గోపాలనమును చేసి ఆనందించు పుణ్యస్థలి బృందావని. అది ఈనాడును మనకు దృగ్గోచరమగుచున్నది కదా! బృందావన శబ్దమునకు పలు విధములైన వివరణములు కలవు. బృంద అనగా పల్లేరుముళ్ళపొద. పూర్వము పల్లేరుముళ్ళతో నిండిన ఈ ప్రదేశము **"బృందావనం భగవతా కృష్ణేనాక్లిష్టకర్మణా, శుభేన మనసా ధ్యాతమ్" (విష్ణు. 5-6-28)** అనునట్లు భగవానుని దివ్యసంకల్పముచే నవతృణసమృద్ధమైనది. కావున బృందావనమయ్యెను. బృందా అనగా గోవత్సమునకు పేరు. వానిని మేపిన చోటు అగుటచే దీనికీ పేరు కల్గెను అని అప్పయ్యదీక్షితులు యాదవాభ్యుదయకావ్యవ్యాఖ్యలో (4-29) తెలిపిరి. బృందా అనగా తులసికి పేరు. తులసి నిండిన చోటు అగుటచే బృందావనమైనది. బృంద అను పతివ్రత తపస్సుచేసిన చోటు అగుటచేకూడ బృందావనమైనది. **"విగాహే యామునం తీర్థం సాధుబృందావనే స్థితమ్"** అని దేశికులు యతిరాజసప్తతిలో పల్కుటచే సాధుబృందములను, గోగణములను రక్షించుటకై శ్రీకృష్ణుడు అచట సంచరించుటచే బృందావనమయ్యెనని చమత్కారపూర్వకమైన వివరణమును ఇచట స్మరణీయము. **"శ్రీమద్ బృందావనం నామ వనం త్రిదశపూజితమ్"** అను హరివంశ సూక్తినిబట్టి దేవతలు



బృందములుగా చేరి స్వామిని పూజించిన ప్రదేశము కావున బృందావనమయ్యెననియు తెలియుచున్నది. న్యాయశాస్త్రప్రవర్తకుడైన గౌతముడు తన సిద్ధాంతానుసారము పాషాణకల్పమైన సుఖదుఃఖానుభవరహితదశయే మోక్షమనెను. అపుడు కొందఱు ఋషులు ఇట్టి స్థితి నీకును సమానమే కదా! అనగా అపుడు ఆముని – **"అపి బృందావనే శూన్యే సృగాలత్వం పరీప్సతి, న తు నిర్విషయం మోక్షం కదాచి దపి గౌతమః"** అనుచు బృందావనములో నక్క జన్మమైనను కోరెదనుగాని, నిర్విషయమైన మోక్షమును మాత్రము వలదనెనట. ఇట్టి గౌరవము బృందావనికి కలదు.

**(పురాణీ సా మధురా)** – **"మన్ను వడమదురై"** అనునట్లు పురాతనకాలమునుండి ప్రసిద్ధిచెందిన మధురానగరము. **"అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ త్వవంతికా, పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకాః"** అని కీర్తింపబడిన మోక్షనగరములు ఏడింటిలో మధుర ఒకటి. వామనావతారకాలమున వామనాశ్రమమను పేరుతో దీని పరిసరములు పిలువబడినవి. శ్రీరామాయణములోని **"ఏష పూర్వాశ్రమో రామ వామనస్య మహాత్మనః"** ఇత్యాదివచనము వలన ఇది స్పష్టమగుచున్నది. శత్రుఘ్నుడు లవణాసురుని ఇచటనే సంహరించినట్లు ఉత్తరరామాయణములో కలదు. కావున ఇది **"పురాణీ నగరీ"** అయినది. శ్లోకములోని చకారముచే రేపల్లెయు సూచింపబడినదని వ్యాఖ్యానాంతరము. **"సా"** అనునపుడు మధురానగరమహిమను తెలుపు **"మధురా నామ నగరీ పుణ్యా పాపహరీ శుభా"** ఇత్యాది సూక్తుల అర్థములు స్మరణీయములు.

**(అద్యాఽపి కృతినాం సులభాః)** – **"పాలాళి నీకిదైక్కుమ్ పణ్బై యామ్ కేట్టేయుమ్ కాలాళుమ్ నెఞ్జళియుమ్ కణ్శుళలుమ్" (పెరియతిరు-34)** అనునట్లున్న వారికి ఇవి విభములు – అనగా సేవింపసాధ్యము కానివి. కాని, **"ఊరాయవెల్లామ్ ఒళియామే నానవనై" (శిఱియ తిరుమడల్)** అని తలచి, **"తానుకన్ద ఊరెల్లామ్ తన్తాళ్పాడి" (తిరునడు)** అనునట్లు భగవదభిమత దివ్యక్షేత్రములలోని భగవన్మూర్తులను కీర్తించి, **"కణ్డియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చిపేర్ మల్లై యెన్ఱు మణ్డినార్" (తిరునడు)** అనుచు పలు దివ్యదేశములందు సంచరించు మహాభాగ్యశాలురైన వారికి ఇవి సులభములే. **"మదురప్పురత్తుక్కెన్నై ఉయ్యుత్తిడుమిన్, ఆయ్ప్పాడిక్కే ఎన్నై యుయ్త్తిడుమిన్, యమునైక్కరైక్కే ఎన్నై యుయ్త్తిడుమిన్, పొయ్కైక్కరైక్కే ఎన్నై యుయ్త్తిడుమిన్, కోవర్త్తనత్తెన్నైయుయ్త్తిడుమిన్"** అనుచు గోదాదేవి ఆశపడునట్లు సులభములుగా కదా! ఉన్నవి అని తాత్పర్యము. **"భవచ్చరణచారజుషః ప్రదేశాః"** అనునపుడు **"యత్ర నారాయణో దేవః పరమాత్మా సనాతనః, తత్ పుణ్యం తత్ పరం బ్రహ్మ తత్ తీర్థం తత్ తపోవనమ్"** ఇత్యాదిగా భారతము ఆరణ్యపర్వము తీర్థయాత్రాసందర్భములోని సూక్తి స్మరణీయము. **"భగవత్ సాక్షాత్కార ఇవ భగవదధిష్ఠితదేశసాక్షాత్కారోఽపి సుకృతినా మేవ లభత ఇతి భావః. అస్మిన్ శ్లోకే భగవత్సంబంధవతో దేశస్యైవ పరమప్రాప్యత్వ ముక్త మితి మన్తవ్యమ్"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్యలో, **"పరంపరయాఽపి భగవత్సంబంధిసహవాసోఽపి తత్సహవాసప్రాయ ఇతి భావః"**

అని రామానుజాచార్యవ్యాఖ్యలో ఈ శ్లోకసారము తెలుపబడినది.

**50.** **బృందావనే స్థిరచరాత్మకకీటదూర్వా -**
**పర్యంతజంతునిచయే బత ! యే తదానీమ్ ।**
**నైవాలభామహి జనిం హతకా స్త ఏతే**
**పాపాః పదం తవ కదా పున రాశ్రయామః ॥**

బృందావనే = శ్రీబృందావనములోని, స్థిర = స్థావర, చర + ఆత్మక = జంగమ రూపములైన, కీట = (జంగములలో ఎల్ల అయిన) కీటకములు, దూర్వా = (స్థావరములలో ఎల్ల అయిన) గరిక, పర్యంత = వరకుగల, జంతునిచయే = ప్రాణిసమూహమునందు, జనిం = జన్మను, (వానిలో ఏదియో ఒక జన్మను), యే వయం = ఏ మేము, న + ఏవ అలభామహి = పొందలేకపోయితిమో, తే ఏతే = అట్టి ఈ, హతకాః పాపాః = నశించిన, మిక్కిలి పాపిష్ఠివారమైన మేము, తవ = నీ, పదం = పాదమును, కదా పునః = తిరిగి ఎప్పుడు, ఆశ్రయామః = ఆశ్రయించెదము ?

**"దేశోఽయం సర్వకామధుక్"** అని, **"తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః" (ఆరణ్య.1-19)** అనుచు తెలుపబడిన రీతిలో దివ్యదేశము భగవల్లాభమును కల్గించునను విషయము ప్రకారాంతరముగా ఇందు తెలుపబడినదని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో, **"కృష్ణావతారేఽపి వయ మలబ్ధమనోరథా"** అని రామానుజాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది.

ఆనాడు బృందావనములో పుట్టిన చేతనాచేతనములు అనేకములు కలవు కదా! వానిలో ఏదైన ఒక వస్తువై జన్మించియున్నవాడనైనచో ఇపుడు సంసారిగా జన్మించియుండెడివాడను కాను. అయ్యో! ఆ మంచికాలమును పాపిష్ఠివాడనైన నేను కోల్పోయితినే ! సర్వస్వదానము చేసిన సమయమును కోల్పోయిన పాపిష్ఠివానికి ఇక ఎపుడైన మంచి కాలమువచ్చునా! నీ పాదమును ఇక ఎపుడు పొందెదము ? స్వామీ! - అనుచు కూరేశులు తలపై మోదుకొనుచున్నారని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(స్థిరచరాత్మకకీటదూర్వాపర్యంతజంతునిచయే)** - స్థావరములలో మిక్కిలి హీనమైనది గరిక; జంగమములలో ఎక్కువ హీనమైనది కీటకము. కావున ఆ రెండును ఇచట పేర్కొనబడినవి. **"దూర్వాయా అపి క్షయవృద్ధియోగేనాంతఃసంజ్ఞితయా జంతుపదేన వ్యపదేశః"** అని రామానుజాచార్యవ్యాఖ్యానము. **"పత్యుః ప్రజానా మైశ్వర్యం పశూనాం వా న కామయే, అహం కదంబో భూయాసం కుందో వా యమునాతటే"** - నేను బ్రహ్మగానో, పశుపతిగానో జన్మింపగోరను, అని భగవచ్చరణారవింద సంబంధమును కల యమునా తీరములో కడిమి చెట్టుగానో, కుందముగానో అయ్యెదనని మహర్షి అపేక్షించిరి కదా! **"తవ దాస్యసుఖైకసంగినాం భవనే ష్వస్త్వపి కీటజన్మ మే, ఇతరావసథేషు మా స్మభూ అపి మే జన్మ చతుర్ముఖాత్మనా" (స్తోత్రరత్న.55)**



ఇత్యాది పూర్వాచార్య సూక్తులను, **"మీనాయ్ పిఱక్కుమ్, కురుకాయ్‌పిఱక్కుమ్, తమ్బకమాయ్‌నిఱ్కుమ్" (పెరుమాళ్-నాల్గవదశకం)** ఇత్యాది దివ్యసూరి సూక్తులను స్మరింపనగును.

**(నైవాలభామహి జనిం హతకాః పాపాః వయమ్)** - పూర్వము శ్రీరామవతార సందర్భమున జన్మించి, పరగతిని పొందలేకపోయితిమేనను కొఱతను **"హా హంత హంత భవతః"** అని, **"యే ధర్మ మాచరితుమ్"** అనియు గల శ్లోకములలో కూరేశులు వ్యక్తీకరించిరి. శ్రీకృష్ణావతార సందర్భమునను తాము జన్మింపలేక పోయితిమను కొఱతను ఇందు ప్రకటించుచున్నారు. ఈ సందర్భమున **"త్వా మా మనంతి కవయః కరుణామృతాబ్ధే" (69)** ఇత్యాది వరదరాజస్తవశ్లోకమును, **"అయోధ్యగాన్ సపశుకీటతృణాం శ్చ" (125)** అను సుందరబాహుస్తవశ్లోకమును స్మరణీయములు భగవత్సంబంధముకల్గిన ప్రదేశములు, వ్యక్తులును ఉపాదేయతమములైనట్లే, అభాగవత సంబంధము మిక్కిలి త్యాజ్యమనుటకూడ ఇచట ధ్వనించుచున్నదని, ఇందులకు - **"నైవం విత్ అనిదంవిదా సముద్దిశేత్, న సహ భుంజీత, న వసథ మావిశేత్"** అను బహ్వృచశ్రుతివాక్యమును, దేశికులు స్తోత్రభాష్యములో ఉదాహరించి, వివరించుటయును గమనింపనగునని వేరొక వ్యాఖ్య. **"హతకాః"** అనునపుడు **"అనుకంపాయామ్ కన్"** అని **'కన్'** ప్రత్యయము వచ్చినది.

**(పదం తవ కదా పున రాశ్రయామః)** - **"కదా పునః శంఖ . . . లాంఛనమ్ త్రివిక్రమ త్వచ్చరణాంబుజద్వయమ్ మదీయమూర్ధా నమలంకరిష్యతి" (స్తోత్రరత్న-31)** అను యామునసూక్తిని స్మరింపనగును. శ్లోకములోని **'బత'** అను పదము నిర్వేదమును సూచించును. **"ఆశ్రయామ"** అను లిట్ ఉత్తమ పురుషరూపపాఠమును కలదు.

**51.** **హా జన్మ తాసు సికతాసు మయా న లబ్ధమ్**
**రాసే త్వయా విరహితాః కిల గోపకన్యాః ।**
**యా స్తావకీనపదపంక్తిజుషోఽజుషంత**
**నిక్షిప్య తత్ర నిజమంగ మనంగతప్తమ్ ॥**

రాసే = రాసక్రీడాసమయమున, త్వయా విరహితాః = నీచే విశ్లేషింపబడిన, యాః గోపకన్యాః = ఏ గోపికలు, తత్ర = ఆ విశ్లేషసమయమునందు, అనంగతప్తమ్ = కామాగ్నిచే దహింపబడిన, నిజం = తమ, అంగం = శరీరమును, నిక్షిప్య = ఉంచి, తావకీన = నీకు సంబంధించిన, పదపంక్తిజుషః = పాదమార్గములోనున్న, యాః (సికతా) = ఏ ఇసుకను, అజుషంత= పొందిరో, తాసు = ఆ, సికతాసు = ఇసుకలో, మయా = నాచే, జన్మ = (ఒక ఇసుకరేణువుగానైనను) జన్మను, న లబ్ధమ్ = పొందబడలేదు, కిల = కదా!, హా = అయ్యో!)

స్వామితో చిరకాలము రాసక్రీడను ఆడి, పరమానందమును గోపికలు పొందినపుడు, ఆ ఆనందము మితిమీరినచో వారి ప్రాణములకే భంగము కల్గునని తలచిన భగవానుడు వారినుండి కొంతసేపు దూరమయ్యెను. శ్రీకృష్ణవిరహమును సహింపలేని గోపికలు కృష్ణుడు నడచిన పాదముద్రలనుకల ఇసుక తిన్నెలయందు విరహాగ్నితప్తమైన తమ శరీరముతో దొరలి, ఒకవిధముగా

ఆశ్వాసమును పొందిరని ప్రసిద్ధి. దీనిని దృష్టిలో నుంచుకొని కూరేశులు ఈ శ్లోకమును సాయించిరి. **"భగవత్సంబంధిసంబంధిషు కేషు చిదపి జన్మోత్తారక మిత్యాహ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని అవతారిక.

రాసక్రీడాసమయమున నీవు గోపికలను విడచి వెళ్ళినపుడు నీ విరహముచే తాపమును పొందిన గోపికలు నీవు నడచిన ఇసుకతిన్నెలపై పొర్లాడి, తమ విరహబాధను ఉపశమింపచేసికొనిరి. ఆ ఇసుక తిన్నెలలో ఒక ఇసుకరేణువుగానైనను నేను జన్మింపలేకపోయితినే! అయ్యో! నా దౌర్భాగ్యమెంతటిది!

దండకారణ్యమున శ్రీరామచంద్రుడు సంచరించునపుడు అచటి మహర్షులు **"దదృశుః విస్మితాకారాః" (ఆరణ్య.1-12)** అనునట్లు ఆ స్వామియొక్క పుంసాంధృష్టిచిత్తాపహారియైన సౌందర్యమునకు ముగ్ధులై, తదాలింగనమును అపేక్షించిరట. ఏకపత్నీవ్రతుడైన శ్రీరాముడు తాను శ్రీకృష్ణుడుగా అవతరించినపుడు వారు గోపికలుగా జన్మింతురని, అపుడు వారి మనోరథము ఈడేఱునని తెలిపెనని పురాణములలో కలదు. అప్సరసలు (వైకుంఠములోని సుందరీమణులు) గోపికలుగా జన్మించిరని భాగవతకథనము. **"శ్రీవత్సచిహ్నాత్ ఋషేః"** అని శ్రీపరాశరభట్టర్‌చే ఋషిగా కీర్తింపబడిన కూరేశులు గోపికాభావనతో ఇట్లు ఆశించుట యుక్తమే కదా! అని వ్యాఖ్యానంతరము. **"ఆసా మహో చరణరేణుజుషా మహం స్యాం బృందావనే కి మపి గుల్మలతౌషధీనామ్, యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా భేజు ర్ముకుందపదవీం శ్రుతిభి ర్విమృగ్యామ్"** అనుచు భాగవతమున శుకమహర్షి అభినివేశముతో పల్కిన సూక్తిని కూరేశులు అనుసరించుచు పల్కుట భావనీయము.

**(సికతాసు జన్మ మయా న లబ్ధమ్) - "సికతాస్వన్యతమత్వేన సికతాత్వేన జన్మనలబ్ధమ్"** అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి సూక్తి. ఆ ఇసుక రేణువులలో ఒక రేణువుగా జన్మించి కృష్ణసంచారరూప భాగ్యమును, గోపకన్యగా జన్మించి నిక్షేపరూపభాగ్యమును పొందలేకపోయితినే అని విషణ్ణులగుచున్నారు అని వారివ్యాఖ్య. **"సంసారతప్త మప్యంగం తత్ర నిక్షిప్య, పాదస్పర్శప్రభావాత్ జుషేయేతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"కృష్ణవిశ్లేషకాలే తత్పదముద్రాచిహ్నితాః సికతా ఏవ విరహిణాం గోపకన్యానా మాలింగనమంగళప్రదానేనానంగతాపాపహా అభవ న్నితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"హా"** అను పదము ఖేదమును సూచించును.

**52.** **ఆచిన్వతః కుసుమ మంఘ్రిసరోరుహం తే**
**యే భేజిరే బత! వనస్పతయో లతా వా ।**
**అద్యాపి తత్కులభువః కులదైవతం మే**
**బృందావనం మమ ధియం చ సనాథయంతి ॥**



తే కుసుమం ఆచిన్వతః = నీవు పూలను కోయువాడవు కాగా, యే = ఏ, వనస్పతయః= వృక్షములుగాని, లతా వా = లతలుగాని, తే = నీ యొక్క, అంఘ్రిసరోరుహం = పాదపద్మమును, భేజిరే = పొందినవో, తత్ = ఆ చెట్లయొక్క, లతలయొక్క, కులభువః = పరంపరలో పుట్టిన చెట్లు, లతలును, మే = నా యొక్క, కులదైవతం = కులదైవమైన, బృందావనం = బృందావనమును, మమ =నా, ధియం = బుద్ధిని (అంతరంగమును), అద్యాపి = ఈనాడును, సనాథయంతి = పరిష్కరించుచున్నవి.

పూర్వశ్లోకమున అచేతనమైన ఇసుకరేణువుగానైనను జన్మింపలేకపోయితినే! అని ఖేదమును పొందిన కూరేశులు **"తమ్బకమాయ్ నిఱ్కుమ్ తవముడైయేనావేనే" (4-5)** అని కులశేఖరులు ఆశపడినరీతిలో బృందావనములో శ్రీకృష్ణుని పాదసంబంధమునుకల చెట్టుగానో, లతగానో కాకపోయితినే! అను కొఱత తీరునట్లు ఇపుడు సాక్షాత్ భగవత్సంబంధమునుకల వృక్షములు, లతలులేకున్నను వానితో పరంపరాసంబంధమునుకల, ఈనాడు కన్పించు వృక్షలతాదులను నా కులదైవములుగా భావింతునని అనుచున్నారు.

ఆనాడు నీవు బృందావనములోని కదంబాదివృక్షములందు, మాలతీమాఘ్యాది లతలయందు పాదములను మోపి, పూలను కోయునపుడు అవి నీ పాదసంబంధమును పొంది ధన్యములైనవి. సాక్షాత్తుగా ఆ వృక్షలతలే ఇపుడు అచటలేకున్నను వాని పరంపరలో పిమ్మట జన్మించినవి బృందావనములో విశేషముగా ఉండుటచే అవియే నాకు ప్రాప్యములు అని నమ్ముదును. **"బృందావనాలంకారభూతాః తత్కులభువ ఏవ మమ బుద్ధ్యా భోగ్యతయాఽనుసంధీయత ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

ఈ శ్లోకముద్వారా కూరేశులు భగవానునితో పరంపరాసంబంధమునుకల పదార్థములుకూడ ఉద్దేశ్యములేనను మధురసంప్రదాయార్థమును కూరేశులు వ్యక్తీకరించిరని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

శ్రీకృష్ణుడు గోపికలతో సంచరించునపుడు వారిని అలంకరించుటకొఱకు పూలను కోయగోరి కుందకదంబాది వృక్షములను ఎక్కెను. గోపికావస్త్రాపహరణ సందర్భములో – **"తాసాం వాసాంస్యుపాదాయ నీప మారుహ్య సత్వరః"** అని నీపవృక్షమును, కాళియమర్దన సందర్భములో– **"కృష్ణః కందంబ మధిరుహ్య తతోఽతితుంగమ్ ఆస్ఫోట్య గాఢరశనో న్యపతద్ విషోదే"** అని కదంబవృక్షమును అధిరోహించెను. కాళియుని విషాగ్నిచే ఎండిన కదంబవృక్షముకూడ శ్రీకృష్ణపాదస్పర్శచే మరల చిగిర్చెనని పరాశరమహర్షి వచించెను.

కూరేశుల సుందరబాహుస్తవములోని **"కాళియస్య ఫణతాం శిర స్తుమే సత్కదంబ శిఖరత్వ మేవ వా, వష్టిజుష్టవనశైలసుందర! త్వత్పదాబ్జయుగ మర్పితం యయోః" (111)** అను శ్లోకభావమిచట స్మరంపతగినది. **"బృందావనం . . . సనాథయంతి"** అను సూక్తికి

అనుగుణముగా **"ప్రాయ స్త్వదంగీకరణాత్ ప్రయాస్యంత్యారాధ్యతా మద్రివనావకాశాః"** అను దేశికసూక్తిని భావింపనగును.

పూర్వశ్లోకములో పరంపరాత్మకమైన భగవత్సంబంధమునుకల అచేతనముగా అగుటకూడ పరమ ప్రాప్యమగు బ్రహ్మానందమునకు హేతువని తెలుపబడినది. ఇందు భగవానుని పరంపరా సంబంధమునుకల వనస్పత్యాదులు స్వయముగా పరమప్రాప్యములని తెలుపబడినది. కావున స్వామితో పరంపరాసంబంధమును కల్గినవి ఉపాయోపేయములను సంప్రదాయము (ధ్వన్యర్థ ప్రక్రియలో) తెలుపబడినదని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"బత"** అను అవ్యయము ఆశ్చర్యద్యోతకము.

**53.** **యత్త్వత్ప్రియం త దిహ పుణ్య మపుణ్య మన్య -**
**న్నాన్య త్తయో ర్భవతి లక్షణ మత్ర జాతు ।**
**ధూర్తాయితం తవ హి యత్కిల రాసగోష్ఠ్యాం**
**తత్కీర్తనం పరమపావన మామనంతి ॥**

ఇహ = ఈ లోకములో, యత్ = ఏది, త్వత్ ప్రియం = నీకు ఇష్టమో, తత్ = అది, పుణ్యం = పుణ్యము అగుచున్నది, అన్యత్ = ఇష్టము కానిది, అపుణ్యమ్ = పుణ్యము కానిది (పాపము) అగుచున్నది, తయోః = ఆ పుణ్యపాపములకు, అత్ర = ఈ లోకములో, అన్యత్ = పూర్వము తెల్పినదానికంటే వేరొక, లక్షణం = లక్షణము, జాతు = ఏనాడును, న భవతి = కాదు (ఎట్లనగా), రాసగోష్ఠ్యాం = రాసక్రీడలో, తవ = నీయొక్క, ధూర్తాయితమ్ = ధూర్తచరిత్రము ఏది కలదో, తత్ = దానియొక్క, కీర్తనం = అనుసంధానమును, పరమపావనం = మిక్కిలి పవిత్రమైనదిగా, ఆమనంతి = పరాశరాదిమహర్షులు, పరాంకుశాదిదివ్యసూరులును పల్కుచున్నారు, హి = కదా!

భగవానుని లీలలు అన్నియు పరమపావనములే అనుచున్నారు. **"భగవత్ చేష్టితస్య కృత్స్నస్యాపి పావనత్వ మనుభవతి"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య.

నీ చిత్తమునకు ఏది ఇష్టమైనదో అది పుణ్యమని, ఏది ఇష్టము కానిదో అది పాపమని కదా పుణ్యపాపముల లక్షణము మహనీయులచే చెప్పబడుచున్నది. రాసక్రీడలో నీవు చేసిన ధూర్తచరిత్రలను కీర్తించుట అంతయు ప్రాకృతజనుల అభిప్రాయానుసారము పాపమే అయినను, పూర్వము తెల్పిన విధముగా పుణ్యపాపలక్షణ నిష్కర్షను చేయువారికి అది అంతయు పుణ్యమని తోచునే తప్ప, పాపమని కలలోకూడ తోచదు. రాసక్రీడలో నీవు చేసిన కృత్యములను కీర్తించువారిని చూచి నీ ఉల్లము మిక్కిలి సంతోషించుటచే ఆ కీర్తనము పుణ్యమగుటలో ఏమి కొఱత? - అని భావము.

రాసక్రీడలో స్వామి రేపల్లెలోని స్త్రీలతో క్రీడించెను. వారిలో అందఱు గోపికలేకాదు,



కొందఱు ఇతరుల భార్యలును కలరు. **"ధర్మసంస్థాపనార్థాయ" (భ.గీ.4-8)** అని ధర్మస్థాపనకై అవతరించిన భగవానుడు ఇట్లు విటులవలె ఇతరుల భార్యలతో కలసి విహరింపనగునా? ఇది అధర్మము కదా! **"మేలైయార్ శెయ్‌వనకళ్ వేణ్డువన కేట్టియేల్" (తిరుప్పావై-26)** అని, **"యథా తే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః" (తైత్తిరీయ-శీక్షా)** అని, **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః" (భ.గీ.3-21)** అనియు పల్కురీతిలో దీనిని చూచి మిగిలినవారును ఇట్లే వర్తింతురు కదా!" అను ప్రశ్నకు కూరేశులు ఇందు సమాధానమిచ్చుచున్నారని వ్యాఖ్యానాంతరము.

**"తా వార్యమాణాః పతిభిః పితృభిః భ్రాతృభి స్తథా, కృష్ణం గోపానంగా రాత్రౌ రమయంతి రతిప్రియాః, సోఽపి కైశోరకవయో మానయత్ మధుసూదనః, రేమే తాభి రమేయాత్మా"** అనుచు శ్రీపరాశరమహర్షి శ్రీవిష్ణుపురాణములో గోపికలు తమ తండ్రులచే, భర్తలచే, సోదరులచే వారింపబడినను శ్రీకృష్ణునితో క్రీడించిరని తెలిపి, ఇది తగునా? అను ప్రశ్నకు సమాధానమును- **"తద్భర్తృషు తథా తాసు సర్వభూతేషు చేశ్వరః, ఆత్మస్వరూపరూపోఽసౌ వ్యాపీ వాయు రివ స్థితః, యథా సమస్తభూతేషు నభోఽగ్నిః పృథివీ జలమ్, వాయు శ్చాత్మా తథైవాసౌ వ్యాప్య సర్వ మవస్థితః"** - పంచభూతములన్నిటియందు స్వామి వ్యాపించియున్నట్లే, ఆ భగవానుడు వ్యాపించియుండని పదార్థమేది? అతని సంబంధముచే ఏదియు అసంభవముకాదు" కదా! అనుచు పల్కిరి.

ఈవిధముగానే, శ్రీభాగవతములో శ్రీశుకమహర్షిని **"స కథం ధర్మసేతూనాం వక్తా కర్తాఽభిరక్షితా, ప్రతీప మాచర ద్బ్రహ్మన్! పరదారాభిమర్శనమ్"** అని పరీక్షిత్తు ప్రశ్నింపగా, ఆ మహర్షి ఇందులకు సమాధానమును **"ధర్మవ్యతిక్రమో దృష్ట ఈశ్వరాణాం చ సాహసమ్, తేజీయసాం న దోషాయ వహ్నేః సర్వభుజో యథా"** అని నుడివెను. భగవానుని లీలలను మనము విమర్శింపవీలు కాదు. విశ్వామిత్రుని అయాజ్యయాజనము, వశిష్ఠుని వివాహము, దారుకవనములో రుద్రుని ఋషిపత్నిమోహనము మొదలగువానిని చూచి మనము ఎట్లు వానిని అనుసరింపకూడదో అట్లే ఇదియును. పెద్దలు **"తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే"** అనిరి కదా! మహాత్ములు చేసిన ఆశ్చర్యకరకృత్యములను మనము చేయలేము కదా! విశ్వామిత్రుడు త్రిశంకువును స్వర్గమునకు పంపెను. వశిష్ఠుడు తపోబలముతో విశ్వామిత్రుని జయించెను. వీనిని మనము అంగీకరించినట్లే, భగవల్లీలలనుకూడ మనము అంగీకరింపక తప్పదు - అని వ్యాఖ్యానాంతరములో వివరింపబడినది. దేశికులు ఈ అంశమును గూర్చి చర్చించుచు ఉత్తరాగర్భములో మరణించిన శిశువును బ్రతికించు సందర్భములో భీష్మ - శుక - హనుమత్ - శివాదులు సైతము తమ బ్రహ్మచర్యమునుగూర్చి ప్రమాణము చేయుటకు సంశయింపగా, శ్రీకృష్ణుడు **"యది మే బ్రహ్మచర్యం స్యాత్ సత్యం చ మయి తిష్ఠతి, అవ్యాహతం మమైశ్వర్యం తేన జీవతు బాలకః" (మహాభారతే.)** అని తన బ్రహ్మచర్యము నిజమైనచో ఈ బాలుడు జీవించుగాక! అని ప్రమాణముచేయగా అతడు బ్రతికెను. కావున గోపికలతో పరమాత్మకుకల సంబంధము శారీరకము కాదని, ఆత్మ - ఆత్మేశ్వరరూప

పరమపవిత్రమైన సంబంధమని నిర్ధారించిరి.

**(తత్కీర్తనం పరమపావన మామనంతి)** – వ్యాసపరాశరాదిమహర్షులు, పరాంకుశ పరకాలాది దివ్యసూరులును అని అర్థము. దేశికుల యాదవాభ్యుదయములోని **"న ఖల్వముష్య ప్రమదామదాంధ్యం, న కుత్సనం తత్తదభీష్టదాతుః, న ధర్మసంస్థాపనబాధగంధః శుద్ధానుచింత్యా హి శుభస్య లీలా"** అను శ్లోకార్థము స్మరింపతగినది. పామర జనులు రాసక్రీడావిషయములో (అజ్ఞాన–అన్యథాజ్ఞానకృతమైన) మోహమును పొందరాదను పరమకృపతో కూరేశులు ఈ అంశమును ప్రస్తావించి, సమాధానము నిచ్చిరి. **"ధూర్తాయితమ్ – ధూర్తవదాచరితమ్, న తు త్వం ధూర్త ఇతి ప్రత్యయేన వ్యజ్యతే"** అని వేరొక వ్యాఖ్య. "నీ ధూర్తకృత్యములు పాపములైనచో,– **"అఘవాదీ హరేత్ పాపమ్"** – అనునట్లు వానిని కీర్తించువానికిని పాపమే కల్గును. కాని, శుకపరాశరాది మహర్షులు నీ ధూర్తచేష్టల కీర్తనను పుణ్యముగా పల్కిరి. అందుచే నీ ఆజ్ఞారూపములైన, శ్రుతిస్మృతులలో తెలుపబడిన విధులు నీకు ఇష్టమైనవి అని, నిషేధములు నీకు ఇష్టముకానివి అని – ఈ విధముగా పుణ్యపాపముల అనుగతలక్షణమును తెలిసికొననగును అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. పూర్వార్ధమున తెలుపబడిన సామాన్యము ఉత్తరార్ధములోని విశేషముచే సమర్థింపబడుటచే అర్థాంతరన్యాసము కలదు.

**54.** **యా కంసముఖ్యనృపకీటనిబర్హణోత్థా**
**సా నిర్జితత్రిజగత స్తవ నైవ కీర్తిః ।**
**గోపాలనాది యదిదం భవదీయకర్మే –**
**త్యార్ద్రీకరోతి విదుషాం హృదయం తదేతత్ ॥**

కంసముఖ్య = కంసుడు మొదలగు, నృపకీట = రాజాధముల, నిబర్హణ = సంహారముచే, ఉత్థా = పుట్టిన, సా = ఆ, కీర్తిః = కీర్తి, నిర్జితత్రిజగతః = ముల్లోకములను జయించిన, తవ = నీకు, న+ఏవ కీర్తిః = కీర్తికరము కానేకాదు, గోపాలన + ఆది = గోవులను కాచుట మొదలగు, యత్ + ఇదమ్ = ఏ ఈ కృత్యము కలదో, తత్ + ఏతత్ = అది, భవదీయ కర్మ = నీ లీల, ఇతి= అను కారణముచే, విదుషాం = జ్ఞానుల (మహర్షుల, దివ్యసూరుల), హృదయం = మనస్సును, ఆర్ద్రీకరోతి = ద్రవింపచేయుచున్నది.

కంసరావణహిరణ్యాది అసురులను నిర్జించితివి అని నీ వీరచరిత్రలను పల్కి కీర్తించుటకంటే, గోవులను కాచితివి అను నీ సౌలభ్యచరిత్రలను పల్కి కీర్తించుటయే పరమభోగ్యమనుట ఇందలి విషయము.

ముల్లోకములను జయించినవాడు కంసుడు మొదలగు క్షుద్రులను కొందఱిని సంహరించెనన్నచో అది ఒక పొగడ్త అగునా! పరత్వమునందు ఏ లోటులేనివాడు సౌలభ్యసౌశీల్యాదులకు చరమావధియైన గోపాలనాదిలీలలను చేసెనన్నచో కదా మనస్సు



ద్రవించును. **"తివత్తిలుమ్ పశునిరై మెయ్ప్పు ఉవత్తి శెజ్గనివాయ్ ఎజ్గళాయర్తేవే" (తి.వా.10–3–10)** అని దివ్యసూరులు అభినివేశమును పొందు లీలావిశేషము కదా ఇది.

**(కంసముఖ్యనృపకీట . . . నైవ కీర్తిః)** – కంసనిరసనాదులు గొప్పకాకపోయినచో, **"కఞ్జనైక్కాయ్న్దానై" (కలియన్.7–6–5)** అని, **"కఞ్జన్ వయిఱ్ఱిల్ నెరుప్పెన్ననిన్ఱ నెడుమాలే" (తిరుప్పావై–25)** అనియును ఆ లీలను అనుసంధించి, కీర్తించుట ఏల? అను ప్రశ్న కలుగవచ్చును. ఇందులకు సమాధానముగా సుందరబాహుస్తవములోని **"ఇంగితం నిమిషితం చ తావకం రమ్య మద్భుత మతిప్రియంకరమ్, తేన కంసముఖకీటశాసనం సుందరాల్పక మపి ప్రశస్యతే" (54)** అను వీరి శ్లోకమును అనుసంధింపనగును. **"అదు విదు వదు వెన్నలావనల్ల ఎన్నైయున్ శెయ్కై నైవిక్కుమ్" (తి.వా.5–10–2)** అను రీతిలో ఇది భగవానుని చేష్టితము అనినంతనే దాని గొప్పతనమునకు, మాధుర్యమునకు లోటులేదు. కాని, సందర్భమునుబట్టి, సౌలభ్య, సౌశీల్యగుణప్రయుక్తవైశిష్ట్యమునుబట్టియు ఇచట గోపాలనాదిచేష్టితములను ఇట్లు విశేషించి పల్కుచున్నారు.

**(నిర్జితత్రిజగతః) – "త్రివిక్రమావసర ఇతి శేషః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"త్రిజగదపహారిహిరణ్యమహాబలిప్రభృతీన్ జితవత స్తవ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ముల్లోకములను జయించి, తనదిగా చేసికొనుట త్రివిక్రమావతారమున ప్రసిద్ధముగా కన్పించినను, **"సత్యేన లోకాన్ జయతి" (అయో.12–29)** అనునట్లు ఇది సర్వావతారములందు సమానము కదా!

**(భవదీయ కర్మ)** – ఇచటి సర్వనామశబ్దము ఉభయవిభూతినిర్వాహకత్వమును సూచించును. **"ఉభయవిభూతినిర్వాహకభవచ్చేష్టిత మితి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(గోపాలనాది)** – ఆదిశబ్దముచే యశోదచే కట్టబడుట, నవనీతచౌర్యము, దామోదరబంధనము, పాండవులకు దూతయగుట మొదలగు సౌలభ్యసౌశీల్యాదిగుణ ప్రకాశకములగు వృత్తాంతములు అన్నియు సూచింపబడినవి. లోకదృష్టిలో నైచ్యమును వ్యక్తీకరించు ఈ కృత్యములు భగవానునకు అవద్యకరములు కదా! అనినచో, భగవానుడు ఈ లీలలను అన్నిటిని **"కృష్ణేనాక్లిష్టకర్మణా"** అనునట్లు ఆత్మేచ్ఛతో, నిరంకుశస్వాతంత్ర్యముతో చేసెను కావున అవి దోషావహములు కావు, సరి కదా అతిశయహేతువులే అగును అని మన పూర్వాచార్యుల అభిప్రాయము. **"స్వాతంత్ర్యగంధద్విరదాంకుశేన స్వేనైవ శీలేన వినీయమానః, అనన్యలభ్యం ప్రతిలంభితోఽభూత్ ప్రభుః స్వయం పాండవదూతభావమ్"** అని, **"అనన్యతంత్రస్య విభో స్తదేతత్ నాథోచితం నంతృషు పారతంత్ర్యమ్"** అనియుగల దేశికసూక్తులు (యాదవాభ్యుదయము) ఇచట స్మరింపతగినవి.

**(ఆర్ద్రీకరోతి విదుషాం హృదయమ్)** తిరువాయ్మొழிలోని **"పిఱన్దవాఱుమ్"** (5–10)

అను దశకములో **"నిన్నునిన్ను ఉరుక్కి"** ఇత్యాదిగా పలుపాశురములలో పల్కిన సూక్తులు ఇందులకు మూలము. ఇచట భగవద్రామానుజులు ఉభయలింగాధికరణభాష్యములో – **"పూయశోణితమజ్జనం హి స్వేచ్ఛాకారిత మపి అపురుషార్థ ఏవ"** అని పూర్వపక్షమును ఉద్భావించి, అందులకు సమాధానమును – **''పరస్య తు బ్రహ్మణః స్వాధీనస్య స ఏవ సంబంధః తత్తద్విచిత్రనియమనరూపలీలారసాయైవ స్యాత్''** ఇత్యాదిగా అనుగ్రహించుటయును పురస్కరించుకొని కూరేశులు ఈ శ్లోకమును సాయించియుండవచ్చునని వేరొక వ్యాఖ్యానము. **"తవ పరాక్రమనిమిత్తో విదుషాం న సంతోషః, కిం తు సౌశీల్యవాత్సల్యనిమిత్త ఇతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"కంసాదిజయానుసంధానా దపి గోపాలనాద్యనుసంధాన మేవ తత్త్వవిదాం చిత్తవ్యామోహకరం భవతీత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**55.** **గోపాలవేషపరికర్మ పరావరేశం**
**యన్నామ ధామ పరమం తమసః పరస్తాత్ ।**
**తత్పింఛలాంఛనసుదామకృతోపవీతం**
**గోధూళిధూసరితకుంతల మంతరాఽస్తామ్ ॥**

పర + అవరేశం = ఉభయవిభూతినిర్వాహకమై, (కావుననే), పరమం = ఉత్కృష్టమైయున్న, యత్ = ఏ, ధామః = తేజస్సు (తేజోరూపుడైన భగవానుడు) తమసః పరస్తాత్= ప్రకృతిమండలమునకు ఆవలివైపున కలదో, తత్ = ఆ, తేజస్సు, పింఛలాంఛన = నెమలిపింఛము గుర్తుతో శోభిల్లునదియై, సుదామ = గొప్పమాలతో, కృత + ఉపవీతం = ఉపవీతమును కల్గినదై (ఉపవీతాకారమునుకల మాలెను కల్గినదై), గోపాలవేష = గోపాలవేషమును, పరికర్మ = అలంకారముగా కల్గినదై, గోధూళి = గోవుల ధూళిచే, ధూసరిత = ధూసరమైన (బూడిదపూయబడినట్లున్న), కుంతలం = కేశపాశమును కల్గినదై, అంతః = నా మనస్సులో, ఆస్తామ్ = ఉండవలెను.

సౌలభ్యమునకు మాత్రమే చెందినది, భోగ్యతకు చరమావధియైనది అగు గోపాలరూపవిశేషమును మనస్సున భావించి, కూరేశులు ఈ శ్లోకమును సాయించిరి.

ఉభయవిభూతినిర్వాహకమై, కావుననే ఉత్కృష్టమైనదైయున్న ఏ దివ్యతేజస్సు ప్రకృతి మండలమునకు ఆవలివైపున కలదో, ఆ తేజోరూపము నెమలికన్నులతో చేయబడిన, ఉపవీతాకారముననున్న మాలను అలంకరించుకొన్నదై, గోపాలవేషముతో శోభిల్లునదియై, గోధూళితోకూడిన కుంతలములను కల్గినదై నా మనస్సులో ప్రకాశించునుగాక!

**(గోపాలవేషపరికర్మ) – "శీలక్కుదమ్బై యొరుకాదు ఒరుకాదు శెన్నిఅమేల్ తోన్ఱి పూవ్కోలప్పణైక్కచ్చుమ్ కూఱైయుడైయుమ్" (పెరియా.3-3-1)** ఇత్యాదిగా భట్టనాథులచే స్తుతింపబడిన రూప మిచట వివక్షితము. **"గోపాలవేషస్య పరికర్మ"** అను తత్పురుషమును చెప్పవచ్చును. గోపాలవేషమునకే అలంకారము కదా! స్వామి రూపము.



**(పరావరేశమ్)** – పరులనగా అనంతగరుడవిష్వక్సేనాదులు. అవరులనగా బ్రహ్మాదులు. వీరికి అందఱికి నిర్వాహకుడు స్వామి **"పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయః సంతి పరావరేశే" (విష్ణు.6-5-85)** అను పరాశరమహర్షి సూక్తి ఇచట తలపునకు తెచ్చుకొననగును.

**(ధామ) – "అథ యదతః పరో దివో జ్యోతిః దీప్యతే" (ఛాందో.3-13-7)** అని, **"ఒణ్ శుడరే" (తి.వా.5-10-6)** అని ఇత్యాదిగాకల సూక్త్యర్థములు స్మరణీయములు.

**(తమసః పరస్తాత్) – "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" (పురుష.సూ.)** అని, **"రజసః పరాకే" (తైత్తి.సంహి.2-2-2)** అనునట్లు తమశ్శబ్దవాచ్యమైన ప్రకృతికి ఆవలివైపున అని అర్థము.

**(తత్)** – ఉభయవిభూతినిర్వాహకమైయున్న ఆ తేజస్తత్త్వమే కదా ఇట్లు గోవులను మేపు వేషమును దాల్చినది.

**(పింఛలాంఛనకృతోపవీతమ్) – ''నీల నన్నుఱుక్కుఙ్జి నేత్తిరత్తాలణిన్దు'' (పెరియా.3-4-7)** అని, **"విణ్ణిన్ మీదమరర్కళ్ విరుమ్బి త్తొఱ్ఱమితైన్దాయర్ పాడియిల్ వీదియూడే కణ్ణన్ కాలిప్పిన్నే ఎఱ్ఱున్దరుళా"** అని ఈ విధమైన పలు దివ్యసూరి సూక్తులను స్మరింపనగును. ఇచట ఉపవీతశబ్దము ఉత్తరీయమను అర్థమును తెల్పును. యజ్ఞోపవీతమును కాదు అని వేరొక వ్యాఖ్య.

**(గోధూళిధూసరితకుంతలమ్) – "పూణిత్తొఱువినిల్ పుక్కు పుఱుదియళైన్ద పొన్మేని" (పెరియా.2-4-9)** అని, **"కఱుత్తూళియుదై వేడల్ కానిడైక్కన్షిన్ పిన్"** అనియు పల్కిన రీతిలో కేశములు గోధూళిచే ధూసరితములుగానున్న సన్నివేశము ఇది.

**(అంతః ఆస్తామ్)** – ఇట్టి విశిష్టవేషము నా మనస్సున వెలుగవలెను. **"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" (పురుష.సూ.-57)** అనెడి రూపముకంటే ఈ రూపమే పరమభోగ్యమని తాత్పర్యము. **"భగవత్పారమ్యా దపి అవతారసౌశీల్య మేవ భోగ్యతయా నిరంతరానుభావ్య మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అస-ఉపవేశనే"** అను ధాతువుయొక్క ఆత్మనేపదిలో రూపము **"ఆస్తామ్"** అగును.

**56.** **యద్వై జరాసుతభయా ద్విపలాయథా స్త్వం**
**తచ్చే న్మనుష్యచరితానువిధానజం తే ।**
**తర్హి త్రిలోకగురు మీశ్వర మీశ్వరాణాం**
**బాణాహవే కి మితి శంభు మజ్మంభయ స్త్వమ్ ॥**

త్వం = నీవు, జరాసుతభయాత్ = జరాసంధుని భయమువలన, విపలాయథాః= పారిపోయితివి, ఇతి యత్ వై = అనునది ఏది ప్రసిద్ధముగా కలదో, తత్ = అది, తే = నీ యొక్క, మనుష్యచరిత = మనుష్యచరితమును, అనువిధానజం చేత్ = అనువర్తించుటవలన కల్గినది

అయినచో, త్రిలోకగురుం = ముల్లోకములందు గొప్పవాడు, ఈశ్వరాణాం = ఇంద్రాది ఈశ్వరులకును, ఈశ్వరమ్ = ప్రభువు అగు, శంభుమ్ = రుద్రుని, బాణ + ఆహవే = బాణాసురయుద్ధములో, కిమ్ ఇతి = ఎందులకు, త్వం = నీవు, అజ్జృంభయః = స్తంభింపచేసితివి?

కూరేశులు ఈ స్తుతిలో శ్రీరామావతార వైభవమును ప్రస్తుతించుచు **"పృచ్ఛామి కించన", "అంగ కిమంగ్యకార్షీః"** ఇత్యాదిగా ప్రశ్నించిన రీతిలోనే శ్రీకృష్ణావతారమును అనుసంధించు ఈ ఘట్టమునను స్వామిని చమత్కారముగా ప్రశ్నించుచు, నిరుత్తరునిగా చేయుచున్నారు. జరాసంధుడు కాలయవనుని సహాయముతో శ్రీకృష్ణునిపై దండెత్తి వచ్చినపుడు స్వామి, **"క్వచి దేవ పలాయనమ్"** అను రీతిలో పరుగెత్తిపోయినట్లు శ్రీవిష్ణుపురాణ, శ్రీభాగవతాదులలో కలదు. భగవానుడిట్లు పరుగెత్తిపోవుట మనుష్యభావనానుగుణము, అభినయప్రయుక్తమును. వాస్తవము కాదు. బాల్యములోనే అవలీలగా పూతనాశకటాదిసంహారమొనర్చిన స్వామికి వీరొక లెక్క కాదుకదా! విధముగా మనుష్యభావనతో ప్రవర్తించుచున్నను ఒక్కొక్క సమయములో ఆ భావనను మించి మఱుగుపఱచి, తన పరత్వమును ప్రకాశింపచేయు అతిమానుషలీలలనుకూడ స్వామి వ్యక్తముచేయుటను దృష్టిలోనుంచుకొని, అట్టి వృత్తాంతములలో ఒకటి అగు బాణాసురకథను ప్రస్తావించుచు, స్వామిని ఆశ్చర్యపూర్వకముగా కూరేశులు ప్రశ్నించుచున్నారు.

స్వామీ! నీవు జరాసంధునకు భయపడి పాఱిపోవుట నీ మానవభావనానుగుణమే అయినచో, బాణాసురయుద్ధ సమయములో ముల్లోకములలో గొప్పవాడు, ఇంద్రాదులకును ఈశ్వరుడైన రుద్రుని నీవు ఏల స్తంభీభూతుని చేసితివి? మనుష్యభావనలోకూడ నీ పరత్వమును నీవు కప్పిపుచ్చుకొనలేకపోయితివి సుమా! అని భావము. **"జరాసంధభయాత్ పలాయితస్య శంభుజృంభణం కథం ఘటత ఇతి పరిచోదనాత్ మనుష్యభావనాయా మపి భవతః పారమ్యం దురపహ్నవ మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"తవ సహజం సర్వేశ్వరత్వం క్వచిత్ క్వచిన్మనుష్యనటనా మభిభవతీతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య.

**(త్రిలోకగురుం . . . అజ్జృంభయః) – "జృంభణాస్త్రప్రయోగేన జృంభయామాస శంకరమ్, జృంభాభిభూత స్తు హరో రథోపస్థ ఉపావిశత్, న శశాక తదా యోద్ధుం కృష్ణేనాక్లిష్టకర్మణా"** అని విష్ణుపురాణము తెలుపబడినది. **"ముణ్డనీఅన్ మక్కళ్ వెప్పు మోడి యజ్గియోడిడ" (53)** అని, **"మోడియోడి లచ్చైయాయ శావమెయ్ది ముక్కణాన్ కూడుశేనైమక్కళోడు కొణ్డు మణ్డి వెఙ్గమత్తోడ" (71)** అనియు భక్తిసారులు ఈ వృత్తాంతమును తిరుచ్చన్దవిరుత్తములో ప్రస్తుతించిరి. వారివలె నీవు పరుగెత్తి పోయియుండిన కదా నీ మనుష్యభావనకు అనుగుణమగును! (కాలయవనవృత్తాంతవివరము విష్ణుపురాణము పంచమాంశములో కలదు.)

**57.** **జాతం కుత స్తదకృతజ్ఞవిచేష్టితం తే**



**పుత్రీ యయా కిల వరం వవృషే వృషాంకాత్ ।**
**అక్షేషు సక్తమతినా చ నిరాదరేణ**
**వారాణసీ హరపురీ భవతా విదగ్ధా ॥**

పుత్రీయయా = పుత్రులను పొందవలెనను ఇచ్ఛతో, వృషాంకాత్ = ఈశ్వరునివలన, వరం = వరమును, వవృషే = వేడితివి. (వేరొక సమయమునందు), అక్షేషు = ద్యూతక్రీడలో (పాచికల ఆటలో), సక్తమతినా = ఆసక్తుడవు, నిరాదరేణ చ = (దేనియందు) ఆశలేనివాడవును అగు, భవతా = నీచే, హరపురీ = ఆ ఈశ్వరుని నగరమగు కాశి, విదగ్ధా = దగ్ధముచేయబడినది, తత్ = అట్టి, అకృతజ్ఞవిచేష్టితం = కృతఘ్నుని వ్యాపారము, తే = నీకు, కుతః = ఎందువలన, జాతమ్ = కల్గినది ?

పూర్వశ్లోకములోవలెనే, ఇందుకూడ కూరేశులు భగవానుని ఉద్దేశించి చమత్కారముగా వేరొక ప్రశ్నను సంధించుచున్నారు.

స్వామీ! నీవు పుత్రకామార్థివై శివునివలన వరమును వేడితివి. ఆ శివుని పట్టణమగు కాశీనగరమును నీవు ఒకానొక సమయమున పాచికలాడుచు అవలీలగా సుదర్శనమును ప్రయోగించి దగ్ధము చేసితివి. నీకు వరమిచ్చిన శివుని పురమును దగ్ధముచేయుట కృతఘ్నతయే కదా! ఇట్టి పని ఎందులకు చేసితివో తెల్పుము.

**(పుత్రీయయా కిల . . . వృషాంకాత్)** – ఈ వృత్తాంతమును ఈ స్తుతిలోని 11వ శ్లోకములో **"తం వందసే కిల తత శ్చ వరం వృణీషే"** అనుచు కూరేశులు పేర్కొనిరి. ఇది హరివంశములోని భవిష్యపర్వము 49వ అధ్యాయమునందు **"తత్రోపాస్య మహాదేవం శంకరం నీలలోహితమ్, . . . స చ మే దాస్యతే పుత్రం తోషిత స్తపసా మయా"** ఇత్యాదిగా ప్రస్తుతము.

**(అక్షేషు . . భవతా విదగ్ధా)** – తనను వాసుదేవునిగా చెప్పుకొనుచు అహంకరించిన పౌండ్రకుని శ్రీకృష్ణుడు సంహరించెను. కలివైరిసూరి ఈ వృత్తాంతమును **"పుకరా రురువాకి మునిన్దవనై పుకల్ వీఙ్గ మునిన్దు ఉయిరుణ్డు"** (2-4-7) అనుచు స్మరించిరి. తన స్నేహితుడగు పౌండ్రకుని వధను వినిన కాశీరాజు కృష్ణుని, యాదవులను, ద్వారకను నాశనము చేయవలెనని తలచి, శివుని అనుగ్రహమును పొంది, ఒక కృత్యను సృష్టించి దానిని ద్వారకపై ప్రయోగించెను. అది ద్వారకకు వచ్చి, అచటి జనులను బాధింపసాగినది. దీనిని విని కృష్ణుడు పాచికలాడుటలో ఆసక్తుడైయుండియే సుదర్శనమును ఆకృత్యపై ప్రయోగించెను. ఆ సుదర్శనము కృత్యను తఱిమికొట్టి, దహించుటయేకాక, కాశీనగరమునుకూడ భస్మముచేసి, తిరిగి కృష్ణునివద్దకు వచ్చెను.

**(జాతం కుతః తదకృతజ్ఞవిచేష్టితమ్)** – ఏ శివునివలన పుత్రార్థవరలాభము నీకు కల్గినదో, ఆ శివుని పట్టణమైన కాశినే దహించుట కృతఘ్నతయే కదా! **"కృతీ కృతజ్ఞః"**

**(స్తోత్రరత్న-18)** అని, **"కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణగుణగణౌఘః" (శరణాగతిగద్య)** అనియు కీర్తింపబడు నీకు ఇది తగునా ?

**(నిరాదరేణ) – "అవాకీ అనాదరః"** అని వేదముచే ప్రస్తుతింపబడు అవాప్త సమస్తకాముడవగు నీచే అని అర్థము. ఈ శ్రుతివాక్యములోని అనాదరశబ్దమును భగవద్రామానుజులు **"అవాప్తసమస్తకామత్వేన ఆదర్తవ్యాభావాత్ ఆదరరహితః"** అని, **"పరిపూర్ణైశ్వర్యత్వాత్ బ్రహ్మాదిస్తంబపర్యంతం నిఖిలం జగత్ తృణీకృత్య జోష మాసీన ఇత్యర్థః"** అని వివరించిరికదా! అవాప్తసమస్తకాముడగు సర్వేశ్వరునకు పుత్రప్రార్థనాదులు మనుష్యత్వ విడంబనకు అనుగుణములగుటచే కృతఘ్నతకు ప్రసక్తిలేశముకూడ లేదని సమాధానమని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య. **"క్రీడతో బాలకస్యేవ చేష్టా మస్య నిశామయ" (విష్ణు.1-2-18)** అనునపుడువలె ఇది ఒకవిధమైన, క్రీడార్థమైన చిలిపి పని అనియు అర్థమని వేరొకవ్యాఖ్య. **"సర్వేశ్వరస్య తవ పుత్రప్రార్థనాదికం మనుష్యత్వవిడంబనానుగుణ మితి నిష్కృష్టతాత్పర్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(అక్షేషు సక్తమతినా) – "చక్ర ముత్సృష్ట మక్షేషు క్రీడాసక్తేన లీలయా"** అను విష్ణుపురాణ వచనమును గమనింపనగును. దీనిని శఠకోపసూరి తిరువాయ్‌మొళ్రిలో **"కరుదు మిడమ్ పొరుదు పునల్"** అని ప్రస్తుతించిరి అని నమ్బిళ్లైవ్యాఖ్య.

**58.** **సంజీవయ న్నపి మృతం సుత ముత్తరాయాః**
**సాందీపినే శ్చిర మృతం సుతమానయం శ్చ ।**
**ధామ్నో నిజా ద్ద్విజసుతాన్ పున రానయ న్స్వా**
**స్వా మేవ తాం తను మహో కథ మానయ స్త్వమ్ ॥**

మృతమ్ = చనిపోయిన, ఉత్తరాయాః = ఉత్తరయొక్క, సుతం = కుమారుని, సంజీవయన్+ అపి = తిరిగి బ్రతికించువాడవై, చిరమృతం = చాలాకాలము క్రితమే మరణించిన, సాందీపినేః = సాందీపినిమహర్షియొక్క, సుతం = కుమారుని, ఆనయన్ చ = తిరిగి తీసికొనివచ్చువాడవై, ద్విజసుతాన్ = బ్రాహ్మణపుత్రులను, పునః ఆనయన్ వా = తిరిగి తీసికొని వచ్చువాడవైన, త్వం = నీవు, స్వామ్ ఏవ = వారి వారికి చెందిన, తాం = ఆ, తనుం = శరీరమునే, కథం = ఎట్లు, ఆనయః = తీసికొనివచ్చితివి?, అహో = ఆశ్చర్యము.

ఈ శ్లోకమును కూరేశులు పెరియాళ్వార్ తిరుమొళ్రిలోని **"మాదవత్తోన్ పుత్తిరన్ పోయ్"** అను దశకములోని (4-8) మొదటి మూడు పాశురములలో ప్రస్తావించిన మూడు వృత్తాంతములను పురస్కరించుకొని రచించిరి అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

స్వామీ! ఉత్తరాగర్భములో మరణించిన కుమారుని తిరిగి బతికించితివి. చనిపోయిన సాందీపిని మహర్షికుమారుని, వైదికపుత్రులను తిరిగి తీసికొని వచ్చితివి. సరియే. కాని ఎపుడో



చనిపోయిన వారి వారి శరీరములనే ఎట్లు తిరిగి కొనిరాగల్గితివి! ఇది ఆశ్చర్యము, అతిమానుషమును కదా!

**(మృతమ్ ఉత్తరాయాః సుతం సంజీవయన్ అపి) – "మరుమకళ్ తన్ శన్తతియై ఉయిర్‌మీట్టు" (పెరియా.4-8-3)** అని, **"ఉత్తరైతన్ శిఱువనైయు ముయ్యక్కొణ్డ వుయిరాళన్" (పెరియా.4-9-6)** అనియు ఆళ్వార్లు కీర్తించిన వృత్తాంతమిది. అర్జునపుత్రుడగు అభిమన్యువునకు, విరాటరాజు కుమార్తెయగు ఉత్తరకును పుట్టినవాడు పరీక్షిత్తు. మహాభారతయుద్ధములో పదునెనిమిదవనాటి పోరులో భీమసేనునిచే ఓడింపబడిన దుర్యోధనుడు, ప్రాణావశిష్టుడై యుద్ధరంగమున పడియుండగా, అతనికి ఓదార్పుమాటలను పల్కి, పాండవులను ఆనాటి రాత్రిలోనే తాను వధించి, తిరిగి వత్తునని పల్కిన ద్రోణపుత్రుడు అశ్వత్థామ ఆ రాత్రిలో పాండవుల శిబిరమును ప్రవేశించి, అచట నిద్రించుచున్న పలువురను వధించునపుడు పాండవుల కుమారులగు ఉపపాండవులను పాండవులనియే తలచి, వారి శిరస్సులను ఖండించి, వెడలిపోయెను. పిమ్మట పుత్రశోకముతో దుఃఖించిన ద్రౌపదిని ఆశ్వాసపఱచి అర్జునుడు అశ్వత్థామను ఎదిరించి, యుద్ధముచేసి, జయించి, అతనిని భంగపఱచినపుడు అశ్వత్థామ పాండవవంశమును సమూలముగా నాశనము చేయగోరి బ్రహ్మాస్త్రమును ప్రయోగింపగా, అది పాండవులను చంపుటకు వారిపైకి వచ్చెను. అపుడు శ్రీకృష్ణుడు దానిపై చక్రాయుధమును విడువగా బ్రహ్మాస్త్రము భయపడి పారిపోయి, ఉత్తరగర్భములోని శిశువును దహించెను. అందుచే కాలిన కట్టెవలె జన్మించిన ఆ శిశువును శ్రీకృష్ణుడు **"యది మే బ్రహ్మచర్యం స్యాత్ సత్యం చ మయి తిష్ఠతి, అవ్యాహతం మమైశ్వర్యం తేన జీవతు బాలకః" (మహాభారతమ్.)** అని ప్రతిజ్ఞచేసి, **"పాదేన కమలాభేన బ్రహ్మరుద్రార్చితేన చ, పస్పర్శ పుండరీకాక్షః ఆపాదతలమస్తకమ్" (మహాభారతమ్)** అనునట్లు తన శ్రీపాదముతో పాదముల మొదలు శిరస్సువరకు ఆ శిశువును తాకెను. అపుడు ఆ శిశువు ప్రాణములను పొంది, పరీక్షిత్తు అను పేరును కల్గినదయ్యెను. ఇట్లు ఉత్తర గర్భమునుండి పుట్టిన దగ్ధశిశువును జన్మించిన వెంటనే బ్రతికించినను, అపాండవాస్త్రప్రభావముచే కాలిపోయిన శిశువు శరీరమునకు పూర్వస్థితిని కల్గించి, బ్రతికించుట ఆశ్చర్యకరము కదా!. **"ఉత్తరాసుతస్య కాలవిప్రకర్షాభావేఽపి భస్మీభూతస్య తస్య శరీరస్య ఆనయన మాశ్చర్యావహ మితి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(సాందీపినేః . . . ఆనయం శ్చ) – "మాదదవత్తోన్ పుత్తిరన్ పోయ్ మఱికడల్‌వాయ్ మాణ్డానై ఓదువిత్త తక్కణైయా ఉరువువురువే కొడుత్తాన్" (పెరియా.4-8-1)** అనుచు స్తుతింపబడిన కథ ఇది. శ్రీకృష్ణుడు, బలరాముడును సాందీపిని అను అవంతీపురవాసియైన మహర్షివద్ద విద్యాభ్యాసమును పూర్తి చేసిన పిమ్మట, గురుదక్షిణను సమర్పింపవలెనని తలచినపుడు ఆ మహర్షి శ్రీకృష్ణుని అతిమానుషలీలలను తెలిసినవాడగుటచే, అంతకు చాలకాలమునకు ముందే సముద్రములో ప్రభాసతీర్థమందు పంచజనుడను రాక్షసునిచే భక్షింపబడిన తన పుత్రుని తిరిగి బ్రతికించి, తీసికొని వచ్చి ఇమ్మని కోఱెను. ఆ బాలుని స్వామి **"తం బాలం యాతనాసంస్థం**

**యథాపూర్వశరీరిణం, పిత్రే ప్రదత్తవాన్ కృష్ణః"** అనునట్లు తిరిగి ఆ శరీరముతోనే కొనివచ్చి, సాందీపినికి ఇచ్చెను. ఈ కథను కలియన్ (5-8-7, 6-5-7) కూడ ప్రస్తావించిరి.

**(ధామ్నో ద్విజాన్ . . . ఆనయన్ వా)** – ఇది **"శుడరొళియాయ్నిన్ఱ తన్నుడైచ్చోదియిల్ వైదికన్ పిళ్లైగళై ఉడలొడుమ్ కొణ్డు కొడుత్తవన్" (తి.వా.3-10-5)** అని నమ్మాళ్వార్లు కూడ కీర్తించిన వృత్తాంతము. దీనిని కలియన్ (5-8-8), భట్టనాథులు (1-5-7, 4-8-2) ను కూడ స్తుతించిరి. ద్వారకలోని ఒక బ్రాహ్మణునకు పుట్టిన బిడ్డలు పుట్టినట్లే చనిపోవుచుండిరి. నాల్గవమాఱు తన భార్య ప్రసవించు సమయమున అతడు కృష్ణుని వద్దకువచ్చి, ఈ ఒక్క కుమారుని అయినను రక్షింపవలెనని ప్రార్థించెను. కృష్ణుడును అట్లే చేసెదననెను. పిమ్మట ఏకాహదీక్షతో కూడిన క్రతువును శ్రీకృష్ణుడు చేయునపుడు, బ్రాహ్మణుని భార్య ప్రసవించు సమయమయ్యెను. శ్రీకృష్ణుడు ఆ బాలుని రక్షింపగోరి పోవుచుండగా, అర్జునుడు దీక్షలోనున్న స్వామిని వలదని, తానే రక్షింతునని పల్కి, బ్రాహ్మణునితో కలసిపోయి సూతికాగృహము చుట్టును గాలి కూడ లోపలకు పోవుటకు వీలులేనట్లు బాణములను ప్రయోగించి, కట్టడి చేసెను. కాని, బ్రాహ్మణకుమారుడు పుట్టినవెంటనే కనుపింపకుండపోయెను. అపుడు దుఃఖావేశముతో బ్రాహ్మణుడు అర్జునునితో "క్షత్రియాధమా! నీవల్లనేకదా నా పుత్రుని పోగొట్టుకొంటిని!. కృష్ణుడు వచ్చి రక్షించెదనని అనగా, అతనికి నీవే అడ్డుపడితివి!" అని నిందించుచు, అతనిని శ్రీకృష్ణునివద్దకు గెంటుచు తీసికొనివచ్చెను. అంత స్వామి చిఱునవ్వు నవ్వి, "నీవు అర్జునుని విడువుము, నీ కుమారులను తిరిగి తీసికొనివచ్చి నీకు ఇచ్చెదను" అని బ్రాహ్మణునితో పల్కి, పరమపదమునకు పోయి, బ్రాహ్మణపుత్రులు నలుగురను **"విప్రాయ దదతుః పుత్రాన్ యథారూపం యథావయః"** అని తీసికొనివచ్చి ఇచ్చిన కథ ఇచటి ప్రమేయము. ఇట్లు సాందీపిని కుమారుడు, బ్రాహ్మణపుత్రులును ఎపుడో చనిపోయినను, వారిని అదే శరీరములతో తీసికొనివచ్చుట అతిమానుషచేష్టితము. **"అత్ర సంజీవనం, పుత్రానయనం కథంచిత్ ఘటతామ్, కాలవిప్రకర్షేఽపి యథాపూర్వతాదృశతనుసన్నివేశ ఆశ్చర్య మితి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. హరివంశములో వైదికపుత్రులు నల్గురు అని, శ్రీభాగవతములో పదిమంది అని కలదు. ఈ వ్యత్యాసమునకు కల్పభేదమునుబట్టి సమాధానము తెలుపనగును. ఈ మూడు వృత్తాంతములను కూరేశులు సుందరబాహుస్తవములోని (124) **"సాందీపినృభిజం మృతం ద్విజసుతాన్ బాలాం శ్చ వైకుంఠగాన్, గర్భం చార్జునిసంభవం వ్యుదధరః స్వేనైవ రూపేణ యః"** అని అనుసంధించిరి.

అట్లయినచో, **"న చ పునరావర్తతే"** అనెడి శాస్త్రమర్యాదకు భంగము కల్గినట్లే కదా! అనినచో, కర్మజ్ఞానభక్తిప్రపత్తులు మొదలగు ఉపాయములను అనుష్ఠించి, దాని ఫలముగా మోక్షమును పొందినవారు మాత్రమే అచటినుండి తిరిగిరారు, వైదికపుత్రులు అట్టి వారు కారు. కావున శాస్త్ర విరోధము లేదు. **"అధృతః"** (846) అను నామమునకు భాష్యమును అనుగ్రహించుచు శ్రీపరాశరభట్టరు – **"అసిద్ధసమాధయో హి వైదికపుత్రాః తత్సంకల్పాత్ అపునరావృత్తి పరమపదం ప్రాపుః, భవావర్తేన పున రావర్తంతే చ చిదచిత్స్వరూప విపర్యాససామర్థ్యోఽప్యసౌ కస్యాపి హేతో ర్న విపర్యాసయతి"** అని పల్కుట ఇచట అనుసంధేయము. పరమపదములోని దివ్యదేవేరులు శ్రీకృష్ణుని సౌందర్యమును దర్శింపగోరి, తమ స్వాతంత్ర్యము కారణముగా ఈ పాంచభౌతికశరీరముతోనే బ్రాహ్మణబాలకులను పరమపదమునకు తీసికొనిపోగా, వారిని అపునరావృత్తిలోకమగు అచటినుండి స్వామి తీసికొనివచ్చుటచే శాస్త్రబాధకము కాదు అనియు కొందఱు అందురు. ఇట్లు వీరిని అందఱిని ఆ శరీరములతోనే బ్రతికించుట భగవానుని అఘటితఘటనాసామర్థ్యమును సూచించుచున్నది. **"పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే ఇత్యుక్త సర్వశక్తేః అఘటిత ఘటనయా సంభవతీతిభావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. రామానుజాచార్యవ్యాఖ్యలో – **"తత్ర నివసతా శ్రీకృష్ణార్జునసముత్సుకేన విష్ణునా దత్తాన్"** అని కలదు. దీనికి మూలము అన్వేషణీయము.



**59.** **అదాఽపి నాస్త్యుపరతి స్త్రివిధాపచారాత్**
**పాపః పరే నిపతితోఽస్మి తమస్యపారే ।**
**ఏతాదృశోఽహ మగతి ర్భవతో దయాయాః**
**పాత్రం త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥**

త్రివిధాపచారాత్ = (భగవదపచార – భాగవతాపచార – అసహ్యాపచారములు అను) మూడువిధములైన అపచారములను చేయుటనుండి, ఉపరతిః = విరమించుట, అద్య + అపి = ఈనాడును, న + అస్తి = లేదు, పాపః = పాపియగు నేను, పరే = గొప్పది అయిన, అపారే = అంతులేని, (దాటుటకు వీలులేని), తమసి = అజ్ఞానములో, నిపతితః = పడినవాడనై, అస్మి = ఉన్నాను, ఏతాదృశః = ఇట్టివాడనై, అగతిః = ఉపాయాంతర శూన్యుడనై, భవతః = నీ యొక్క, దయాయాః = దయకు, పాత్రం = పాత్రమైయున్న, అహం = నేను, త్వదీయ = నీ, చరణౌ = పాదములను, శరణం = ఉపాయముగా, ప్రపద్యే = పొందుచున్నాను.

ఇంతవరకు కూరేశులు భగవానుని పలు అవతారములలోని అతిమానుషలీలలను అనుసంధించి, చివరి మూడుశ్లోకములలో స్వీయగుణానుసంధానము చేయుచున్నారు. స్వీయగుణానుసంధానమనగా పూర్వము అనుభవించిన, భగవద్గుణములకు ప్రతిద్వంద్వియైన తమ నైచ్యమును అనుసంధించుటయే. ఇందు ప్రధానముగా తమ ఆకించన్య, అనన్యగతిత్వములను విన్నపించుచు శరణాగతిచేయుచున్నారు. **"ప్రబంధం పరిసమాపయితుకామః శరణాగతిపూర్వకం స్వాభిమతం ప్రార్థయతే శ్లోకత్రయేణ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. మొదట అర్చామూర్తియైన శ్రీరంగనాథుని నాల్గు శ్లోకములతో, పిమ్మట వ్యూహరూపమును ఒక శ్లోకముతో, పిమ్మట రెండు శ్లోకములతో పరరూపమును, ఆ తరువాత విభవావతారమునుగూర్చి రెండు శ్లోకములతో కూరేశులు స్తుతించిరి. (మూడవ శ్లోకములో **"శ్రీమత్పరాంకుశమునీంద్రమనోనివాసాత్"** అనుచు అంతర్యామి రూపమును ప్రస్తావించుటచే ఇందు ప్రధానము విభవమైనను భగవానుని పరవ్యూహాది రూపములైదును తెలుపబడినవి) అనంతరము వామన – నృసింహ – వటపత్రశాయి – విష్ణురూప–

ఉపేంద్ర – క్షీరాబ్ధిమథన – శ్రీరామ – శ్రీకృష్ణావతారముల అతిమానుషవైభవమును విస్తృతముగా స్తుతించి, చివరలో అర్చామూర్తియగు శ్రీరంగనాథుని పాదములందు ప్రపత్తిని చేయుచున్నారు. ద్వయములోని పూర్వఖండార్థమైన శరణాగతి అర్చామూర్తివిషయమున, ఉత్తరఖండార్థమైన కైంకర్యప్రార్థన పరమపదనాథుని విషయమున చేయనగును అని కదా పూర్వాచార్యోక్తి.

భగవదపచార–భాగవతాపచార–అసహ్యాపచారములను మూడు విధములైన అపచారములను చేయుటను ఈనాటికిని నేను మానలేదు. **"అధోఽధః పాపాత్మా శరణద నిమజ్జామి తమసి"** అనునట్లు అంతులేని అజ్ఞానములో పడి, అలమటించుచున్నాను. ఇట్టి నేను వేరు గతిలేనివాడనై, నీ దయకే పాత్రమై, నీ పాదములను శరణముగా ఆశ్రయించితిని. స్వామీ! అనుగ్రహింపుము.

**(అద్యాఽపి)** – ఆచార్యసంబంధమును పొందిన పిమ్మటకూడ అని అర్థము. **"ఆచార్యసమాశ్రయణానంతర మపి"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"రామానుజార్య విషయీకృతమ ప్యహో మాం భూయః ప్రధర్షయతి వైషయికో విమోహః" (91)** అని కదా వైకుంఠస్తవములోని వీరి సూక్తి.

**(ఉపరతిః)** – పాపకర్మలనుండి నివర్తించుట, చేసిన పాపములకు ప్రాయశ్చిత్తముగా కొన్ని కర్మలను విధించుటకు ముందు, **"అనుతాపా దుపరమాత్ ప్రాయశ్చిత్తోన్ముఖత్వతః, తత్పూరణాం చాపి పాపాః సర్వే నశ్యంతి పాదశః"** అనునట్లు "ఇకపై ఇట్టి దుష్కర్మలను చేయను" అనెడి ఉపరతి, "అయ్యో! అట్లు చేసితినే!" అను అనుతాపము, "చేసినదానికి ఏది ప్రాయశ్చిత్తము" అని విచారించుట, పిమ్మట విధింపబడిన ప్రాయశ్చిత్తమును అనుష్ఠించుట – అను నాల్గింటి వలన చేసిన పాపములు నశించును అని తెలుపబడినది. ఇట్టివి ఏవియు లేవు అని తాత్పర్యము.

**(త్రివిధాపచారాత్)** – అర్చామూర్తిని ప్రాకృతద్రవ్యమయమూర్తిగా ఎంచుట మొదలగునవి భగవదపచారములు. అర్థకామాదులవశమున భాగవతులపట్ల చేయు అపచారములు, వారి జన్మనిరూపణ, జ్ఞాననిరూపణాదులు భాగవతాపచారములు. **"విద్యాచోరో గురుద్రోహః"** ఇత్యాదులు ఆచార్యవిషయాపచారములు అసహ్యాపచారములు. లేక, **"మనోవాక్కాయైః"** అనుచు శ్రీరామానుజులు అనుగ్రహించినట్లు కాయిక, వాచిక, మానసికములైన మూడు విధములగు అపచారములనియు అర్థము. **"వాచికైః పక్షిమృగతాం మానసై రంత్యజాతితామ్, శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః"** అని కదా మనువచనము.

**(పాపః పరే)** – పాపముచేయువాడను అనుటచే కర్మయోగము చేయలేదనుట, కావుననే **"తమసి నిపతితోఽస్మి"** అనుటచే **"కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే"** అనునట్లు కర్మయోగసాధ్యమైన జ్ఞానయోగరాహిత్యమును, అట్లే, మూడు విధములైన అపచారములను చేయుటనుండి విరమించుట జ్ఞానమువలననే సాధ్యమగుటవలన అది లేదనుటచే జ్ఞానయోగాభావమును తెలుపబడినవని, కర్మజ్ఞానయోగసాధ్యమైన భక్తియోగము లేకుండుట ఈ రెండింటి అభావముచే సూచింపబడినదని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.



**(అపారే తమసి నిపతితోఽస్మి)** – ఇచటి తమశ్శబ్దము అజ్ఞానార్థకము. దీనివలన జ్ఞానరాహిత్యము, తద్ద్వారా భక్తిరాహిత్యము వ్యక్తములని రామానుజాచార్యవ్యాఖ్య. **"అనేన జ్ఞానరాహిత్య ముక్తమ్, భక్తిరాహిత్యం చార్థసిద్ధమ్"** అని అచటి వివరణము. – ఏతావతా ఆకించన్యము తెలుపబడినది.

**(అగతిః)** పూర్వము **"అహ మస్మి అపరాధానా మాలయః, అకించనః"** అనునవి తెలుపబడగా, దీనివలన అనన్యగతిత్వము తెలుపబడినది. **"అంగసంపత్తిరహితోఽహమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(భవతో దయాయాః పాత్రమ్)** – ఈ విధముగా అకించనుడను, అనన్యగతిని. కావుననే నేను నీ దయకు పాత్రమైతిని అని అర్థము. శ్రీయామునుల **"అనుత్తమమ్ పాత్ర మిదం దయాయాః" (స్తోత్రరత్న.24)** అను సూక్తి ఇచట భావ్యము.

**(త్వదీయచరణౌ శరణం ప్రపద్యే)** – ద్వయమంత్రమునందలి, పూర్వార్ధములోని పదములను, అర్థములను ఇంచుమించు యథాతథముగా ఇచట అనుసంధింపబడిన తీరు మిక్కిలి మధురము. ఈ శ్లోకమున యామునుల స్తోత్రరత్నములోని **"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాన్ త్వచ్చరణారవిందే, అకించనోఽనన్యగతిః శరణ్య త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" (22)** అను శ్లోకార్థము ఉపబృంహితము అనుట స్పష్టము. ఇట్లు ఆకించన్య, అనన్యగతిత్వపురస్సరముగా భగవచ్చరణారవిందములలో శరణాగతి చేయబడినది.

శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో **"త్రివిధాపచారాత్ ఉపరతిః నాస్తి"** అనుటచే ప్రాతికూల్యవర్జనము లేకుండుట, **"పాపః"** అనుటచే ఆనుకూల్య సంకల్పము లేకుండుట, **"తమసి నిపతితోఽస్మి"** అనుటచే మహావిశ్వాసము లేకుండుట తెలుపబడినవని, ఇట్టి నేను అగతిని అనగా – ప్రపత్తికి అవసరమైన అంగసంపత్తి ఏమియులేనివాడను; కావున నీ దయకు పాత్రమైతిని **(అత ఏవ భవతో దయాయాః పాత్రమ్)** అని ఏర్పడుటచే భగవానుని కృప నిర్హేతుకమని, అదియే ఉత్తారకమని స్పష్టమగుచున్నదని చెప్పబడినది. **"అకించనానాం కృపైవ ఉత్తారికేతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇచట వక్తవ్యాంశములు అనేకములున్నను విస్తరభీతిచే విడువబడినవి.

**60.** **విస్రంభణం త్వయి న యద్యపి మేఽస్తి నాఽపి**
**శ్రద్ధా యథోక్తవచనార్థగతా తథాఽపి ।**
**వాచం త్విమాం సకృదథాఽప్యసకృ న్మయోక్తాం**

**సత్యాం కురుష్వ దయయైవ దయైకసింధో ॥**

దయా + ఏకసింధో = కరుణకు అద్వితీయ సముద్రమువంటి స్వామీ!, త్వయి = నీయందు, విస్రంభణం = మహావిశ్వాసము, మే = నాకు, యద్యపి నాస్తి = లేకున్నను, యథా + ఉక్తవచన + అర్థగతా = **"త్వదీయచరణౌ శరణం ప్రపద్యే"** అని నేను పూర్వము పల్కిన మాటయొక్క అర్థమునకు చెందిన, శ్రద్ధా అపి = శ్రద్ధ కూడ, (మే యద్యపి నాస్తి = నాకు లేకున్నను), సకృత్= ఒక మారు, మయా = నాచే, ఉక్తాం = పలుకబడిన, ఇమామ్ వాచం = ఈ వాక్కును, అథాపి= ఇంకను, అసకృత్ ఉక్తాం = పలుమార్లు చెప్పబడినదిగా, సత్యాం = యథార్థమైనదిగా, దయయా+ ఏవ = నీ దయచేతనే, కురుష్వ = చేయుము.

పూర్వశ్లోకములోని **"త్వదీయచరణౌ శరణం ప్రపద్యే"** అను శరణవరణము కూడ మనః పూర్వకమైనది కాదు, వికలాంగమును, కావున ఆ వరణమును కేవలము వ్యాజమాత్రమే. నీ దయయే ఆవశ్యకములను అన్నిటిని పూర్తిచేసి, ఉద్ధరింపగల్గినది అని ఇందు కూరేశులు పల్కుచున్నారని రామానుజాచార్యవ్యాఖ్య.

దయాసింధూ! నీపట్ల నాకు మహావిశ్వాసము లేకపోవుట మాత్రమే కాదు. **"త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే"** అనుచు ముందు నేను పల్కిన శరణాగతివాక్యమునందును అధ్యవసాయమును కలవాడనుకాను సుమా! ఇట్లయినచో నన్ను నీవు అనుగ్రహించుటకు హేతువేమియు లేదని అనుకొనుచుంటివా! నీ దయవలన దానికి కొఱతలేదు కదా! **"త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే"** అనుచు ఒక్కమారు, నేను పల్కిన మాటనే నేను పలుమార్లు పల్కినట్లుగా, అది హృదయపూర్వకముగా పల్కినట్లుగా, కావున పరమార్థముగా (సత్యముగా) పల్కినదిగా చేసి గ్రహింపగల్గిన నీ దయకు లోటులేనపుడు, ఇక నా కార్యము నెఱవేఱినట్లే కదా!

ఇందుచే ఇచట **"నిన్నరుళే పురిన్దిరున్దేన్ ఇని ఎన్ తిరుక్కుఱిప్పే"** అను భట్టనాథుల సూక్త్యర్థము అనుసంధింపబడినదనదగును. నిర్హేతుకభగవత్కృపయే యాదృచ్ఛికము, ప్రాసంగికము, ఆనుషంగికము మొదలగు సుకృతలవలేశములను బహుగుణీకృతముచేసి (ఒకటిని పదింతలుచేసి) కార్యము సఫలమొనర్పగలదను శాస్త్రార్థ మిచట శిక్షితమని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య

**(త్వయి విస్రంభణం యద్యపి నాస్తి) – "రక్షిష్యతీతి విశ్వాసః"** అనునట్లు శాస్త్రములో శరణాగతి అంగముగా తెలుపబడిన భగవానుడు సర్వరక్షకుడు, సర్వస్వామి, కావున అతడు ఎట్లయినను రక్షించునను విశ్వాసము ఏమాత్రము లేదు. **"త్వయి ప్రపత్త్యవయవభూతో రక్షిష్యతీతి మహావిశ్వాసో నాస్తి"** అని రామానుజాచార్యవ్యాఖ్య.

**(శ్రద్ధా యథోక్త . . . గతా)** – నేను **"ఏతాదృశోఽహ మగతిః"** ఇత్యాదిగా చేసిన శరణాగతియందును నమ్మకమును లేదు. ఇచటి శ్రద్ధాపదము శరణాగతికి అంగముగా చెప్పబడు మహావిశ్వాసమును తెల్పునని వేరొక వ్యాఖ్య. **"ఉక్తి రనుష్ఠానపర్యవసాయినీ న భవతీతి యావత్"**



అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. నేను చెప్పినమాట అనుష్ఠానపర్యంతము అగుట లేదు అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(సకృత్ ఉక్తామ్) – "సకృ దేవ హి శాస్త్రార్థః"** అనునట్లు శరణాగతి చేయవలసినది ఒక్కమారే. **"సకృ దేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే" (18-32)** అని కదా భగవదుక్తి. **"నను ప్రపన్నః సకృదేవ నాథ తవాఽహ మస్మీతి చ యాచమానః" (స్తోత్రరత్న.-64)** అని అభిజ్ఞులైన ఆచార్యోక్తి.

**(అథాపి అసకృత్ మయోక్తామ్)** – ఇట్లు ఒక మారు పల్కినను పలుమార్లు పల్కినట్లుగా అని అణ్ణాస్వామివారి వ్యాఖ్య. ఒకసారి పల్కినను, పలుమార్లు పల్కినను – **"అథాపి అసకృదుక్తాం నిరంతర ముచ్చరితాం వా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"సకృద్వా అసకృద్వా"** అని రామానుజాచార్య వ్యాఖ్య. పూర్వము చేసిన ప్రపత్తిని పునః పునః పలుమార్లు పల్కుట మాటిమాటికి స్మరణకు తెచ్చుకొనుట కొఱకని వేరొకవ్యాఖ్య.

**(సత్యామ్)** – నిజమైనదిగా, అనగా – **"శిన్దైయాలుమ్ శొల్లాలుమ్ శెయ్కైయినాలుమ్" (తి.వా.6-5-11)** అనునట్లు కరణత్రయముతో చేసినదిగా అని గాని, మనఃపూర్వకముగా చేసినదిగా అని కాని అర్థము. **"కరణత్రయేణాప్యనుష్ఠితామ్, మనఃపూర్వికాయాం వా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

**(దయయైవ)** – ఇచటి ఏవకారముచే భగవానుని దయ ఒక్కటే సాంగమైన సాధనము, ప్రపత్తికాదని ఏర్పడుచున్నది. **"ఏవకారేణ దయైవ సాంగంసాధన మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"యత స్త్వం దయైకసింధుః ప్రపత్త్యనుష్ఠాన స్తు సకృదేవ, అసకృదుక్తి రాదరాత్. మమవాచికప్రపత్త్యనుష్ఠానమ్ యథాతథా వా స్యాత్, అథాపి సత్యాం సాంగాం సఫలాం కురుష్వేతిభావః"** అని రామానుజాచార్యవ్యాఖ్యలో ఈ శ్లోకభావము తెలుపబడినది.

**(దయైకసింధో)** – ఇది సాభిప్రాయవిశేషణము. కావున పరికరాలంకారము కలదు. నీవు దయకు సముద్రుడవు కావున నీ సహజదయతో నా ప్రపత్తిని సాంగముగా, సఫలముగా చేయుటలో లోటులేదని తాత్పర్యము. ఈ సంబోధనస్వారస్యమునుబట్టి ఇది వరదరాజస్వామిని ఉద్దేశించి చేసినదని శ్రీఅణ్ణాస్వామివారి అభిప్రాయము. "పేరరుళాళన్" అను పేరు ఆ స్వామికి కలదు కదా! ప్రారంభమున శ్రీరంగనాథుని శరణాగతిచేసి ఇపుడు వరదరాజస్వామిని శరణాగతి చేయుట ఏమి? అనినచో, వీరిరువురు వేరు కాదు. ధర్మ్యైక్యమునుబట్టి ఒక్కరే. **"విరైయార్పొழிల్ వేఙ్గడవన్ ... నీళ్ మదిళ్ అరఙ్గత్తమ్మాన్" (అమలనాది)** అనుచు తిరుప్పాణ్ వేంకటేశ్వరుడు, ఆ రంగనాథుడును ఒకరే అనిరి కదా! అట్లే, ఇచటను భావింపనగును.

**61. పాపీయసోఽపి శరణాగతశబ్దభాజో**
**నోపేక్షణం మమ తవోచిత మీశ్వరస్య ।**

**త్వజ్జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ**
**పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్ ॥**

పాపీయసః + అపి = పాపిష్ఠివాడనైనను, శరణాగతశబ్దభాజః = శరణాగతుడనను పేరును కల్గిన, మమ = నా యొక్క (నన్ను), ఉపేక్షణం = ఉపేక్షించుట, ఈశ్వరస్య = సర్వేశ్వరుడవగు, తవ = నీకు, న ఉచితమ్ = తగినది కాదు, త త్వత్ = నీ, జ్ఞానశక్తికరుణాసు= జ్ఞానము, శక్తి, కరుణ అను గుణములు, సతీషు = ఉండగా, ఇహ = ఇచట, మామకీనం = నా, పాపం = పాపము, పరాక్రమితుం = పరాక్రమించుటకు, న అర్హతి = తగదు.

రామానుజాచార్యవ్యాఖ్యలో – **"ఇత్థం శరణాగతి మనుష్ఠాయ, స్వయం పాపీయాని తృనుసందధానోఽపి భగవతో రక్షకత్వాదిగుణానుసంధానేన దృఢవిశ్వాసః సన్ స్వయం నిర్భరోఽస్మీత్యుచ్ఛ్వసతి"** – ఇట్లు శరణాగతిని అనుష్ఠించి, స్వయముగా నేను పాపిష్ఠివాడనను భావమును కల్గినవాడనైనను, భగవానుని రక్షకత్వాదిగుణముల అనుసంధానముచే దృఢమైన విశ్వాసమును పొందినవాడనై, నిర్భరుడనై యుంటినని సేదదీరితిని – అని రామానుజాచార్యవ్యాఖ్యలో ఈ శ్లోకమునకు అవతారిక కూర్చబడినది.

"దాసుడనగు నేను పాపములను పూర్ణముగా చేసినవాడనైనను, శరణాగతుడనను పేరును కల్గినవాడనగుటచే నన్ను ఉపేక్షించుట ఈశ్వరుడవగు నీకు తగినది కాదు సుమా! ఈశితవ్యరక్షణము ఈశ్వరుని కర్తవ్యము కదా!" అనుచు కూరేశులు భగవానునితో విన్నపింపగా, దానిని వినిన స్వామి "మీ పాపములు తీరిన వెంటనే మిమ్ములను రక్షించెదము లెండు" అని పల్కెను. అపుడు కూరేశులు – "స్వామీ! నీ సర్వజ్ఞత్వ–సర్వశక్తిత్వ–సర్వభూతసుహృత్త్వాది గుణముల ముందు నా పాపము అసత్కల్పమే కదా! ఇది ఏమి చేయగలదు? అకించిత్కరమైన నా పాపమును తృణముగా తలచి, అప్రహతిహతశక్తిని కల నీవు నీ కల్యాణగుణములనుగొని అనుగ్రహింపవలెను సుమా!" అని విన్నవించి, స్తోత్ర పరిసమాప్తిని చేసిరని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(శరణాగతశబ్దభాజః)** – **"దాసభూతః శరణాగతోఽస్మి తవాస్మి దాసః"** అని, **"యేన కేనాఽపి ప్రకారేణ ద్వయవక్తా త్వమ్"** అనియుగల శరణాగతిగద్యసూక్తిని అనుసరించి ఈ ప్రయోగము చేయబడినది. ఏవిధముగా శరణాగతి చేసినను ఫలమున లోపము లేదు అనికదా శాస్త్రార్థము. **"శరణాగతిశబ్దభాజః"** అను పాఠాంతరమునను అర్థభేదము లేదు. ఇది శ్రీనివాసాచార్య, రామానుజాచార్యవ్యాఖ్యలలో కలదు.

**(ఉపేక్షణమ్ ఈశ్వరస్య తవ నోచితమ్)** – సొత్తును రక్షించుకొనకపోవుట స్వామికే కదా లోటు. **"తవ"** అను సర్వనామమునకు **"యత్కించిద్వ్యాజమాత్రాపేక్షిణ స్తవ"** అను వివరణము రామానుజాచార్యవ్యాఖ్యలో చూపబడినది.

**(త్వజ్జ్ఞానశక్తికరుణాసు సతీషు)** – సమస్తకల్యాణగుణాత్మకుడగు భగవానునకు కల



గుణములు అనేకములైనను, శరణాగతి చేయు ఈ సందర్భమునకు అనుగుణముగా జ్ఞానము, శక్తి, కరుణ అను మూడు ముఖ్య గుణములు అనుసంధింపబడుచున్నవి. "ఇతడు అకించనుడు. వేరుగతి లేనివాడు. కావున తప్పక వీనిని రక్షింపవలెను" అని తెలియుటకు జ్ఞానము ఉపయోగపడుచున్నది. ఏవిధముగానైనను రక్షించుటకు స్వామి సమర్థుడని జీవుడు నమ్ముటకు శక్తి ఉపయోగపడును. శరణాగతుని రక్షింప స్వామి తలపెట్టినపుడు అడ్డుకొనువారు ఎవ్వరును లేరు. అన్నిటికి మించి "ఇతని తప్పక రక్షింపవలెను" అని ధృఢముగా స్వామి తలచుటకు కరుణ ఉపయోగపడుచున్నది. ఈ శ్లోకములో **"ఈశ్వరస్య త్వద్జ్ఞానశక్తికరుణాసు"** అనుచు ద్వయము పూర్వఖండములోని నారాయణపదముచే బోధింపబడు స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య, వాత్సల్య, జ్ఞాన, శక్తులనెడి ఆశ్రయణసౌకర్యాపాదక, ఆశ్రితకార్యాపాదకగుణములు ఆఱును సూచింపబడినవి. **"ఈశ్వరస్య"** అనుటచే స్వామిత్వము, కరుణాశబ్దముచే తత్కార్యములగు సౌలభ్యసౌశీల్యవాత్సల్యములును సూచితములు. **"ప్రతిబంధకీ భవితుమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య **"పరాక్రమితుమ్"** అనుటకు **"పున రపి సంసారే ప్రవర్తయితుమ్ ఇతి భావః"** అని రామానుజాచార్య వ్యాఖ్యా వివరణము. **"యథా తథా వాఽపి శరణాగత ఇత్యుక్తిమతాం ప్రతిబంధకపాపనిరసనద్వారా భగవచ్చరణారవిందనిరంతరదాస్యప్రదానదీక్షితాసు త్వత్ జ్ఞానశక్తికరుణాసు సతీషు మదీయం పాపం ఫలప్రతిబంధనాయ నాలమ్ ఇతి, భవతాఽహ మవశ్యం రక్షణీయ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానము.

జ్ఞానము, శక్తి, కరుణ అను ఈ మూడింటిలోకూడ కరుణయే మిక్కిలి ప్రధానమైనది. కరుణ లేనిచో మిగిలిన రెండు శరణాగతుని దండించుటకే ఉపయోగపడును. కావున దోషములే అగును. కావుననే దేశికులు **"దోషా భవేయు రేతే యది నామ దయే త్వయా వినాభూతాః"** అని పల్కిరి. ప్రకృతమున పూర్వశ్లోకములు రెండిటిలో **"భవతో దయాయాః"** అని, **"పాత్రం దయయైవ దయైకసింధోః"** అనియు పల్కుటచే **"త్వద్జ్ఞానశక్తికరుణాసు"** అనునపుడు దయయే ప్రధానసాధనమని, మిగిలిన రెండును అంగములేనను సంప్రదాయార్థము ధ్వనింపచేయబడినది అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"దయాయాః ప్రధానసాధనత్వం, జ్ఞానశక్త్యోః తదంగత్వమ్ ఇతి సంప్రదాయః"** అని ఆ వ్యాఖ్యలోని వివరణము. ఈ మూడు గుణములను ప్రస్తావించుటద్వారా కూరేశులు భగవానుని సిద్ధోపాయత్వపూర్తిని తెల్పిరి. దీనిని అనుసరించుచు దేశికులు **"జ్ఞానస్య కోఽవిషయోచ్యుత, కరుణాయా స్తవ కో దూరస్థితః, శక్తేః కోఽతిభారః తస్మాత్ ఖలూపాయ స్త్వ మేవ స్వయంసిద్ధః"** అనుచు అచ్యుతశతకములో పల్కిరి. కూరేశులు ఇట్లు జ్ఞానాదిగుణత్రయమును ప్రధానముగా పల్కుట **"సర్వజ్ఞోఽపి హి సర్వేశః సదా కారుణికోఽపి సన్"** అను ప్రమాణమును బట్టియేనని వ్యాఖ్యానాంతరము. మఱియు, ప్రకృతమున పూర్వోక్తప్రక్రియలో దయాగుణమునకు గల ప్రాధాన్యమునుబట్టి, ఆ దయాగుణమును నిరూపకముగాగల నామముచే పిలువబడు **"పేరరుళాళన్"**ను (కంచి వరదరాజస్వామిని) కూరేశులు శరణాగతి చేసిరని చెప్పుటలో

స్వారస్యమును కలదు కదా! మహా విద్వాన్ శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యయు దీనిని బలపఱచుచున్నది. ఇట్లు ఈ స్తుతిని **"వరయే"** అనుచు శరణాగతితో అంతట ప్రారంభించి, శరణాగతితోపూర్తిచేయుటచే ఈ స్తోత్రమున ద్వయార్థానుసంధానము చేయబడినదని స్పష్టమగుచున్నది.

యతిరాజనాథవల్ల్యాఽఽలింగితతను మాదికేశవం దేవమ్ ।
ఆమోదయతా ద్వాచాం సుమ మేతత్ తత్పదన్యస్తమ్ ॥

వ్యాఖ్యేయం భావనాభిఖ్యా మదాచార్యకృపోత్థితా ।
సద్గుణగ్రాహిణాం ప్రీత్యై విదుషాం కల్పతాం సతామ్ ॥

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥

శీరారుమ్ తిరుప్పతికళ్ శిఱక్క వన్దోన్ వాళ్ళియే ।
తెన్నరజ్గర్ శీరరుళై చ్చేరుమవన్ వాళ్ళియే ॥
పారారు మెతిరాశర్ పదమ్ పణిన్దోన్ వాళ్ళియే ।
పాషియనత్తి నుట్పొరుళై ప్పకరుమవన్ వాళ్ళియే ॥
నారాయణన్ శమయమ్ నాట్టినాన్ వాళ్ళియే ।
నాలూరాన్ తనక్కు ముత్తి నల్కినాన్ వాళ్ళియే ॥
ఏరారుమ్ తైయిలత్తత్తిఝ్గువన్దాన్ వాళ్ళియే ।
ఎళ్ళిల్ కూరత్తాళ్వాన్ తన్నిణై యడికళ్ వాళ్ళియే ॥

కూరత్తాళ్వాన్ తిరువడికళే శరణమ్ ॥







(గ్రంథప్రకాశకుల భగవద్విషయ కాలక్షేప ఆచార్యులు ఉ॥వే॥శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు వారి ధర్మపత్ని శ్రీమతి శేషవల్లిగారు)

## ఉ॥వే॥ శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారి వైభవవిశేషాలు

| | | |
|---|---|---|
| జననం | : | **1935**, వృశ్చికమాసం, అనురాధ |
| జననీజనకులు | : | శ్రీమతి వేంకటరాఘవమ్మగారు, ఉ॥వే॥ శ్రీమాన్ శ్రీనివాసరామానుజాచార్యస్వామివారు (నూజివీడు సంస్థాన ఆస్థానవిద్వాన్, ఉభయవేదాంత మహావిద్వాన్ శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారి ద్వితీయకుమారులు) |
| జన్మస్థలం | : | అంతర్వేదిపాలెం (తూ.గో.జిల్లా) |
| విద్యావ్యాసంగము | : | వేదసంస్కృతకళాశాల, నెల్లూరు |

సామాన్యశాస్త్రాలను బ్రహ్మశ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు, బ్రహ్మశ్రీ ఉదాలి సుబ్బరామశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ పుష్పగిరి వేంకటకృష్ణశర్మగారు, బ్రహ్మశ్రీ తంగిరాల శ్రీరామమూర్తిగార్ల సాన్నిధ్యంలో అధికరించి,
సంప్రదాయ శాస్త్రాధ్యయనమును ఉభయవేదాంతమహావిద్వాన్, వ్యాకరణశిరోమణి ఉ॥వే॥ శ్రీమాన్ కిదాంబి వేంకటనరసింహాచార్యస్వామివారు (పెదనాయనగారు), వాచస్పతి ఉ॥వే॥ శ్రీమాన్ శ్రీనివాసరామానుజాచార్యస్వామివార్ల సన్నిధులలో చేశారు.

వృత్తి వివరాలు : ప్రారంభంలో నరసాపురం మిషన్ హైస్కూల్‌లో తెలుగుపండితుడుగా, తరువాత వై.ఎన్. కళాశాల, నరసాపురంలో ఆంధ్రోపన్యాసకులుగా, ఆంధ్రశాఖాధ్యక్షులుగా పలువురికి విద్యాదానం చేశారు.
1985లో యు.జి.సి.వారి ఆర్థికసాహ్యంతో "తెలుగు–వెలుగు" పండితగోష్ఠి నిర్వహణ, బి.ఎ. పాఠ్యగ్రంథాల సంకలనం ఇత్యాదులు.

ప్రవృత్తి విశేషాలు : విశిష్టాద్వైతసంప్రదాయములో సుప్రసిద్ధోపన్యాసకులు.
నరసాపురంలోని ఆదికేశవ–ఎమ్బెరుమానార్‌స్వామివార్ల కోవెలలో స్థానాచార్యకైంకర్యనిర్వహణం, అచటి ఆదికేశవ–ఎమ్బెరుమానార్ స్వామివార్ల వర్షతిరునక్షత్ర మహోత్సవాలను వైభవంగా నిర్వహించడం, ఆసక్తి, ఆర్తి ఉన్నవారికి భగవద్విషయ, శ్రీవచనభూషణాది సంప్రదాయగ్రంథప్రవచనం ఇత్యాదులు. ఇప్పటికి రెండుమార్లు భగవద్విషయ కాలక్షేపాన్ని అనుగ్రహించారు.

పురస్కారాలు : 1987లో విజయవాడలో జరిగిన ఉభయవేదాంతసభలలో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణచిన్నజీయర్‌స్వామివారిచే "ద్రావిడవేదవిశిష్టపండిత" పురస్కారము
2001 లో హైదరాబాదు అష్టలక్ష్మి దేవాలయంలో జరిగిన బ్రహ్మోత్సవాలలో విశిష్టసన్మానం మొదలైనవి.

"వినయ సౌశీల్యాల చెలిమితో, వైదుష్యపు కలిమితో నిరహంకారంగా, ఆచితూచి పలికే వ్యక్తిత్వం వారిది. సంస్కారోచితం, ప్రామాణికం, ప్రకరణోచితం అయిన వారి



వాక్కు సంప్రదాయప్రవణులకు సిగపువ్వు" అని విజ్ఞులచే ప్రశంసింపబడిన వ్యక్తిత్వవైదుష్యాలను కలవారు వీరు.

చిరునామా : 16–14–1, కావలివారి వీధి, నరసాపురం
(ప.గో.జిల్లా)–534 275 ఫోన్ : 08814–275811






## నరసాపురం

అభినవభూతపురాధిప! కేశవ! భక్త్యా భవత్పదాబ్జయుగే ।
వాక్సుమ మర్పిత మేతత్ స్వీకురు యతిరాజనాథవల్లీశ ॥



## వ్యాఖ్యాత పరిచయం

పేరు : డా. ఈ.ఏ.శింగరాచార్యస్వామి
జననీజనకులు : శ్రీమతి సీతమ్మగారు, న్యాయవేదాంతవిద్వాన్ ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామి
జననం : 1951–ఖర–ఫాల్గుణం–శతభిషం
సంప్రదాయ గ్రంథాధ్యయనము : పితామహపాదులు ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారు, పితృపాదులు నాయవేదాంతవిద్వాన్ ఉ.వే. శ్రీమాన్ రంగాచార్యస్వామివార్ల సన్నిధులలో
విద్యార్హతలు : ఎమ్.ఏ. (సంస్కృతం) పి.హెచ్.డి., ఎమ్.ఏ. (తెలుగు) సాహిత్యాచార్య
విలాసము : 18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్డు, తిరుపతి–517 507
వృత్తి : సాహిత్యోపన్యాసకులు, శ్రీవేంకటేశ్వర ప్రాచ్యకళాశాల, తిరుపతి
ప్రవృత్తి : గ్రంథరచన, పఠనాదులు
ముద్రిత గ్రంథములు :
1. శ్రీరంగరాజస్తవము – పూర్వశతకము (వరివస్యా వ్యాఖ్యానము)
2. బాలగోపాల మంగళాశాసనము – వ్యాఖ్య
3. అనంతస్తవము – వ్యాఖ్య
4. అమలనాది పిరాన్ – వ్యాఖ్య
5. శ్రీరంగనాథసుప్రభాతమ్, ప్రపత్తి, మంగళాశాసనము – శ్రీసేవావ్యాఖ్యానము
6. గరుడదండకము – వ్యాఖ్యానము
7. శ్రీరంగనాథుని అభిషేకచూర్ణికలు, శ్రీరంగనాథస్తోత్రము, శ్రీరంగరాజవింశతి – శ్రీసేవావ్యాఖ్యానము
8. రఘువీరగద్యవ్యాఖ్యానము
9. ఇరామన్ నమదరణే – వ్యాఖ్యానము (శ్రీరామతీర్థక్షేత్రస్వామి స్తుతి)
10. పరమార్థస్తుతివ్యాఖ్య – నృసింహప్రియప్రచురణ
11. అష్టభుజాష్టకవ్యాఖ్య – నృసింహప్రియప్రచురణ
12. శ్రీరామానుజసహస్రనామస్తోత్రము – అనువాదము
13. శ్రీఉడైయవర్ తిరుమఞ్జనకట్టియమ్ – అనువాదము మొ॥

సప్తగిరి, భక్తినివేదన, శరణ్య, నృసింహప్రియ, ఆత్మజ్యోతి పత్రికలలో పలువ్యాసాలు.


శ్రీ ఎంబెరుమానార్ స్వామివారు (ఉత్సవమూర్తులు)

## నరసాపురం

**జయతు జయతు ధీరః సర్వవిద్యావిహారః**
**శమదమగుణపూరః సత్యనిత్యాధికారః ।**
**కుమతివనకుఠారః కుణ్డలీశావతారః**
**కలికలుషవిదారః కాన్తిమాన్ భాష్యకారః ॥**